## వారెవ్వా!



### గగనంలో గారడీ!

ఆరునెలల క్రితం 138 మంది స్కైడైవర్స్ అమెరికాలోని అట్టావాలో గాలిలో ఇలా తలకిందులుగా వేలాడుతూ ప్రపంచాన్ని అబ్బురపరిచారు. 2009లో 108 మంది నెలకొల్పిన పాత రికార్డును బద్దలు కొట్టేందుకు వీరు మూడు రోజులపాటు శ్రమించారు. ఈ ప్రదర్శన కోసం నాలుగు విమానాల్లో వెళ్లి భూమికి ఆరు

## అభిమాన పాఠకులకు సరికొత్త శీర్షిక

# చతుర ప్ర.జ.

ఆచార వ్యవహారాలు పాటించేప్పుడు ఏవేవో అనుమానాలు..
సంస్కృతీ సంప్రదాయాల పరంగా ఎన్నో సంశయాలు..
పురాణాలు, ఇతిహాసాలు చదువుతున్నప్పుడు ఎన్నెన్నో సందేహాలు..
మాతృభాషా వినియోగంలో మరెన్నో శంకలు..

మీ అనుమానాలు.. సంశయాలు.. సందేహాలు..
శంకలు అన్నీ సంక్షిప్తంగా రాసి మాకు పంపండి.

**పంచ సహస్రావధాన సార్వభౌమ డా. మేడసాని మోహన్**
**సమాధానాలు ఇస్తారు. పరిష్కారాలు సూచిస్తారు.**

**ప్రతినెలా ఉత్తమ ప్రశ్నకు రూ.116/- పారితోషికం**

# చతుర ప్ర.జ. - 2

ప్రశ్న: ..............................................................................
..............................................................................
..............................................................................
..............................................................................

పంపినవారి పేరు: ------------------------------------------

వయసు (    ) చిరునామా: ------------------------------------

------------------------------------------------------------

----------------- పిన్ : ------------ ఫోన్ : ----------------

**సూచనలు**

* ఉత్తమ ప్రశ్నను అవధాని డా. మేడసాని మోహన్ ఎంపిక చేస్తారు * మీ ప్రశ్న ద్వారా రాబట్టే సమాధానం పదుగురికీ ఉపయోగపడేలా ఉంటే మేలు. * ప్రశ్న స్పష్టంగా, సంక్షిప్తంగా ఉండాలి * ఒకరు ఎన్ని ప్రశ్నలయినా పంపవచ్చు. ఒక కూపన్‌పై ఒక్క ప్రశ్న మాత్రమే రాయాలి * తుడుపులు, కొట్టివేతలొద్దు * ప్రశ్నల ఎంపికలో సంపాదక వర్గానిదే తుది నిర్ణయం * ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు * ఈ కూపన్లు కూడా తక్కిన వాటితో కలిపి ఒకే కవరులో పంపవచ్చు

చిరునామా : **చతుర ప్ర.జ.**

చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

# మనసున ఉన్నదీ...

★ 'ఆకుపచ్చ విధ్వంసం' నవలలో రచయిత జటిలమైన, క్లిష్టతరమైన సమస్యను చక్కగా చిత్రించారు. ఇరు వర్గాల మధ్య వైషమ్యాలు, ఎతులు, పైఎత్తులు, పవర్ పాలిటిక్స్‌ను అద్భుతంగా చూపించారు. మనుగడకు ఆధారమైన నేలా నింగీ నీరూ కలుషితమవ్వడాన్ని ఎలా ఎదుర్కోవాలో గుండెల్ని తాకేలా, జనరంజకంగా రచయిత వ్యక్తీకరించడం అమోఘం. ప్రస్తుతం సమాజంలో జరుగుతున్న పరిణామాల ఆధారంగా రాసిన ఈ ఇతివృత్తాన్ని ధైర్యం చేసి ప్రచురించిన 'చతుర' సంపాదకులకు అభినందనలు.

**– యు. చిట్టిబాబు,** న్యూపాల్వంచ

★ 'ఆకుపచ్చ విధ్వంసం' నవలను హైదరాబాదులో జీవవైవిధ్యంపై అంతర్జాతీయ సదస్సు జరుగుతున్న వేళ ప్రచురించటం మాకు నచ్చింది. ఆ సదస్సులో జరుగుతున్న చర్చలూ, నవలా సారాంశం దాదాపు ఒకేలా ఉండటం గమనార్హం. నేడు ప్రపంచంలో జరుగుతున్న విధ్వంసాన్ని, ప్రజాప్రతినిధులు అమాయక ప్రజల కడుపుకోతలకు కారణమవుతున్న తీరునూ రచయిత శిరంశెట్టి కాంతారావు చక్కగా వివరించారు. గోరాశాస్త్రి చతురోక్తులను పరిచయం చేయడం కూడా చాలా బాగుంది.

**– రమణి,** బంజారా హిల్స్, హైదరాబాద్

★ తన తొలి నవల ద్వారానే రచయిత శిరంశెట్టి పాఠకులకు చేరువయ్యారు. ఉద్యమాలకు ఊపిరి ఎలా అందుతుందో, దాని ముందు వెనుకల పరిణామాలు ఎలా ఉంటాయో గొప్పగా చిత్రించారు. కొన్ని పోరాటాల యథార్థాలు తెలుసుకోవటం కష్టం. ఎందుకంటే పలురకాల ప్రచార, ప్రసార మాధ్యమాలు, విభిన్న మనస్తత్వాలు గల వ్యక్తులు ఒకే రీతిలో అన్ని సంగతులను బయటపెట్టడం అసాధ్యం. అలాంటప్పుడు నవల ద్వారా పాత్రలకు జీవం పోసి, యథార్థాలను వెల్లడించవచ్చు. ఎండమ్మను మొత్తం కథకి నాయకురాలిగా చేసి, మహిళల్లో దాగివున్న పోరాట పటిమను తెలియజేశారు. అభివృద్ధి ముసుగులు వేసుకుని ప్రపంచీకరణ, ప్రకృతిని ఎలా ఛిన్నాభిన్నం చేస్తోందో ఈ రచన ద్వారా తెలుసుకోవచ్చు. నవ్యత, ప్రయోగశీలతకు 'చతుర' వేదిక కావడం ఆనందంగా ఉంది.

**– డా. యిమ్మిడిశెట్టి చక్రపాణి,** అనకాపల్లి

★ 'ఆకుపచ్చ విధ్వంసం' నవలలోని ఊళ్ల పేర్లు చాలా బాగా ఆకట్టుకున్నాయి. రచయిత నల్గొండ జిల్లాలో పుట్టి, కృష్ణాజిల్లాలో విద్యాభ్యాసం చేసి, ప్రస్తుతం ఖమ్మం జిల్లాలో ఉంటున్నారు. అయినప్పటికీ కళింగాంధ్ర నేపథ్యంగా ఎంతో పరిశోధించి, శ్రమకోర్చి మంచి నవలను అందించారు. శైలి బాగుంది. నవల ఆద్యంతం ఏకబిగిన చదివించింది. మరిన్ని మంచి నవలల్ని ఆయన నుంచి ఆశిస్తున్నాం.

**– హరిప్రసాద్,** హైదరాబాద్

★ అక్టోబరు నవల 'ఆకుపచ్చ విధ్వంసం' చాలా బాగుంది. ఈ నవలలోని సంఘటనలు, కథ శ్రీకాకుళం జిల్లా సోంపేట మండలంలోని 'థర్మల్' పోరాటాన్ని గుర్తుకు తెచ్చింది. డబ్బుకు ఆశపడి భూమి అమ్ముకున్న రైతు తర్వాత పరిస్థితి ఏమిటని ఆలోచిస్తే ఇలాంటి పరిస్థితిరాదు.

**– కూన మల్లేశ్వరరావు,** శ్రీకాకుళం

★ 'ఆకుపచ్చ విధ్వంసం' నవల నేటి రాజకీయ, సాంఘిక పరిస్థితులకు దర్పణం పట్టింది. ధరలకు ఆశపడి భూముల్ని అమ్ముకుని, ఆ తర్వాత రైతులు ఎదుర్కొన్న చిక్కులు హృదయాన్ని కదిలించేలా ఉన్నాయి. మినీ కవితలైనా ఎంతో నిగూఢార్థాన్ని నింపుకుని వస్తున్నాయి 'కొత్తగాలులు'. 'చతుర ప్రపంచం' శీర్షిక ద్వారా అనేక కొత్త విషయాల్ని తెలుసుకుంటున్నాం.

**– కళాభూషణ్,** కర్నూలు

---


చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ఈ మెయిల్ : vipula.chatura@eenadu.net

సంపుటి -35 సంచిక - 10
418వ సంచిక, పేజీలు : 132
నవంబరు 2012

# చతుర



పుస్తకాలంకరణ : రాజు యాట

"ఏంటి మదన్.. ఎందుకంత సీరియస్‌గా ఉన్నావు?" అన్నాడు జయంత్.

"ఆరాని మధుగాడు లవ్ చేస్తున్నాడు" అన్నాడు.

"ఆరా అంటే?" అని ఆగిపోయాడు జయంత్.

"నువ్వు అనుకునే ఆరా కాదు. క్లాస్‌మేట్ ఆరావళి గురించి మాట్లాడుతున్నాను"

"ఆమెను మధు లవ్ చేయటం తప్పంటావా?"

"బస్సు సీట్లపైన టవల్ వేసినట్లుగా- 'ఈ అమ్మాయి నాది. ఎవరూ ప్రేమించకండి' అని అంటాడు వాడు"

"సరే, దానికి ఇప్పుడేం చేద్దామనుకుంటున్నావు?"

"ఎవరు ముందుగా ప్రేమను వ్యక్తం చేస్తే 'ఆరా' వారిదే" అన్నాడు మదన్.

ఇంతకీ ఆరావళిని ఎంతమంది ప్రేమిస్తున్నారు? నిజానికి ఆమె ఎవరిని ఇష్టపడింది?



కౌమారంలో చెలరేగే భావోద్వేగాల్ని తొలి ప్రేమ తాలూకు అనుభూతులను హృద్యంగా చిత్రించిన **సృజన్‌సేన్** నవల **ఆరావళి** ఆరో పేజీలో..

బొమ్మలు: రాకేశ్

ఆరావళిని పదో తరగతి నుండి ఆరాధిస్తున్నాడు జయంత్. ఆమె కూడా వయసు పొంగుతో అందంగా ఆకర్షణీయంగా తయారయింది. ఇద్దరూ అదే ఊరిలోని కాలేజీలో చేరారు. మనసులోనే ఆమెపై మరులుగొన్న జయంత్‌కు అక్కడ గట్టి పోటీదారులు ఎదురయ్యారు. కౌమారంలోని తొలిప్రేమ ఊసుల్ని, యవ్వనంలో మొగ్గతొడిగే భావోద్వేగాల్ని అత్యద్భుతంగా చిత్రించిన సృజన్‌సేన్ నవల **ఆరావళి** చతుర దీపావళి కానుక!



అదో కాలేజి..

సీతాకోక చిలుకల చిన్న చిన్న సమూహాలు ఎగిరి వస్తున్నట్లుగా...

రకరకాల రంగుల పూలు మాలలుగా కదిలివస్తున్నట్లుగా...

ఉషోదయపు సంగీత తరంగాల్లా...

ఆడపిల్లలు నడిచి వస్తున్నారు. ఏవేవో విషయాలు మాట్లాడుకుంటున్నారు. కొంత మంది మాట్లాడుతున్నా చిరునవ్వులు పెదవుల మీద పూయిస్తున్నా, వారి చూపులు మాత్రం పరిసరాలను గమనిస్తున్నాయి.

తోటలోని పూలు తమను ఎవరయినా గమనిస్తున్నారేమోననే ఉత్సుకతను ప్రదర్శిస్తాయో లేదోగాని ఆ పిల్లల మనసుల్లో రకరకాల భావాల సంచలనం ఉందని వారి ముఖాలు చెబుతున్నాయి.

కాలేజి భవనం పురాతనమైంది.

బ్రిటీష్‌వాళ్లు కొన్ని దశాబ్దాల క్రితం నిర్మించారు. అయినా గంభీరంగా ఉంది. దారి పొడుగునా ఎప్పటివో చెట్లు. కాలేజ్ ఆవరణలో మాత్రం కాగితపు పూలచెట్లు కనిపిస్తాయి. ఇంకా రకరకాల క్రోటన్స్ ఉన్నాయి. విశాలమైన మైదానం ఉంది.

జయంత్ ఓ మహావృక్షం చాటున ఉన్నాడు.

అతని దృష్టి ఆ ఆడపిల్లల మీద లేదు.

వారిలో ఎందరో అందగత్తెలున్నారు.

అయినా అతను ఓ గులాబి పరిమళం కోసం ఎదురు చూస్తుంటాడు.

వారంలో కనీసం మూడు రోజులు ఆమె తలలో గులాబి పువ్వు చోటు చేసుకుంటుంది. అది ఎంత తాజాగా ఉంటుందో! గులాబి మీద నీటి బిందువులు మేలి ముత్యాల్లా మెరుస్తుంటాయి.

జయంత్ స్నేహితుల మధ్య కూర్చుంటాడు.

అందరూ గలగల మాట్లాడుతుంటారు.

జయంత్‌కి ఆ మాటలు వినిపించవు. అతని కళ్లముందు ఆ అమ్మాయి రూపం కనిపిస్తుంటుంది. ఇప్పుడే ఇంటి దగ్గర బయలుదేరి ఉంటుంది. అడుగులో అడుగు వేయటానికి ఎన్ని క్షణాలు పడుతుందో లెక్కలు మొదలవుతాయి.

అతని అంచనాలకు తగినట్లుగా కాస్త అటో ఇటో అడుగులు పడుతుంటాయి. మాటలు వినిపించవు.

ఆ అమ్మాయి అడుగుల చప్పుడు ఎన్ని శబ్దాల మధ్యనున్నా వినిపిస్తుంది.

ప్రతిరోజూ కనీసం అరగంట ముందుగా వచ్చేస్తాడు.

నిరీక్షణలో ఉండే బాధ, ఆనందం అతనికి అలవాటయ్యాయి.

అతనికి ఒళ్లంతా కళ్లే!

'మనం ఆరాధించేవారి రాకను లక్షమందిలో ఉన్నా తెలుసుకోగలగటం ప్రేమతాలూకు విశిష్ట లక్షణం' అని జయంత్ ఎక్కడో చదివాడు.

ఆ అమ్మాయి పేరు ఆరావళి!

సాధారణంగా ఆరావళి కాలేజ్‌కి రాకపోవటమంటూ ఉండదు. ఎప్పుడన్నా అరుదుగా మాత్రం జరుగుతుంది. ఆ రోజు మాత్రం ఆకాశం, చెట్లు, మనుషులు, ఇంకెవరూ.. ఏదీ.. అందంగా ఉండదు.

ప్రతిరోజూ క్లాస్‌రూమ్‌కి వెళ్లేలోగా జయంత్ ఆమెని చూడాలి. అప్పుడు ఆ రోజుకి ఓ సార్థకత ఉంటుంది.

జయంత్ పదో తరగతి నుండి ఆరావళిని చూస్తున్నాడు. ఆమెని చూడని రోజున ఆ రాత్రి నిద్రపట్టేది కాదు.

ఏం జరిగి ఉంటుంది? ఎందుకు రాలేదు? జ్వరం వచ్చిందా? వాళ్ల ఇంటిలోని వారికి ఏమైనా జరిగిందా? ఇలాంటి రకరకాల ఆలోచనలు. ఉదయం పరుగులు తీసుకుంటూ వెళ్లేవాడు.

ఆమె కనిపించగానే కళ్లు వెలిగిపోయేవి.

మొదటిసారి ఆరావళిని చూసినప్పటి

ప్రకంపనలు జయంత్‌కి ఇంకా గుర్తున్నాయి. అప్పటికి అతనికి పదిహేను సంవత్సరాలు. ఎందుకు అంత సంచలనం కలిగిందో అప్పుడు తెలియదు. దేవతలు తన కోసం ఆరావళిని తమ స్కూల్‌కి పంపించారనిపించింది.

స్కూలూ, జూనియర్ కాలేజ్ కలిసే ఉంటాయి.

ముఖ్యంగా పదో తరగతి పరీక్షలప్పుడు త్వరత్వరగా రాసేసాడు. జయంత్ పరీక్షలు రాస్తున్న గది వేరు, ఆరావళి గది వేరు.

మరుసటి రోజు నుండి స్కూల్ ఉండదు. ఆరావళి కనిపించదు. ఆమె తమ గది ముందు నుండే వెళ్లాలి. కిటికీ తలుపులు తీసి ఉంటాయి. చూపులన్నీ అటే ఉన్నాయి.

ఎంత పరిమళం వచ్చినా, ఆమె అంతర్ధానం కావటానికి అర నిముషం చాలు. అలా కొన్ని యుగాలు గడిచాక, అదాటున లేచి తన సమాధానాల కాగితాల దొంతరను అందించి, ఎవరో తరుముతున్నట్లు బయటికి వెళ్లిపోయాడు.

ఆమె వెనకాల నడుస్తూ అడగాలనుకున్నాడు.

'ఆరావళి ఇదే మనం చివరిసారి కలుసుకోవటమా? వచ్చే సంవత్సరం ఈ ఊరినీ, స్కూల్‌నీ వదిలి ఇంకెక్కడికికన్నా వెళ్లిపోతావా? '

ధైర్యం చాల్లేదు. అలా కళ్లముందు నడుచుకుంటూ వెళ్లిపోయింది.

వేసవి సెలవులన్నీ భారంగా గడిచిపోయాయి.

పరీక్షా ఫలితాలు వచ్చాయి. తను ఫస్ట్ క్లాస్‌లో పాసయ్యాడు. ఆరావళి నెంబర్ తెలియదు. తను బాగానే చదువుతుంది. అయినా అనుమానం.

వాళ్ల ఇల్లు తనకు తెలవదు. మిత్రుల్ని అడుగుదామంటే సంకోచం.

జయంత్‌లో చిన్నప్పటి నుంచి అదే ధోరణి.

తనూ- తన ఏకాంత మానసిక మందిరం!

అమ్మా-నాన్నలకి కూడా మనసు విప్పి చెప్పుకోలేని చిన్న చిన్న విషయాలు ఎన్నెన్నో!

కాలేజ్ తెరిచారు.

మొదటి నాలుగురోజులూ నరకం. ఆరావళి కనిపించడం లేదు.

కొంతమంది మిత్రులు వెళ్లిపోయారు. ఆడపిల్లలు వెళ్లిపోయారు.

'ఆరావళి కూడా అంతేనేమో!' అనుకుంటున్నాడు.

అప్పుడు నడిచివస్తోంది.

ఆరావళి పుస్తకాలను దొంతర్లగా పేర్చుకుంటుంది.

అవి గుండెలను తాకుతుంటాయి.

ఓ చేత్తో వాటిని పట్టుకుంటుంది.

పుస్తకాల మధ్య టిఫిన్ బాక్స్ ఉంటుంది.

ఇంటర్ మొదటి సంవత్సరంలోనూ అదే దృశ్యం!

అప్పుడు కలిగింది ఆనందం.

'వసంతం మళ్లీ వచ్చింది' అనుకున్నాడు.

"ఎవరికోసం చూస్తున్నావురా? " అని వినిపించడంతో ఉలిక్కిపడ్డాడు.

వెనక మదన్ ఉన్నాడు. జయంత్ ఏదో చెప్పేలోగా మదన్ అతన్ని లాక్కునిపోయాడు.

★ ★ ★

రాత్రి -

పుస్తకాలు ముందేసుకుని కూర్చున్నాడు.

ఆరావళి పుస్తకాల్లోంచి నడిచి వస్తున్నట్లుంది.

ఆడపిల్లలందరూ అన్ని పుస్తకాలు తీసుకురారు. మరీ ముఖ్యంగా టిఫిన్ బాక్స్‌లు

అసలు గుండెల మీద పెట్టుకోరు. కొంత మంది బ్యాగ్‌లు వీపులకి తగిలించుకుంటారు. అందులోనే అన్నీ ఉంటాయి.

ఆ రోజు ఆరావళి ఏదో ధ్యాసలో ఉంది. రెండు పుస్తకాలు జారిపడ్డాయి.

వాటిని తీసివ్వటానికి అబ్బాయిలు పోటీ పడుతున్నారు. జయంత్‌కి వెళ్లాలనుంది. సంకోచం... సంకోచం.

దూరం నుండి నిలబడి చూస్తున్నాడు.

ఒక్కసారిగా అతని హృదయ స్పందన ఆగిపోయిందా అనిపించింది.

మొదటిసారి ఆరావళి ఎదను చూసాడు.

చిన్నతనంలో పిన్నిగారి ఊరు వెళ్లినపుడు దూరం నుండి కొండల్ని చూసాడు. అవి నునుపుగా ఉన్నాయి. వాటి చుట్టూ తెల్లటిపొర కప్పినట్లు ఉంది.

జయంత్‌కి తెలుపంటే ఇష్టం. ముఖానికి తెల్లటి వస్త్రంతో కనిపించీ కనిపించని సౌందర్య స్త్రీలని చిత్రాల్లో చూసాడు. పాత సినిమాలలో చూసాడు.

అప్పుడతనికి తెలియని ఉద్విగ్నత కలిగింది. అదేమిటో ఆ వయసులో తెలియదు. పరదాల మాటున ఉన్నది ఏదైనా అనంతమైన ఊహలకి ఆస్కారం ఇస్తుంది.

కలలకూ, ఊహలకూ అంతం ఉండదు.

చిన్ననాటి ఊహలు వేరు!

తొలి యవ్వనపు స్పందన వేరు!

ఏకకాలంలో అలాంటి భావనలన్నీ జయంత్‌ని ఊపేసాయి.

ఆరావళిలోనూ అదే అందం.

ఆమె పుస్తకాల్ని, టిఫిన్ బాక్స్‌ని మోస్తున్నట్లు ఉండదు.

తనతో ఓ కొండని సునాయాసంగా తీసుకెళ్తున్నట్లుంటుంది.

అప్పటివరకు పుస్తకాల్ని మాత్రమే చూసాడు.

మొదటిసారి ఇప్పుడు ఆమె హృదయాన్ని చూసాడు.

ఆరోజే ఓ అందమైన నోట్‌బుక్‌ని తన కోసం కేటాయించుకున్నాడు.

అది కేవలం తన స్వంతం. అప్పటికే జయంత్‌కి ఓ నేపథ్యం ఉంది.

అమ్మా, నాన్నలు చిన్నప్పటి నుంచి నేర్పించిన పద్యాలు, శ్లోకాలు, పుస్తక పఠనం... సంగీతం అతని మానసిక ప్రపంచాన్ని వయసుకి మించిన గాఢాభినివేశంతో నింపాయి.

ఇప్పుడిక మళ్లీ ఆ పుస్తకం అందుకున్నాడు.

★ ★ ★

'హృదయం' 'మనసు' 'ఎద'

ఏమిటివన్నీ? విడివిడిగా ఉన్నాయా? కలిసే ఉన్నాయా?

'ఎదలోని సొద' ఏంటి?

హృదయం భౌతికమైనదా? అది కనిపించని భావనా?

'మనసు' అంటే మెదడులో ఏర్పరుచుకున్న అభిప్రాయాల మాలికా?

మెదడు పంపిస్తున్న సంకేతాలా!

ఏదీ అర్థం కావటం లేదు.

మొదటిసారి నేను 'ఆరావళి' అన్న పేరు విన్నప్పుడు ఆశ్చర్యం కలిగింది.

మామూలుగా ఆడపిల్లలకు దేవతల పేర్లు, నదుల పేర్లు పెడుతుంటారు. ఇంకొందరు పురాణప్రాతల పేర్లు పెడతారు.

'ఆరావళి' అంటే పర్వతం కదా!

ఎందుకు అలాంటి పేరు పెట్టారు. పర్వతమంత గంభీరంగా ఉండాలనా?

ఎవరికీ తలవంచకుండా ఉండాలనా?

ఈ రోజున నామీద నాకు అసహ్యం కలిగింది. నేను పూర్తిగా పతనం అయ్యాననే భావం కలిగింది.

యాదృచ్ఛికంగానైనా నేను ఆరావళి

## ఈమెయిల్ క్రమం బెట్టిదనిన..

ఎలక్ట్రానిక్ మెయిల్ సౌకర్యం ప్రజలకు 1990ల నుంచి అందుబాటులోకి వచ్చింది. అంతకుమునుపు ఫోన్ లేదా ఉత్తరాల ద్వారా సమాచారం తెలిపేవారు. ఈ-మెయిల్ని కనిపెట్టింది ఇండియన్ అయిన సబీర్ భాటియా. ఈ-మెయిల్లో మొదట్లో సమాచారం పంపేవారు, పొందేవారు -ఇరువురూ ఆన్లైన్లో ఉంటేనే దాన్ని చదవడం సాధ్యపడేది. కానీ క్రమంగా స్టోర్ అండ్ ఫార్వర్డ్ పద్ధతి వచ్చింది. దీనివల్ల ఉత్తరం పొందే వ్యక్తి ఆఫ్లైన్లో ఉన్నా తర్వాత దాన్ని చదివే సౌకర్యం కలిగింది. ఇందువల్ల ఈ మెయిల్ బాగా ప్రాచుర్యం పొందింది.



చండీఘర్లో డిసెంబర్ 30, 1968లో పుట్టి, బెంగళూరులో పెరిగిన సబీర్ భాటియా బాచిలర్స్ డిగ్రీని కాలిఫోర్నియా ఇన్స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ నుంచి పొందాడు. తర్వాత ఏపిల్ కంప్యూటర్స్లో ఫైర్ పవర్ సిస్టమ్స్లో హార్డ్వేర్ ఇంజినీరుగా పనిచేసాడు. తన కొలీగ్ జాక్స్మిత్తో కలిసి జులై 4, 1996లో ఈ-మెయిల్ ప్రొవైడర్ను కనుగొన్నాడు. దీనికి అతను హాట్ మెయిల్ అనే పేరు పెట్టాడు. ఉచితంగా ఈ మెయిల్స్ పంపుకునే ఈ పద్ధతిని ఏప్రిల్ 1999లో ఇతడి నుంచి మైక్రోసాఫ్ట్ కొనుక్కుంది.

ఒకప్పుడు ప్రపంచంలో అత్యధిక ఈ-మెయిల్స్ రిజిస్టర్ అయిన సంస్థ హాట్ మెయిలే. 36.9 కోట్ల మంది దీన్ని ఉపయోగించేవారు. ఇప్పుడు జీ మెయిల్ దీన్ని అధిగమించింది. కాలక్రమేణా ఈ-మెయిల్ సేవతోపాటు ఛాట్, అటాచ్మెంట్, రిమైండర్, ఫోల్డర్స్ లాంటివెన్నో సేవలు అదనంగా వచ్చి చేరాయి.

గుండెలకేసి చూసాను.

అందులో పొరపాటు లేకపోవచ్చు కానీ అప్పటినుంచి నాలో అలజడి మొదలయింది.

నేను చూస్తున్న దృశ్యం దగ్గర కాలం స్తంభించిపోవాలనుకున్నాను. అది ఎవరి చేతిలోనూ లేదు.

అసలు నిరంతరం కదిలే కాలం కూడా ఓ బానిసలా తనపని తను చేసుకుంటూ పోవాల్సిందే.

ఇప్పుడు నాకు ఆరావళి ముఖం చూడటం కంటే 'ఎద'ని చూడాలనే ఆరాటం పెరిగిపోయింది. నాకూ అమ్మ ఉంది. నేను అమ్మ స్తన్యం తాగి ఎదిగిన వాడ్ని. ఆడవారంటే నాకు గౌరవం ఉంది. చిన్నప్పటి నుంచి ముఖ్యంగా అమ్మ నాకు నేర్పిన సంస్కారం ఉంది. అయినా నేను అందరి యువకుల్లా ప్రవర్తిస్తున్నాను.

ఇప్పటి వరకూ నేను మిగతా నా వయసు వారికి కంటే భిన్నమైనవాడిని అనుకున్నాను. నా ఆలోచనలు భిన్నంగా ఉంటాయని, వాళ్ళు కేవలం క్లాసు పుస్తకాలు చదువుతారు లేదా స్కూల్ ఎగ్గొట్టి సినిమాలు చూస్తారు అనుకున్నాను. ఒకరిద్దరు మిత్రులు మాత్రం చాటుగా బూతు పుస్తకాలు, డిటెక్టివ్ పుస్తకాలు చదవటం నేను చూసాను.

అప్పుడు వాళ్లంటే నాకు అసహ్యం కలిగింది.

అప్పటికే వాళ్లు మీసాల్తో - బలమైన కండల్తో కనిపించేవారు. ఎప్పుడూ అమ్మాయిల గురించి మాట్లాడుకునేవారు. వారు కనిపిస్తే దూరంగా వెళ్లిపోయేవాడ్ని. సిగరెట్లు తాగేవారు, బీర్లుకూడా తాగుతారని,

అవి కుంకుడుకాయ రసంలా చేదుగా ఉంటాయని తెలిసినపుడు అలాంటివారి మీద నాకు జుగుప్స కలిగింది.

అలాంటిది ఇప్పుడు నేను చేస్తున్న దేంటి?

ఆరావళి ఆధునిక దుస్తులు ధరిస్తుంది. నిండుగా 'దుపట్టా' కప్పుకుంటుంది. అది ఎప్పుడు తొలుగుతుందా అని ఆరాటపడు తున్నాను.

నేను అప్పుడప్పుడు చూసే సినిమాల్లో క్లబ్బు డ్యాన్సులుంటాయి. అందులో ఆడ వాళ్ల గుండెలు ఎత్తుగా ఉంటాయి. కెమెరా కోణాలన్నీ వాటిని చాలా దగ్గరగా

## కొత్తగాలి...

**తల్లి కంటుంది**
**తండ్రి పెడతాడు**
**బిడ్డ కనిపెట్టుకుని ఉండొద్దా!**

– కర్లపాలెం హనుమంతరావు,
మోతీనగర్, హైదరాబాద్

చూపిస్తాయి.

అలాంటి సమయాల్లో నాకు అసహ్యం కలిగేది. నేను ఆ పాటలు అయిపోయేంత వరకు కళ్లు మూసుకునేవాడ్ని. చాలాసార్లు బయటకి వెళ్లిపోయేవాడ్ని.

ఇప్పుడు నేను అందరిలో ఒకడ్ని. అంద రిలా నేనూ 'యూ టూ బ్రూటస్' లా అయిపోయాను.

ఈ రోజు నేను ఓ నిర్ణయం తీసుకుం టున్నాను. రేపట్నుంచి నేను 'ఆరావళి'ని చూడను. ఆమెకోసం కాపలా కాయను. ఇంకా నేను పతనం కాదలుచుకోలేదు. అదే కొనసాగితే 'జయంత్' కూడా 'శంకర్'కి 'సత్యా'నికి తేడా లేని వ్యక్తిగా మిగిలిపో తాడు.

ఈ రాత్రి నేను తీసుకుంటున్న నిర్ణయం ఇది!

★ ★ ★

జయంత్ తన జీవితపు పుస్తకం మూసే సాడు. ఇంకా క్లాసు పుస్తకాలు చదవాలని పించలేదు. తన గదిలో చీకట్లో నిద్రపోవ టానికి ప్రయత్నం చేస్తున్నాడు. నిద్ర రావటం లేదు.

అతను అలా నిర్ణయాన్ని పుస్తకంలో రాసుకోగలిగాడు కాని ఉదయం లేవగానే మళ్ళీ 'ఆరావళి' గుర్తొచ్చింది. ఆమెకోసం అరగంట ముందే కాలేజీకి పరుగులు తీసు కుంటూ పోయాడు.

మళ్లీ అదే ఆరాటం!

'ఆరావళి'ని కాదు కాదు. ఆరావళి ఎద సౌందర్యం చూడాలి. ఇప్పుడు ఆమె తలలో తరుముకునే గులాబీ సౌందర్యం గురించి ఆలోచనలు రావటం లేదు. ఆ పరిమళం మనసుని తాకటంలేదు. ఆడవా రికి మాత్రమేనా గుండెలుండేది, మగ వారికీ ఉంటాయి.

పురుషుల హృదయం మైదానం. స్త్రీ హృదయం పర్వతం అందుకేనేమో స్త్రీ-పు రుషుల జీవితాల్లోనూ ఆ ప్రకృతి తాలూకు భిన్నత్వం కనిపిస్తుంది. ఇది పురుష ప్రపంచం కదా అనుకున్నాడు. ఆ రాత్రి ఇతరేతర ఆలోచనలకంటే తన పతనం జయంత్‌కి దుఃఖాన్ని తెప్పించింది. నిం డుగా దుప్పటి కప్పుకుని ఏడుస్తున్నాడు. ఎప్పటికి నిద్ర పట్టిందో తెలియదు.

ఉదయం అమ్మ 'అనంత' అడిగింది.

"నిద్రపోకుండా చదువుతున్నావా? ఇలా అయితే పరీక్షలప్పటికి ఏ జ్వరమో వస్తుంది. అయినా ఎప్పటి పాఠాలు అప్పుడు చదువుకుంటే ఈ సమస్య ఎందుకు వస్తుంది?"

జయంత్ మాట్లాడలేదు.

అప్పుడు అనంత, జయంత్‌ని నిశితంగా చూసింది.

"ఏంటి జయా! ఈ మధ్య నీలో ఏదో మార్పు కనిపిస్తోంది? "

జయంత్ ఉలిక్కిపడి అమ్మకేసి చూసాడు. "ఏం మార్పమ్మా? " అన్నాడు.

అదోలా చూసి "నువ్వు పెద్దవాడివి అవుతున్నావు. ఆ విషయం నాకు ఇప్పుడిప్పుడే తెలుస్తోంది" అంది.

వెర్రి నవ్వు నవ్వాడు. స్నానం చేస్తున్నప్పుడు అనిపించింది.. అమ్మకు నా గురించి తెలిసిపోయిందా? తెలవకుండా ఎలా ఉంటుంది? వాళ్లూ ఒకప్పుడు పిల్లలుగా యవ్వనం నుంచి నడివయసుకి చేరుకున్నవారే కదా! అందులోనూ వారు మాట్లాడుకునే విషయాల్లో ఈ కాలం అమ్మాయిలూ-అబ్బాయిలపైన సినిమాలే కాకుండా ఇతరత్రా ప్రభావాల గురించీ ఉంటుంది. ఏమైనా ఇక నుండి అమ్మకి దొరికిపోకూడదని అనుకున్నాడు.

కాలేజీకి వచ్చాడు.

అది కూడా ఇంకో అయిదు నిముషాలకు క్లాసులు మొదలవుతాయనే సమయంలో, మొదటిసారి తన నిగ్రహం మీద తనకు సంతృప్తి కలిగింది. అయితే లెక్చరర్ సెలవు పెట్టటంతో అందరూ బయటికి వచ్చారు. జయంత్ ఒంటరిగా ఓ పక్కకి వెళ్తుంటే భుజం మీద చెయ్యి పడింది. వెనక్కి తిరిగి చూసాడు.

సూర్య చిరునవ్వుతో చూస్తున్నాడు.

తనూ నవ్వాడు.

"నీతో మాట్లాడాలి" అన్నాడు.

ఇద్దరూ కాగితపు పూలచెట్టు కింద కూర్చున్నారు.

"మనం విద్యార్థి సంఘం ఏర్పాటు చేద్దాం" జయంత్‌తో అన్నాడు సూర్య.

"చదువు విషయంలోనా? "

"కాదు. మనకి అనేక సమస్యలున్నాయి. మన కాలేజీలోనే కాదు, మన విద్యా విధానంలో, మన సమాజంలో. మన విద్యార్థులకి ఇవేమీ పట్టటం లేదు. ఏమాత్రం లక్ష్యం లేకుండా బతుకుతున్నారు. దాన్ని మనం బ్రేక్ చేయాలి" అన్నాడు.

"నాకు అలాంటి విషయాల మీద ఇంట్రెస్ట్ లేదు. నేనూ- నా చదువు.. అంత వరకే ఆలోచిస్తాను" అన్నాడు జయంత్.

సూర్య నిరాశపడినట్లు కనిపించలేదు.

"ఒకప్పుడు నేనూ అలానే అనుకున్నాను. మనం మనంగా బతకటం కోసమే కొన్ని పనులు చేయాలి. నువ్వు ఆలోచనపరుడిగా కనిపించావు. అందుకే అడుగుతున్నాను"

"సారీ ఏమనుకోవద్దు. నా కుటుంబ నేపథ్యం అదికాదు"

"ప్రపంచంలోని ప్రముఖులందర్నీ చూడు. వాళ్ల నేపథ్యానికి, వాళ్లు చేసిన పనికి సంబంధం ఉండదు"

జయంత్ మాట్లాడలేదు.

అప్పుడతను కొన్ని పుస్తకాలు ఇచ్చి వాటిని చదవమన్నాడు. ఆ తర్వాత "ఇంకోసారి మనం మాట్లాడదాం" అని వెళ్లిపోయాడు.

ఆ రాత్రి తన గదిలో కూర్చుని సూర్య ఇచ్చిన పుస్తకాలు చదవటం మొదలుపెట్టాడు. చాలా ఇబ్బందిగా అనిపించింది. రెండుమూడు పుస్తకాలు రెండు మూడు పేజీలు చదివి పక్కన పడేసాడు.

అదే సమయంలో అనంత భర్త తిలక్‌తో మాట్లాడుతోంది.

"జయంత్‌లో ఏదో మార్పు కనిపిస్తోంది. సరిగా నిద్రపోవటం లేదు. ఎప్పుడూ ఏదో ఆలోచనల్లో ఉన్నట్టు కనిపిస్తున్నాడు. ఇలాంటి వయసులోనే కదా యువకులు మారేది. మీరు వాడితో ఓసారి మాట్లాడితే బాగుంటుంది" అంది.

తిలక్ ఉద్యోగం చేస్తున్నాడు. ప్రభుత్వ

ఉద్యోగం. ఈ మధ్య అతనికి ప్రమోషన్ వచ్చింది. దాంతో పనిభారం పెరిగింది.

"నువ్వు మాట్లాడు అనంతా! అయినా నీకు తెలియని విషయాలు నేను వాడికి ప్రత్యేకంగా చెప్పటానికి ఏమున్నాయి? " అన్నాడు.

"నేను మాట్లాడటం, మీరు మాట్లాడటం ఒకటెలా అవుతుంది? "

"నిజానికి నాకంటే నువ్వే ఎక్కువ కన్వి న్సింగ్‌గా మాట్లాడగలవు" అన్నాడు తిలక్ చిరునవ్వుతో.

ఆ తర్వాత అతను చెప్పాడు.

"కౌమారం దాటి యవ్వనంలోకి ప్రవేశిం చేటప్పుడు రెండు రకాల ఆవేశాలకు లోన వుతుంటారు. ముందు అవేంటో తెలుసుకో వాలి.. ఒకటి ప్రేమ, రెండవది సమాజం మీద అసంతృప్తి. జయంత్‌లో మార్పు ఏ రకమో పరిశీలించు" అన్నాడు.

అనంత తలూపింది

★ ★ ★

మదన్ బలవంతం మీద, కాలేజ్ అయి పోయాక మైదానంలో కూర్చున్నాడు జయంత్. రిస్ట్‌వాచ్ చూసుకుంటున్నాడు.

"నేను ద్వేషించేవాటిల్లో ఇదొకటి" అన్నాడు మదన్ సీరియస్‌గా.

"మా నాన్న టెన్త్‌క్లాస్ అయ్యాక ఇది నాకు ప్రెజెంట్ చేసారు" అన్నాడు జయంత్, ముఖం మాడిపోగా.

"ఎవరు ప్రెజెంట్ చేసారని కాదు. అసలే మనం చిన్నటౌన్‌లో చదువుకుం టున్నాం. ఇక్కడున్నది నాలుగు థియే టర్స్, చిన్న చిన్న హోటల్స్. ఇంతకు మించి మంచి పార్క్‌లేదు. ఇక్కడ ఆడపి ల్లలూ అంతే. ఈ మధ్య నేను విశాఖ వెళ్లాను. అంతకు ముందు హైదరాబాద్ వెళ్లాను. అక్కడ స్టూడెంట్స్‌ని చూసాను. మనం ఎంత అనాగారికంగా బతుకుతు న్నామో అప్పుడు తెలిసింది" అన్నాడు మదన్.

"నువ్వు ఎడ్యుకేషన్ గురించి మాట్లాడు తున్నావా? ఎంటర్‌టైన్‌మెంట్ గురించి మాట్లాడుతున్నావా? " అన్నాడు జయంత్.

"అన్నిటి గురించి మాట్లాడుతున్నాను. నీ విషయం చూడు.. కాలేజ్ అయిపో గానే ఇంటికి పరుగులు తీసుకుంటూపో తావు. ఏ ఆడపిల్లతోనయినా మాట్లాడా లంటే నీకు చెమటలు పడతాయి. అదే యూనివర్సిటీల్లో అలా ఉండదు. ఆ లైఫ్ వేరు. ఆడపిల్లలూ-మగపిల్లలూ హాయిగా మాట్లాడుకుంటారు. థాట్స్ ఎక్స్‌ఛేంజ్ చేసుకుంటారు. ఇప్పుడు మనం సెవెన్టీన్ దాటే స్టేజ్‌లో ఉన్నాం. ఇప్పుడు నాకు సం దేహమొస్తోంది.. ట్వంటీఫస్ట్ సెంచరీలో అయినా ఈ ఊరు మారుతుందా అని."

"నువ్వు మారు మదన్. డిగ్రీ ఏ యూని వర్సిటీలోనో చెయ్యి. ఇప్పుడయినా సమస్య ఏముంది? సెకండ్ ఇయర్ నుంచి నువ్వు కోరుకున్న చోట చదువుకో" అన్నాడు జయంత్.

"అక్కడ ఆరావళి ఉండదుగా!" అన్నాడు మదన్ నిస్పృహతో.

జయంత్ ఉలిక్కిపడ్డాడు.

"ఆరావళి ఉండటమేంటి? "

"నేను ఆరావళిని ప్రేమిస్తున్నాను జ యంత్" అన్నాడు.

జయంత్ గుడ్లప్పగించి చూస్తుండిపో యాడు.

మదన్ ఏదో మాట్లాడుతున్నాడు.

జయంత్ అన్యమనస్కంగా ఊc కొడు తున్నాడు.

★ ★ ★

నోట్‌బుక్ పేజీలు తెరుచుకున్నాయి.

ఓ ఉద్వేగంతో జయంత్ రాసుకుంటూ పోతున్నాడు-

మదన్, ఆరావళిని ప్రేమిస్తున్నాను అన్నాడు. నా దేహం నుండి సగభాగం

## టెలిఫోన్ డైరెక్టరీలు నిషేధం

అమెరికాలోని వాషింగ్టన్ రాష్ట్రం మొదటి నుంచీ పర్యావరణ పరిరక్షణలో ముందుంది. పాతికేళ్ళ క్రితమే వాళ్ళు ప్లాస్టిక్ బేగ్స్ బదులు బట్టల సంచులను ఉపయోగించడం ప్రారంభించారు. ఆ రాష్ట్రంలోని సియాటెల్ లో ఏటా ఇరవై లక్షల టెలిఫోన్ డైరెక్టరీలు రీసైక్లింగ్ ప్లాంట్ చేరుతున్నాయి. వాటిని రీసైకిల్ చేయడానికి మూడున్నర లక్షల డాలర్లు ఖర్చవుతాయి. సియాటెల్ సిటీ కౌన్సిలర్ మైక్ ఓ బ్రియాన్ ఆ టెలిఫోన్ డైరెక్టరీలకు ఖర్చయ్యే పేపర్‌ను ఆదా చేయడం పర్యావరణానికి మంచిదని భావించాడు. దాంతో టెలిఫోన్ డైరెక్టరీలను తీసుకోవడాన్ని తిరస్కరించే హక్కును తమ పట్టణ పౌరులకు కల్పించాడు. ఇందుకోసం ఓ వెబ్ సైట్ తెరిచాడు. తమకు టెలిఫోన్ డైరెక్టరీ వద్దనుకునే వారు ఆ సైట్‌లోకి వెళ్ళి ఫోన్ నెంబర్, పేరు నమోదు చేయవచ్చు. ఒకవేళ ఏ టెలిఫోన్ కంపెనీ అయినా వద్దన్న పౌరుడికి డైరెక్టరీని పంపితే జరిమానాగా నూటాఇరవై ఐదు డాలర్లను వారు పంపే ప్రతి పుస్తకానికి విధించే చట్టాన్ని రూపొందించాడు. ముప్పాతిక వంతు పౌరులు టెలిఫోన్ డైరెక్టరీ తమకు వద్దని తిరస్కరించారు. ఎందుకంటే ఇంటర్‌నెట్‌లోని వెబ్‌సైట్లలో వాళ్ళకు అవి లభిస్తాయి. త్వరలో 'పేపర్‌లెస్ టెలిఫోన్ డైరెక్టరీ సిటీ'గా సియాటెల్ ఖ్యాతి సంపాదించడం ఖాయమని మైక్ ఓ బ్రియాన్ ప్రకటిస్తున్నాడు.



## విమానం ఎక్కాలంటే భయం!

అబూదాబీలో బ్రిటన్ నుంచి వచ్చిన కుటుంబం చాలా కాలంగా నివసిస్తోంది. యు.కె. డిప్యూటీ ప్రైమ్ మినిస్టర్ జాన్ ప్రెస్కాట్‌కు సహాయకుడిగా పనిచేసిన టోనీ థామ్సన్ (63)కు అబూదాబీ నచ్చడంతో రిటైర్ అయ్యాక అక్కడ సెటిల్ అయ్యాడు. అతని పదకొండేళ్ళ కొడుకు జో, అబూదాబీ స్కూల్లో చదువుతున్నాడు. తన కొడుకు జో, ఇతర కుటుంబ సభ్యులతో కలిసి టోనీ థామ్సన్ సెలవుల్లో కొద్దిరోజులు తన మాతృదేశానికి వెళ్ళి వస్తుండేవారు. అయితే టోనీ ఏప్రిల్ 2012లో ఎప్పటిలా సెలవులకి ఇంగ్లండ్ వెళ్లాలనుకుంటే, ఆయన కొడుకు జో దానికి నిరాకరించాడు. కారణమేమంటే తనకి విమానం ఎక్కాలంటే భయమేస్తుందని ఆ పిల్లాడు చెప్పాడు. మానసిక శాస్త్రవేత్తలతో కౌన్సిలింగ్, హిప్నోథెరపీలు కూడా చేయించారు. ఏమి చేసినా కొత్తగా ఏర్పడ్డ 'విమానం ఎక్కే భయం' జో నుంచి తొలగిపోలేదు. దాంతో విమానంలో వెళ్లే బదులు టోనీ తన కొడుకు, కూతురితో రోడ్డు మార్గంలో ఇంగ్లండ్‌కి వెళ్లాడు. సౌదీ అరేబియా, జోర్డాన్, ఈజిప్టుల ద్వారా అలెగ్జాండ్రియాకి, అక్కడి నుంచి గ్రీస్‌కు వెళ్లారు. అక్కడ యూరో రైలు ఎక్కి వారంతా ఇంగ్లండ్ చేరుకున్నారు. ఇలా రోడ్డు మార్గంలో ఐదువేల కిలోమీటర్లకు పైగానే వారు ప్రయాణించారు. జో తల్లి పాలెన్ అబుదాబీలోని తమ ఆస్తులన్నీ అమ్మేసి పెంపుడుకుక్కతోపాటు యు.కె.కు విమానంలో వెళ్ళారు. అల్ నూర్ హాస్పిటల్‌లో క్వాలిటీ మేనేజర్‌గా పనిచేసే థామ్సన్ తన కొడుకుకు విమాన భయం ఏర్పడటంతో ఇక ఇంగ్లండ్‌లోనే స్థిరపడాలని నిశ్చయించుకున్నాడు.



ఎవరో తీసుకుపోతున్నట్లు అనిపించింది.

ఇదేదో సినిమాల్లో మనిషి నుండి ఇంకో మనిషి అంతరాత్మ పేరుతో బయటకు రావటం కాదు. నన్ను రెండు భాగాలుగా చీల్చినట్లు అనిపించింది.

అయినా ఆరావళిని ఎవరయినా ప్రేమించవచ్చు. అలాగే ఆమెకూడా ఎవర్నయినా ప్రేమించవచ్చు. నాకు బాధ ఎందుకు? సొంతం పదహారు సంవత్సరాల వయసు నిండనివారు ప్రేమించటం ఏంటి?

దానికి మదన్ అంటాడు- ప్రేమకు వయసుతో పనేంటి? అని.

పెళ్లికి మాత్రం ఉందా?

> ## కొత్తగాలి...
>
> **పొరం**
> **తల్లి వంటిది**
> **గుణపొరం**
> **నాన్న లాంటిది**
>
> – ఐ. రవి,
> నాయుడు పేట, నెల్లూరు జిల్లా

అసలు చిన్న వయసులో బాల్య వివాహాలు ఎందుకు చేస్తున్నారు?

మన సినిమాల్లో ప్రేమకు అంకురం పడేది అయిదారు సంవత్సరాల వయసులోనే కదా అని.

అయిదారు సంవత్సరాల వయసులో ఏర్పడేది ప్రేమా! అది స్నేహం కదా! స్నేహితులందరూ ఒకటి కాదు. హృదయానికి దగ్గరగా వచ్చేది, సంతోషాల్ని, సమస్యల్ని చెప్పుకోగలిగేది కొంతమంది తోనే కదా!

అలానే బాల్యంలో పక్కింటివారో, బంధువులో, బడిలో చదువుకునేవారో తరచుగా కలుసుకోవటం వలన, ఒకరి భావాలు ఒకరికి దగ్గరగా రావటం వల్ల స్నేహం బలపడవచ్చు.

అయినా కూడా అప్పుడు ఆడా-మగ విచక్షణ ఉండదు. అంత స్నేహంలోనూ అలకలు, తగాదాలు, మాట్లాడుకోక పోవటాలు, అంతలోనే కలిసిపోవటం ఉంటుంది. అనేకమంది ఒకరికి దూరంగా ఇంకొకరు వెళ్లిపోతారు.

ఉద్యోగ రీత్యా బదిలీలు కావచ్చు, బతుకు తెరువుకోసం కావచ్చు, ఆ తర్వాతి కాలంలో వారిని మరిచిపోతాం. నా వరకు నాకు 'వినీత' అనే అమ్మాయి మా ఇంటి పక్కన ఉండేది.

మేమిద్దరం పక్కపక్కన ఉండేవాళ్ళం. ఒకే బడిలో చదువుకునేవాళ్ళం. కలిసి ఆడుకునేవాళ్ళం. మాకు ఆరు సంవత్సరాల వయసులో వాళ్లు వ్యాపారరీత్యా వెళ్లిపోయారు.

వినీత ఇప్పుడు నాకు లీలగా మాత్రమే గుర్తు. అప్పట్లో నాతో కలిసి చదువుకున్న ఎందరెందరో అమ్మాయిల్ని నేను మరిచిపోయాను. నేను ఎవరికయినా గుర్తుంటానేమో నాకు తెలియదు. వినీత నన్ను మరిచిపోయి ఉండవచ్చు.

అది 'ప్రేమ' అని నేను చెప్పను.

వినీత ఇప్పటిదాకా మాతో ఉండివుంటే అది ప్రేమగా మారి ఉండేదా? అదెలా ఎలా చెప్పగలం?

అప్పుడు ఆరావళి కనిపించి ఉంటే ఇదే ఆకర్షణ కలిగి ఉండేదికాదా? అంటే ఎలా చెప్పగలను.

బాల్యవివాహాలు రకరకాల కారణాల్తో వచ్చాయి. కొంతమేరకు ఆగాయి. ఇంకా కొనసాగుతున్నాయి.

మదన్ చెబుతున్నట్లు ముందు ముందు స్నేహానికి- ప్రేమకు మధ్య గీతలు చెరిగి పోతాయేమో. అలాంటి సినిమాలు మరింత నగ్నంగా ముందుకు వస్తా

యేమో!

ప్రస్తుతమయితే సినిమా ప్రారంభానికి ముందు మాత్రం ఈ స్నేహ భాగాన్ని చూపిస్తున్నారు. రేపు ఆ వయసు ప్రేమతో ఆరంభమై అంతమవుతాయి కాబోలు. అంటే రానున్న రోజులు నిర్మ లంగా ఉండవు.

అదంతా అలా ఉంటే మదన్ ఆరావళిని ప్రేమిస్తున్నాను అని చెప్పగానే నాలో ఇంత అశాంతి ఎందుకు కలిగింది? అది పెను తుఫానుగా మారుతుందా?

అసలు ఏ కథయినా- ఓ అమ్మాయి- కొంతమంది అబ్బాయిల చుట్టూ ఎందుకు తిరగాలి?

ఇంతకూ మదన్ ఆరావళిని ఎందుకు ప్రేమించాడు? అలా పుస్తకాలు గుండెలకు ఆనించుకుని, వాటిమీద టిఫిన్‌బాక్స్ పెట్టు కున్నందుకా? ఇంకేదయినా అంశం ఆరా వళిలో మదన్‌ని ఆకర్షించిందా? ఇప్పుడు నేనేం చెయ్యాలి?

★ ★ ★

ఆదివారం రోజు ఏదయినా సినిమాకి వెళ్దామా అనుకున్నాడు జయంత్. అప్పుడు అనంత పిలిచింది.

జయంత్ అమ్మ దగ్గరకు వెళ్లేటప్పటికి సూర్య ఇచ్చిన పుస్తకాలు ఆమె ముందు న్నాయి.

జయంత్‌లో అతనికి తెలియకుండానే ప్రకంపనలు మొదలయ్యాయి.

'అమ్మ నా నోట్ బుక్ చదివి ఉంటుందా?' అనుకున్నాడు.

"ఈ పుస్తకాలు నీ దగ్గర ఎందుకు న్నాయి జయా?" అంది అనంత.

"నా ఫ్రెండ్ చదవమని ఇచ్చాడమ్మా"

"చదివావా?"

"రెండు మూడు పేజీలు చదివి పక్కన పడేశాను"

"ఎందుకని? చదవాలనిపించలేదా?"

"నాకు కొంచెం కన్‌ఫ్యూజన్‌గా అనిపించి పక్కన పెట్టాను"

"అంతేగాని నీ క్లాసు పుస్తకాల కోసం కాదన్నమాట"

జయంత్ బిత్తరపోయాడు.

"వీటిని వెనక్కి ఇవ్వకుండా ఇంట్లో ఎందుకు ఉంచావు" అంది అనంత.

"ఈ మధ్యనే ఇచ్చాడమ్మా. అయినా వాటిని నన్నే ఉంచుకొమ్మన్నాడు"

"ఈ పుస్తకాలకి ఓ ధర ఉంది. నీ మిత్రుడు ఈ పుస్తకాలు రాసుంటే కాంప్లి మెంటరీగా ఇచ్చాడనుకోవచ్చు. అతను డబ్బులు పెట్టి కొని ఇచ్చాడు. అంటే నీ నుండి ఏదో ఆశిస్తున్నాడు"

"స్టూడెంట్స్ యూనియన్ పెడదాం అన్నాడు. అలాంటివి నాకు ఇష్టం లేదు అన్నాను. అయితే సరే ముందు ఈ పుస్త కాలు చదువు అన్నాడు. బాగుండదని తీసుకున్నాను"

"నీకు అంత మొహమాటం ఎందుకు? వద్దని చెప్పాల్సింది. ఈ రోజు ఈ పుస్త కాలు గందరగోళంగా అనిపించొచ్చు. రేపు ఇవే బాగుంటాయి. అప్పుడు నీకు చదువు మీద దృష్టి ఉండదు, ఉద్యమాల్లో తిరుగు దువుగాని. ఏదో ఒకరోజు ఇల్లు వదలిపెట్టి వెళ్లిపోవచ్చు" అంది అనంత ప్రశాంతం గానే.

అయినా ఆ మాటలు గుండెల్లో గుచ్చు కుంటున్నాయి.

అనంత ఉద్యోగం చేయటం లేదుగాని గ్రాడ్యుయేషన్ పూర్తి చేసింది. ప్రాచీన సాహిత్యం నుండి ఆధునిక సాహిత్యం వరకు చదువుకుంది. ఇప్పుడు వస్తున్న సాహిత్యం పట్ల ఆమెకు కొన్ని అభిప్రాయా లున్నాయి. అయితే ఆమె ఎప్పుడూ బయటి వ్యక్తుల్తో వాటిమీద చర్చించదు.

"నేను ఈ పుస్తకాలు సూర్యకి ఇచ్చేస్తా నమ్మా" అన్నాడు జయంత్.

"మా అమ్మ ఇవ్వమందని చెప్పు" అన గానే మళ్లీ బిగుసుకుపోయాడు.

"జయా! నువ్వు ఈ మధ్య ఎందుకు నిద్రపోవటం లేదో, ఎందుకు అశాంతిగా ఉంటున్నావో నాకు అర్థమైంది. ముందు చదువుమీద దృష్టిపెట్టు. ఇంకో ప్రపంచం లోకి వెళ్లకు" అంది.

జయంత్ తలూపాడు.

"ఓసారి సూర్యని మనింటికి తీసుకురా. నాకు అతన్తో మాట్లాడాలని ఉంది" అన గానే కాస్త భయంగా చూసాడు.

"నేనూ చదువుకున్నాను జయా! నీ స్నేహితుడ్ని ఇంటికి పిలిచేది అవమానిం చటానికి కాదు. ఆ మాత్రం సంస్కారం నాకుంది. అతని అభిప్రాయాలు తెలుసు కుందామని రమ్మంటున్నాను" అంది అనంత.

జయంత్ తలూపాడు.

★ ★ ★

మదన్ సీరియస్గా ఉన్నాడు.

ఆరావళి విషయంలో అతని అభి ప్రాయం విన్నాక జయంత్లో అతనిపట్ల రకరకాల భావాలు కలిగాయి. అందులో ఉత్సుకత ఒకటి. ప్రేమించినపుడు ప్రేమిం చటంతో ఆగిపోడు. ఏదొకటి చేస్తాడు. ఇప్పుడు, మదన్ ఏం చేయబోతున్నాడనేది జయంత్ ఉత్కంఠ.

"ఏంటి మదన్ ఎందుకంత సీరియస్గా ఉన్నావు? " అన్నాడు జయంత్.

"ఆరాని మధుగాడు లవ్ చేస్తున్నాడు" అన్నాడు.

"ఆరా అంటే? " అని ఆగిపోయాడు జయంత్.

"నువ్వు అనుకునే ఆరా కాదు. దాన్ని ప్రేమించరు. నేను ఆరావళి గురించి మాట్లాడుతున్నాను"

"మధు లవ్ చేయటం తప్పంటావా? "

"నేను చేస్తున్న పని కూడా అదేకదా అని నువ్వంటున్నావు. మధుగాడి సంగతి నీకు తెలుసా! వాడు ఇప్పటికి పది మంది అమ్మాయిల్ని ప్రేమించాడు. బస్సు సీట్ల మీద టవల్ వేసినట్లు 'ఈ అమ్మాయి నాదిరా. ఎవరూ నా లవర్ని చూడటానికి వీల్లేదు' అంటాడు. మనకంటే ఓ సంవ త్సరం సీనియర్ అని వాడికి పొగరు"

"అది సరే, నువ్వు నాలెడ్జ్ ఎక్స్ప్లోరేషన్ గురించి మాట్లాడుతుంటావు. ఇప్పుడు ఈ ప్రేమ గొడవల్లో పడిపోతున్నావేంటి? "

"నేను నాలెడ్జ్ గురించి మాట్లాడలేదు జయంత్! కల్చరల్ ఎక్స్ప్లోజన్ గురించి మాట్లాడాను"

"యూనివర్సిటీల్లో ఇలాంటి గొడవలుం డవా? "

"ఉంటాయి. అక్కడ ప్రేమకంటే పాలి టిక్స్ ఎక్కువ. ఏరియాని బట్టి కేస్ట్ సిస్టమ్ డామినేట్ చేస్తుంది. అదిలేని చోట లెఫ్ట్ ఆర్ రైట్ వింగ్స్ ఎదురెదురుగా ఉంటాయి"

జయంత్కి ఆ వింగ్స్ ఏంటో అర్థం కా లేదు.

ఒకందుకు కాస్త సంతోషం కలిగింది అతనికి. మదన్ మామూలు విద్యార్థి కాదు. అతని ఫ్యామిలీ, అతనికున్న సర్కిల్ వల్ల అనేక చోట్లకి తిరుగుతుం టాడు. కాబట్టి చాలా నేర్చుకుంటూ వస్తు న్నాడు. ఎలాంటివారికైనా ఈ ప్రేమ అనేది కొంతకాలం ఇబ్బంది పెడుతుం దేమో అనుకున్నాడు.

"ఇప్పుడేం చేద్దాం అనుకుంటున్నావు? " అనడిగాడు జయంత్.

"చేసేదేం లేదు. ఎవరు ముందు ఎక్స్ ప్రెస్ చేస్తారో చూడాలి. అయినా ఈ సంవత్సరం తర్వాత వాడు డిగ్రీ కాలేజీకి పోతాడు. ఆరా మనతో ఉంటుంది. ఈ కొన్ని నెలలు వాడ్ని శునకానందం పొందనీ."

"ఈలోపు మధు ఎక్స్‌ప్రెస్ చేస్తే? "

"ఆడవాళ్ళు తలదించుకుని నడుస్తారేమో గాని, ఎవరు ఎలాంటివారో బాగా గమనిస్తారు. మధుని 'ఆరా' ఒప్పుకుంటుందని నేను అనుకోను" అన్నాడు.

"ఆరావళిని ఇంకెవరైనా ఆరాధిస్తున్నారేమో? "

అప్పుడు జయంత్ కళ్లలోకి చూసాడు.

"నువ్వు ఆరాధిస్తున్నావా? అవునూ, నువ్వు ఎప్పుడూ చెట్ల దగ్గర ఉంటావు. ఎవరికోసమో వెతుకుతున్నట్లుంటావు. అది ఆరా కోసమేనా? " సూటిగా అడిగాడు.

"మొన్న నువ్వు చెప్పినప్పుడు అన్నాను.. ఈ వయసులో అలాంటివన్నీ ఏంటని.

## కొత్తగాలి...

**జారేదీ, నిలబడేదీ**
**తెలియని**
**జారుడు బండ**
**జీవితం**

– వల్లభాపురం జనార్దన,
మహబూబ్‌నగర్

నేను కెరీర్ మీద దృష్టి పెట్టాను. ముందసలు ఆడపిల్లల కళ్లలోకి చూడాలంటేనే నాకు భయం"

"అంటే కళ్లకిందకు చూస్తానంటావు" బిత్తరపోయి చూసాడు.

"అలా చూస్తావెందుకు నిర్మలంగా ఆడ-మగ కళ్ళలోకి చూసుకునేది పది పదకొండు సంవత్సరాల వయసు వరకే. టీనేజ్ టెంప్టేషన్ మొదలయ్యాక చూపులు ఎదమీదకు జారిపోతాయి. అలా చూడకపోతేనే వాడిలో ఏదో లోపం ఉన్నట్లు..."

"అది సభ్యతంటావా? "

"నువ్వు చలం పుస్తకాలు చదవలేదా? "

"లేదు"

"కెరీర్ మీద దృష్టి అన్నావు కదా! ఆరా వళి పర్వతాల గురించి చదివావు కదా! వాటిని చూడటానికి సభ్యత కావాలా? అందమైన గులాబి పువ్వుని చూడటానికి సభ్యత, సంస్కారం కావాలా? ఇలాంటి చాలా విషయాలు చలంగారు చెబుతారు. నువ్వు చదివే పుస్తకాలు వేరనుకుంటా"

"ఈ మధ్య బుక్ రీడింగ్ తగ్గింది మదన్"

"నిన్ను నేను ఎనలైజ్ చేస్తున్నా జయంత్. నువ్వుగానీ, సూర్యాగానీ ఎవడయినా సరే.. మన వయసులో స్త్రీని చూస్తాడు. చలిస్తాడు. నీలాంటివారయితే అదేదో పాపం చేసినట్టు ఏడ్చేస్తారు"

జయంత్ కళ్ళు విశాలం అయ్యాయి.

"సైలెంట్ లవర్స్ చాలామంది ఉంటారు. వాళ్ల ఊహలకి పరిమితం. నా వరకు నేను ఆరావళిని సిన్సియర్‌గా లవ్ చేస్తున్నాను. తను అంగీకరిస్తే పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను. మధుగాడు అలా కాదు. గులాబీ రేకుల్ని చప్పరించే రకం. అందుకే వాడిమీద నాకు కోపం" అన్నాడు మదన్.

"మంచిది. నీ ప్రేమ సక్సెస్ కావాలని కోరుకుంటున్నాను" అన్నాడు జయంత్.

అలా అంటున్నప్పుడు అతని గొంతు అతనికే పేలవంగా అనిపించింది.

★ ★ ★

అనంత- తిలక్‌కి కొడుకు జయంత్ గురించి చెప్పింది.

అతను ఆశ్చర్యంగా చూసాడు.

ఇప్పటివరకూ వారి కుటుంబాల్లో ఉద్యమాల్లోకి వెళ్లిన వారంటూ లేరు.

"కొత్త పరిణామం రాబోతోందా? " అన్నాడు అనంతతో.

"జయంత్‌లో అలాంటిది ఉంటుందని నేను అనుకోను. వాడు ఇంట్రావర్ట్. అలాంటి వారు ఉద్యమాలకి పనికిరారు. మహా అయితే విమర్శకులవుతారు. అది కూడా గది గోడల మధ్య"

"ముందుగా అలా ఊహించటం పొర పాటు అనంతా! వాడు మనకి ఒక్కగా నొక్క కొడుకు. వాడ్ని దూరం చేసుకుని నేను బతకలేను. ఏం చేస్తావో అంతా నీ చేతుల్లో ఉంది" అన్నాడు.

"మరేం బాధపడకండి.. నాకూ జయంత్ మీద చాలా ఆశలున్నాయి. వాడు ప్రపంచాన్ని అమాంతం మార్చేయా లని నేను కోరుకోవటం లేదు. రేపు ఏం జరుగుతుందో మనం చెప్పలేం. వాడివల్ల వాడికి లోకానికి అపకారం జరగకూడదని మాత్రం అనుకుంటున్నా.. అందుకు ప్రయత్నం చేస్తాను. అవసరమనుకున్న ప్పుడు మీరు జోక్యం చేసుకుందురుగాని. మనం విఫలం కావచ్చు. అన్నింటికీ తయారుగా ఉందాం" అంది అనంత.

తిలక్ మౌనంగా ఉండిపోయాడు.

★ ★ ★

'మై నోట్‌బుక్'

అలా రాసుకోవాలనిపించింది. అవును ఇది నా స్వంతం. ఎవరూ దీన్ని చూడకూ డదు, చదవకూడదు.

నేను మొదట రాసినప్పుడు రెండు మూడు పేజీలు ఖాళీలు వదిలేసాను.

ఇప్పుడు నాకు ఇష్టమైన గులాబిరంగు కలంతో రాసాను. 'దయచేసి ఈ నోట్ బుక్ పేజీలు తెరవకండి. నా అనుమతి లేకుండా ఎవరూ ఇది చదివినా వారు నా ప్రథమ శత్రువులు అవుతారు'

అలా రాసుకున్నాక కాస్త తృప్తి అనిపిం చింది.

అయినా చదివితే అమ్మా-నాన్నలు చద వాలి. ఇప్పట్లో అంతకు మించి చదవటా నికి ఎవరికీ అవకాశం లేదు.

చలం గురించి మదన్ చెప్పాక మా లైబ్రరీకి వెళ్లాను. నాకు ఆయన రాసిన పుస్తకాల్లో 'ప్రేమలేఖలు' నచ్చింది. 'స్త్రీ' పుస్తకం. తర్వాత 'మహాప్రస్థానం' సంపుటికి ఆయన శ్రీశ్రీ గారికిచ్చిన యోగ్యతాపత్రం.

అంతవరకే చదివాను. ముందే హెచ్చ రించాడు కదా.. తట్టుకోగల చేవ ఉంటేనే ఈ పుస్తకం పేజీలు తెరవమని.

నాకు చేవ ఉందోలేదో తెలియదు. అది పరీక్షకి పెట్టుకోవాలని నేననుకోలేదు.

స్త్రీకి ఓ హృదయం ఉంటుంది. ఆలోచ నలుంటాయి. ఇష్టాయిష్టాలుంటాయి. వీటిని ముందు ఒప్పుకోవాలి. అలా కనీసం ఆలోచించమని ఓ మగవాడు చెబుతున్నాడు. ముందు ముందు ఆడ వాళ్లు చెబుతారేమో!

'హృదయం' అనగానే మళ్లీ ఆరావళి దగ్గర ఆగిపోయాను. ఆయన 'మైదానం' కూడా రాసారు.

అయినా స్త్రీ విషయంలో 'మైదానం' అనే భావన నాకు అసంతృప్తిని మిగిల్చింది. ఆయన మైదానంలో చర్చించిన విష యాలు వేరు. స్త్రీకి అందం మెడవంపు, ఎదభాగం. 'స్త్రీ' మైదానంలా ఉండకూ డదు. ఎత్తులూ- పల్లాలు ఉండాలి. ఏ ఎత్తూ- పల్లమూ లేని శరీరాకృతి ఆడవా రికి అందాన్నివ్వదు.

అప్పుడే జన్మించిన పిల్లలకు ముర్రు పాలు అమృతం అంటారు. ఎదనుండే కదా మానవజాతి అమృతాన్ని గ్రోలేది!

చలాన్ని చదివిన 'మదన్' ఆరావళిని ఎవరో ప్రేమిస్తానంటే అంత ఉలిక్కిప డటం ఎందుకు? అది చలం ప్రకృతి కాదు.

అంటే ఎవరికి ఏది ఎంతవరకు కావాలో అంతవరకు మాత్రం స్వీకరిస్తారన్నమాట పొరపాటేం కాదు.

ఎక్స్‌ప్రెస్ చేయటమనే ఒక్క లక్షణమే ప్రేమని సాధిస్తుందా! నన్ను వెంటాడుతున్న సందేహమిది.

నేను అశక్తతని వదిలించుకు తీరాలి. లేదా నా నుండి ఆరావళిని మాత్రమే కాదు. నన్ను కూడా ఎవరో ఒకరు శూన్యం చేసి తోడ్కొనిపోతారు.

ఇప్పటికే ప్రపంచం పోటీగా తయారయింది. అందులో విజేతలదే రాజ్యం. పరాజితులు మౌనంగా తప్పుకోవలసిందే.

అందుకని నిన్నటి అపరాధ భావన నుండి, సంకోచాల నుండీ నేను బయటపడుతున్నాను. మదన్ అన్నట్లు అది టీనేజ్ టెంప్టేషన్ కావచ్చు.

అలాంటిది మగవారికేకాదు- ఆడపిల్లలకూ ఉంటుంది!

★ ★ ★

ఇంటిముందు కొద్దిపాటి స్థలంలో అనంత ప్రత్యేకంగా పెంచుకుంటున్న పూలచెట్లున్నాయి. అవి పూలను రాల్చుతున్నాయి. చెట్టుకింద పూలను గాలి వెదజల్లింది.

అది అందమైన పర్ణశాలలా ఉంది.

ఆ సాయంకాలం సూర్య- జయంత్ కుర్చీల్లో కూర్చున్నారు. అనంత బిస్కట్లూ, టీ తీసుకుని వచ్చి వారి ముందు పెట్టింది. వాటిని అందుకున్నారు.

చల్లటి గాలి అందర్నీ తాకి వెళ్తోంది.

"జయంత్‌కి నువ్వు ఇచ్చిన పుస్తకాలు నువ్వు చదివావా సూర్యా? " అంది.

"కొన్ని చదివాను" అన్నాడు.

జయంత్ ఆశ్చర్యంగా చూసాడు.

నీకు అర్థమయ్యాయా?

"పూర్తిగా అర్థం కాలేదు. మొత్తంగా ఆ సారం మాత్రం తెలుసుకున్నాను" అన్నాడు సూర్య.

"ఆ ప్రయత్నం ఇతర పుస్తకాల విషయంలో చేసావా? " అందామె.

కాస్త ఇబ్బందిగా చూసాడు.

"ఈ పుస్తకం రాసినవారు ఇప్పుడేం చేస్తున్నారు? " ప్రశ్నించింది.

ఈసారి నిర్ఘాంతపోయాడు.

"జస్ట్.. తెలుసుకుందామని అడుగుతున్నాను" అంది అనంత.

"కొంతమంది ఉద్యోగాలు చేసుకుంటున్నారు. ఇంకొందరు చిన్న చిన్న వ్యాపారాలు చేసుకుంటున్నారు. ఎవరయినా బతకటం కోసం ఏదొకటి చేయాలి కదా? " అన్నాడు.

"నేను ఏం చేస్తున్నారు. అని మాత్రం అడిగా సూర్యా. ఏం చేయాలో ఏం చేయకూడదో చెప్పటానికి నేనెవర్ని? " అంది.

అక్కడ కొద్ది క్షణాలు గాలి వస్తున్న శబ్దం తప్ప మరొకటి లేదు.

"ఈ పుస్తకాలు రాసినవారు అతి తక్కువ కాలంలోనే మారిపోయారు కదా. తమ ఆలోచనల్లో మార్పులు చేసుకున్నారు రాజకీయ నాయకులు పార్టీలు మారినట్టు- వీళ్లూ మారుతున్నారు. అవునా? "

"అవన్నీ సహజం కదండీ'

"కావచ్చు. మనుషులు తప్పులు చేస్తారు. ఎదుగుతున్న కొద్దీ భావాలు మారుతుంటాయి. నేను నువ్వు జయంత్‌కి ఇచ్చిన పుస్తకాలు చదివాను. అవి రాసిన వారిలో అరాచకం కనిపించింది. శిల్ప లౌల్యం కనిపించింది. అది కూడా సహజమే కానీ నాకు అర్థం కానిది ఒకటే..."

సూర్య- జయంత్ ఇద్దరూ అనంతని చూస్తున్నారు.

"మనం మాట్లాడుకునే మాటల్లో, మనం తినే తిండిలో పీలుస్తున్న గాలిలో అస్పష్టతవుందా? మీరనుకునే దోపిడిదారులు చాలా బహిరంగంగా జనాన్ని పీడిస్తున్నారు, దోచుకుంటున్నారు. వాళ్లు చాలా గ్లామర్‌గా ఉన్నారు. మరి రచయితలకి, కళాకారులకి, కవులకి ఎందుకింత అస్ప

ష్టత, వాళ్లు ఎందుకు అర్థం అయ్యేలా రాయటంలేదు. నువ్వంటావు తిండి కలుషితం- గాలి కలుషితం అవుతుందికదా అని. కానీ సమాజాన్ని మార్చాలకునే వారు మాత్రం కలుషితం కాకూడదు. ఒప్పుకుంటావా? " అంది చిరునవ్వుతో.

సూర్య చిన్నగా తలూపాడు.

"నాకున్న తక్కువ అనుభవంతో చెబుతున్నాను ఈ వయసులో మీరు అబ్జర్వ్ చేయటం నేర్చుకోండి. ముందు డిగ్రీ వరకయినా చదవండి. అప్పటికి ఇంకాస్త అనుభవం వస్తుంది. ప్రతి మూడు, నాలుగు సంవత్సరాలకి ఓ కెరటం విరుచుకుపడుతుంది. అందులో కొట్టుకుపోవటం కాదు. టీనేజ్ అనేది టెంప్టేషన్ కాకూడదు. మీరు వీలున్నప్పుడు సమాజ పరిణామ చరిత్ర చదవండి. మనుషులు మారుతున్నారు. భావాలు మారుతున్నాయి. మీకు ఇప్పుడు చెబుతున్నాను. ఇంకా ఎంతోకాలం అవసరం లేదు. మరో పది, పదిహేను సంవత్సరాల తర్వాత మీరు ఊహించని మార్పులు రాబోతున్నాయి. ఇప్పటి అరాచకంకంటే అది కొన్ని వేలరెట్లు అధికంగా ఉంటుంది. అప్పుడు మనుషుల అసలు స్వరూపాలు తెలుస్తాయి" అంది.

"ఎవరో ఒకరు ముందుకు రాకపోతే ఈ సమాజంలో మార్పులు ఎలా వస్తాయి చెప్పండి? "

"అదే చెబుతున్నాను.. భూమిని దున్నితేనే పంట పండుతుంది. చేతుల్తో భూమిని దున్నలేరు. వయసు ఉత్పత్తి సాధనం కాదు. మీలాంటి యువకులేమో ఉత్పత్తి పరికరాలు లేకుండా యుద్ధం చేయాలనుకుంటున్నారు. అవి ఎవరి చేతుల్లోనో ఉన్నాయి అనుకుంటున్నారు. ముందు మన దగ్గరున్న సాధనం ఏమిటి అన్నది నిర్ణయించుకోవాలి. దానికి పదును పెట్టకుండా ఆచరణలోకి దిగకూడదు.

## 'చతుర'లో తొలి నవల



### సృజన్ సేన్

'చతుర' మాసపత్రికలో 'ఆరావళి' నా మొదటి నవల. అప్పుడే యవ్వనంలోకి ప్రవేశిస్తున్న ఓ మధ్యతరగతి యువకుడి మానసిక ప్రవృత్తులను ఇందులో చిత్రించే ప్రయత్నం చేసాను. ఈ నవల నిండా యువతరం ఉంది. యువతరం భావోద్వేగాలు ఉన్నాయి. వారినే కాక తల్లిదండ్రుల్ని కూడా ఈ రచన ఆలోచింపజేస్తుందని నా ఆశ. 'లండన్‌లో చంద్రుడు' సీరియల్‌గా స్వాతి వార పత్రికలో వచ్చింది. అలా నేను పాఠకులకు పరిచయం అయ్యాను. ఆ తర్వాత ఆంధ్రభూమి వార పత్రికలో 'ఉత్సవ్' నవల సీరియల్‌గా వచ్చింది. అదే పత్రికలో 'శ్రీరామ్ LIC' నవలకు ద్వితీయ బహుమతి వచ్చింది. 'స్వప్న' మాసపత్రికలో ప్రచురితమైన ఒక కథకు బహుమతి పొందాను. మరి కొన్ని కథలు వివిధ పత్రికల్లో వచ్చాయి. నా నవలను ఎంపిక చేసిన 'చతుర' సంపాదక వర్గానికి నా ధన్యవాదాలు.

చిరునామా:
**పి.సృజన్ సేన్**
ఫ్లాట్ నెం. 909, సఫైర్ బ్లాక్,
'మై హోమ్ జ్యువెల్', మదీనాగూడ,
మియాపూర్, హైదరాబాద్-500049

ఇంకో విషయం చెబుతున్నాను. ఈ రోజున మీరు ఏది అనవసరం అనుకుంటారో రేపు అదే అవసరంగా ముందుకొస్తుంది. దేన్ని నిర్లక్ష్యం చేస్తే చివరికి దాని

కోసమే కొన్ని దశబ్దాల ఆశల్ని, ఆశయాల్ని వదిలి వెనక్కి పరుగులు తీయాలి. దాన్ని బట్టి నువ్వూ- జయంత్ ఏం చేయాలో నిర్ణయించుకోండి" అంది.

ఇద్దరూ ఆలోచనలోకి జారిపోయారు.

★ ★ ★

జయంత్ కాలేజ్ నుండి ఇంటికి వస్తున్నాడు. కొన్ని రోజుల తర్వాత ఈ రోజు ఆనందంగా ఉంది. ఇప్పటిదాకా అతనిలో ఉన్న సంకోచాలు ఎగిరిపోయాయి. అమ్మ మాట్లాడిన మాటలు సూర్యకి ఎలా అర్థమైనా అతనికి మాత్రం ఇంకో రకమైన మార్గాన్ని చూపించినట్లు అనిపించింది.

## కొత్తగాలి...

**కరవు**
**నోరు తెరచింది**
**కర్షకుడ్ని**
**మింగడానికి**

– *డి. చందువంశీ,*
కర్నూలు

ప్రేమించటానికి, ఆరాధించటానికి కూడా సాధనాలు కావాలి. అప్పటికప్పుడు కలిగించే సంచలనాలు వేరు.

మనకు దారిలో ఓ సుందరి ఎదురుకావచ్చు. అలా తళుక్కున మెరుస్తుంది. ఆకాశంలో ఓ సాయంకాలం ఇంద్రధనుస్సు దర్శనం ఇస్తుంది. గులాబి మేఘాలు కనిపిస్తాయి. అవన్నీ ఎక్కువసేపు అస్తిత్వంలో ఉండవు. ఆ సమయంలో వాటిని చూసే అవకాశం రావాలి. చూసినా ప్రతిస్పందించే మానసిక స్థితిలో ఉండాలి.

ఏమైనా అవన్నీ ఆ సమయపు ఆకర్షణలు, అద్భుతాలు. అవన్నీ మనసు పొరల్లో కప్పబడిపోతాయి. మనసు మాత్రం ఎన్నింటిని నిల్వ చేసుకోగలదు. గ్రంథాలయాల్లో కొన్నివేల, లక్షల పుస్తకాలు పడుంటాయి. వాటి అవసరం వచ్చినవారి చేతుల్లోకి వెళ్లేదాకా అవి అద్దాల నడుమ బాక్స్‌లో ఉండాల్సిందే.

జ్ఞాపకాలు కూడా అంతే.

రోజువారీ జీవితంలో అవన్నీ గుట్టలు గుట్టలుగా పేరుకుపోయి ఉంటాయి. అప్పటికి అవసరం అయినవి మాత్రం ఎదురుగా నిలబడినట్లు ఉంటాయి.

ఈ రోజు ఆరావళిని చూసాడు.

ఎప్పటిలానే అతని చూపులు ఆమె ఎద మీద ఆగిపోలేదు. తన తలలో గులాబిని చూసాడు. ఆమె చిరునవ్వుని చూసాడు.

కాగితపు పూలచెట్ల కింద లావణ్య - ఆరావళి కూర్చుని మాట్లాడుకుంటున్నారు. తమను రహస్యంగా ఎన్ని కళ్లు గమనిస్తున్నాయో వారికి తెలియదు. అలాగే రహస్యంగా చూసేవారిని ఇంకెవరన్నా గమనిస్తుంటారనీ వారికీ తెలియదు.

బహుశ ఏదో ఒకరోజు ఈ ప్రపంచంలో రహస్యమంటూ ఉండదేమో! మానవ మస్తిష్కాల మీద సైతం దాడులు జరుగుతాయి. అప్పుడు వ్యక్తిగతాలూ, ఏకాంతాలూ ఉండవు.

ఆరావళికి ఎక్కువమంది స్నేహితురాళ్లు ఉన్నట్టు కనిపించదు. లావణ్య మాత్రం తరచూ కనిపిస్తుంటుంది. ఆ అమ్మాయి కూడా టెన్త్ నుంచి జయంత్‌కి తెలుసు.

లావణ్యతోగాని, ఆరావళితోగాని మాట్లాడే అవకాశాలు ఎప్పుడూ రాలేదు. అసలు జయంత్ అనే వ్యక్తి గురించి ఆరాకి తెలిసి ఉంటుందా? అనే అనుమానం వస్తుంటుంది. కాలేజీకి రావటం, పాఠాలు వినటం, ఎవరి ఇంటికి వారు వెళ్లటం. ఇంతకు మించి మదన్ అన్నట్లు ఈ ఊర్లో ఆడపిల్లలూ- మగపిల్లలూ కలిసి

మాట్లాడుకోవటం ఉండదు.

చాలా కొద్దిమంది మాత్రం అలా చేస్తారు.

ముందు అసలు ఆడపిల్లలు మగవారితో మాట్లాడటానికే ఇష్టపడరు. ఎవరన్నా చూస్తే తమ గురించి ఏమేం కథలుగా చెప్పుకుంటారో అని వారి భయం. ఎప్పుడన్నా యాదృచ్ఛికంగా మాటలు కలవాల్సిందే.

జయంత్‌కి అలాంటి యాదృచ్ఛికత రాలేదు.

అలా ఆరావళిని- లావణ్యని చూస్తున్నప్పుడు ఆరా చుట్టూ ఓ కాంతి వలయం మెరుస్తున్నట్లు అనిపించింది. అది లావణ్యలో లేదు. వలయానికి ఆవలవుంది.

వీళ్లు ఎవరి గురించో మాట్లాడుకుంటున్నారు. బహుశా ఎవరి గురించి కూడా కాకపోవచ్చు. వారి అభిరుచులు, పాఠాలు, భవిష్యత్ ప్రణాళికలు ఏమైనా కావచ్చు. అప్పుడు ఆరావళి నవ్వింది.

ఆ నవ్వు మండువేసవి తర్వాత వచ్చే తొలకరి జల్లులా ఉంది. జయంత్‌కి ఏదో పిలుపు వినిపించింది.

ఆలోచనలు తెగిపోయాయి. ఎవరా? అని చూస్తున్నాడు. అప్పుడు దూరంగా 'మధు' కనిపించాడు.

"నిన్నే, ఇలా రా" అని పిలిచాడు.

జయంత్ భ్రుకుటి ముడిపడగా మధు దగ్గరికి వెళ్లాడు.

"ఏంటిరా.. ఆడపిల్లలా తలదించుకుని నడుస్తావు? " అనగానే జయంత్ ముఖం ఎర్రబడింది.

"తలదించుకు నడవటం ఎవరి జన్మహక్కు కాదు" అన్నాడు అప్రయత్నంగానే.

"అలాగా? మనం మగాళ్లం. తల ఎత్తుకుని నడవాలి. రొమ్ము విరుచుకుని నడవాలి" అన్నాడు.

జయంత్‌లో మళ్లీ టీనేజ్ టెంప్టేషన్ మొదలయింది.

రొమ్ము, ఎద- విరుచుకోవటం

మగవాడు రొమ్ము విరుచుకోవాలి.

ఆడవాళ్లు వాటిని చీరకొంగుల మధ్య, దుపట్టాల నడుమ దాచుకోవాలి. ఒకటి శౌర్యానికి గుర్తు. మరొకటి ఏకాంత మందిరంలో కేవలం తన భర్తకు మాత్రం కనువిందు చేయాలి.

ప్రకృతిలో ఈ నియమం స్త్రీలకి మాత్రమేనా!

అది కూడా కొన్ని యుగాల తర్వాత పోగుపడిన భావజాలపు చెత్తా? చెత్తేనా! అది మండిస్తే 'విద్యుత్' వస్తుంది కదా!

"ఏంటిరా? ఎదురుగా మనిషిని పెట్టుకొని ఎక్కడో మనసు పెట్టావు.. లెసన్స్ వింటున్నప్పుడూ ఇంతేనా? "

జయంత్ అతని కళ్లలోకి చూసాడు. అవి ఎర్రటి జీరల్ని పులుముకుని ఉన్నాయి. అతన్ని అప్పుడు నిశితంగా చూసాడు. చొక్కాకి పైరెండు గుండీలు పెట్టలేదు. విశాలమైన వక్షస్థలం. షర్ట్ కూడా బిగుతుగా ఉంది. కండలు తిరిగిన శరీరం. రోజూ వ్యాయామం చేస్తాడనుకుంటా. శరీరాకృతి బలంగా ఆకర్షణీయంగా ఉంది.

"ఏంటిరా ఆ మదన్‌గాడు ఆరావళిని లవ్ చేస్తున్నాడంట కదా!" అన్నాడు అదోలా చూస్తూ.

"ఆ విషయం నన్ను ఎందుకు అడుగుతున్నారు? "

"మీ ఇద్దరూ ఫ్రెండ్స్ కదా"

"మీరు కూడా నాకు ఫ్రెండ్"

"నీకు నేను ఫ్రెండ్ ఏంటిరా - సీనియర్ని"

"సీనియర్లు ఫ్రెండ్స్ కాకూడదా మధూ? " అన్నాడు జయంత్.

అప్పుడు అదోలా చూసాడు. బహుశా మధు అన్నందుకు అనుకున్నాడు

జయంత్. ఎంత సీనియర్ అయినా తనని 'రా' అని పిలవటం జయంత్‌కి నచ్చలేదు. వారి మధ్య అంత స్నేహం కూడా లేదు.

"నాతో స్నేహం చేయాలంటే నీలా ఉండకూడదు జయంత్. కొంచెం మ్యాన్లీగా ఉండాలి" అని..

"మదన్‌గాడికి చెప్పు. ఆడపిల్లలు మాటలు చూసి పడిపోరు. మగాడికి కండలుండాలి. గుండెనిండా బలం ఉండాలి. బాడీని బిల్డప్ చేయమను. ఆ తర్వాత ప్రేమ సంగతి చూసుకుంటాడు"

"ఈ విషయాలు నాకెందుకు చెబుతున్నారు? "

"చెప్పాను కదా వాడు నీకు ఫ్రెండని. మీరు మాట్లాడుకుంటుంటారు కదా" అన్నాడు మధు.

"మేం ఇలాంటి విషయాలు మాట్లాడుకోం"

"మరే విషయాలు మాట్లాడుకుంటారు? "

"అవి మీకు అంత ఇంట్రెస్ట్ కలిగించవు. 'మైండ్'ని ఎక్స్‌ప్లోర్ చేసే విషయాలు చెబుతుంటాడు" అన్నాడు జయంత్.

"అంటే నాలుగు ఊర్లు తిరగగానే మైండ్ ఎక్స్‌ప్లోరవుతుందా? వాడికి డబ్బులుండొచ్చు. ఫ్యాషన్ డ్రెస్‌లు వేయొచ్చు. దాంతో ఆడపిల్లలు వాడి చుట్టూ తిరుగుతారని అనుకుంటున్నాడు. ఆడవాళ్లు కోరుకునేది తమకి రక్షగా ఉండే మగవాడ్ని. ఆ దమ్మూ- ధైర్యం నాకున్నాయి.

"ఇదేమన్నా గోదాలో కుస్తీ పోటీనా మధు గారూ? ప్రేమ అని మీరు అంటున్నారు. చూస్తుంటే ఇదేదో యుద్ధంలా ఉంది"

"అవును. కప్పు ఒకటే ఉంటుంది. గెలిచేది ఒక్కడే. పోటీలో చాలామంది ఉంటారు".

"మంచిది. ఏమయినా సంబంధంలేని వారిని మాత్రం ఈ పోటీలోకి లాగకండి" అని జయంత్ వచ్చేసాడు.

★ ★ ★

నేనూ- నా గది.

ఎంతమంది నా చుట్టూ ఉన్నా నా నేస్తం ఈ నా పుస్తకం. నాతో నేను ఇక్కడే మాట్లాడుకుంటాను. నన్ను నేను విశ్లేషించుకుంటాను. నాది ఎంత చిన్న ప్రపంచమో ఇప్పుడు అర్థమవుతోంది. ప్రతి రోజు ఓ కొత్త అనుభవం నన్ను తాకుతోంది. మధుకి తన దేహం మీదే నమ్మకం ఉంది.

మదన్‌కి తన మేధస్సు మీద నమ్మకం ఉంది. ఎవరి వాదనలు వారికి ఉన్నాయి. ఇద్దరికీ భయాలున్నాయి. వారిద్దరికంటే నాకు సూర్య నయం అనిపిస్తున్నాడు. అతనిది ప్రపంచపు గొడవ. వీళ్ల గొడవ ప్రపంచానికి గొడవ.

ఇది చిన్న ఊరని మదన్ అనుకుంటున్నాడు. అతను అనుకునేంత అమాయకమైన ఊరని మాత్రం అనిపించటం లేదు.

మనం ఎదుటివారి గురించి తెలుసుకుంటే కదా? నిజానికి మా అమ్మ సూర్యతో మాట్లాడుతున్నప్పుడు నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. మా అమ్మలో ఇన్ని భావాలున్నాయా! ఇన్ని పుస్తకాలు చదివిందా? అలాంటివి నేను మా ఇంట్లో చూడలేదు. అంత మాత్రాన చదవకూడదనేం లేదు. ఆడపిల్లలు నిజంగా పదో సంవత్సరం నుండి స్వేచ్ఛని కోల్పోతారు. మగపిల్లలూ అంతే. ఒకప్పుడు ప్రతి సంవత్సరం పరీక్షలో ఉత్తీర్ణులు కావాలి. ఇప్పుడది లేదు.

అయినా ఇప్పుడు ప్రభుత్వ పాఠశాలలు మాత్రమే లేవు. ఎన్నో ప్రైవేటు సంస్థలు వచ్చాయి. అవి విపరీతమయిన పోటీని తీసుకువచ్చాయి. చిన్నప్పటి నుంచే అందరూ స్వేచ్ఛని కోల్పోతున్నారు. ఇది

నా దృష్టిలో ఉంది. టీనేజ్ మాత్రమే కాదు. బాల్యం ఎక్స్‌ప్లోరయింది. ముఖ్యంగా తెలుగు భాష ఆ ఫలితాన్ని చవి చూస్తోంది. ముందు ముందు ఇంకా ఈ భాష మనకి దూరం అయిపోతుంది. ఈ పరిస్థితి నగరాల నుండి, చిన్న చిన్న పట్టణాలకు వ్యాపించింది. గ్రామాలకు పాకటానికి ఎంతో దూరం లేదు.

అరవైల్లో ఇలా ఉందా!

అప్పుడు ప్రేమలున్నాయా?

అవన్నీ ఎవరి మనసులకి వారు పరిమితం చేసుకున్నారా? బయటకు చెప్పుకోవటానికి కూడ సిగ్గు పడేవారనుకుంటాను. ఎందుకో ముందు ముందు ఈ ప్రేమలు చాలా రకాలుగా మార్పులు చెందుతాయనిపిస్తోంది.

ఇంతకూ దేహం ఉంటే ప్రేమిస్తారా? మేధస్సుంటే ప్రేమిస్తారా? ప్రేమను వ్యక్తపరచటంలో ముందుంటే ప్రేమ సఫలం అవుతుందా? ఇప్పటికే ఈ పోటీలో ఇద్దరు ఉద్దండులున్నారు. రహస్యంగా ఇంకెంత మందున్నారో తెలియదు.

నేను శారీరకంగా బలహీనంగా ఉంటాను - మధుతో పోల్చుకుంటే. మానసికంగా బలహీనంగా ఉన్నాను, మదన్‌తో పోల్చుకుంటే.

అందుకని ఇప్పుడు నేను చేయవలసింది. నాలోని శక్తులు పెంచుకోవటం!

ఇది వాళ్లతో యుద్ధం చేయటం కోసం కాదు. నన్ను నేను యుద్ధానికి తయారు చేసుకోవటం!

★ ★ ★

కాలేజీ వెనకాల పొలాలు ఉన్నాయి. అక్కడికి జయంత్ ఎప్పుడూ వెళ్లలేదు. బ్రిటీష్ హయాంలో కట్టిన భవనం కాక వెనకాల తర్వాత కాలంలో ఇంకో భవనం కట్టారు. చాలా దూరంగా ఎప్పుడో ఓ టాయ్‌లెట్ కట్టారు. అది నిరుపయోగంగా పడుంది.

నిజానికి కాలేజ్‌కున్న మైదానం తలుచుకుని ఒకప్పుడు అక్కడ విద్యార్థులు గర్వపడేవారు. మగపిల్లల కోసం ఇసుక తెప్పించి పోసారు. అక్కడ కబడ్డీ ఆడేవారు. బాల్ బ్యాడ్మింటన్ కోర్టులు రెండు, వాలీబాల్ కోర్ట్స్, ఫుట్‌బాల్ కోర్టు ఒకటి ఉండేవి.

ఆడపిల్లలకి సైతం ఓ కోర్టు ఉండేది. అది బ్యాడ్మింటన్‌కోర్టు. ఒకరిద్దరు పిల్లలు మాత్రం ఆడేవారు. ఎక్కువ మంది 'రింగ్' ఆడేవారు.

ముందు అది జడ్.పి. హైస్కూల్ ఆరవ తరగతి నుండి మొదలు. అప్పట్లో ఎస్.ఎస్.ఎల్.సి దాకా ఉండేది. తర్వాత

> **కొత్తగాలి...**
>
> **పనిచేసే యంత్రం**
> **సంసారం నడిపే తంత్రం**
> **ఎప్పుడూ లేదు స్వతంత్రం**
> **స్త్రీ!!**
>
> – డి. శిరీష చంద్రశేఖర్,
> కర్నూలు

జూనియర్ కాలేజ్ అయింది. దానికోసం దాతలు విరాళాలు ఇచ్చి ఓ లేబరేటరీ భవనం కట్టించారు.

అరవయ్యో దశకంలో అక్కడ ఎందరో చదువుకున్నారు. డెబ్భైలవరకు అది వెలిగిపోయింది.

ముఖ్యంగా ఇక్కడ నుంచి ఎందరో ఆటగాళ్లు తయారయ్యారు. మూడు గంటలు దాటిన దగ్గర్నుంచి మైదానం కళకళలాడుతుండేది. ఎవరికి ఇష్టమైన ఆటలు వాళ్లు ఆడేవారు. ఈ స్కూల్ చరిత్రలో ఇద్దరు ఆడపిల్లల గురించి ఇప్పటికీ చెప్పుకుంటారు.

ఒకమ్మాయి స్టేట్ లెవెల్ కాంపిటీష న్స్‌లో పాల్గొంటే ఇంకో అమ్మాయి నేష నల్ లెవెల్‌లో పాల్గొని బహుమతులు పొందింది. అందులో రన్నింగ్, జావెలిన్ త్రో, మరికొన్ని విభాగాలున్నాయి.

ఈ ఊర్లోనే 'గాల్స్ హైస్కూల్' ఉంది.

ఓల్డ్‌టౌన్‌లో ఓ హైస్కూల్ ఉంది.

ఇటీవల కాలంలో డిగ్రీ కాలేజ్ మంజూ రయింది. తాత్కాలికంగా ఓ అద్దె భవ నంలో దాన్ని నిర్వహిస్తున్నారు. ఆ కాలే జ్ కి ఓ గ్రౌండ్ అంటూ లేదు.

జూనియర్ కాలేజ్ స్థలాల్లో మెల్లగా ఓ మూలనుండి గుడిసెలు లేవటం మొదలు పెట్టాయి.

అప్పట్లో ఉన్న హెడ్‌మాస్టర్ ఈ విషయంలో కొంత పని చేసారు. స్కూల్‌కి చెందిన స్థలం చుట్టూ ఓ ప్రహరీ గోడని నిర్మించాలనుకున్నారు. అందుకు కొన్ని వేల రూపాయలు కావాలి.

అప్పటికే రాజకీయాలు వచ్చాయి.

కొంతమంది దాతలు ముందుకువచ్చినా అది కార్యరూపం దాల్చలేదు. మొదట్లో పోలీసుల సాయంతో గుడిసెలు తొలగిం చారు. అప్పుడు గొడవలయ్యాయి.

అయిదారు నెలలు తిరిగేసరికి మళ్లీ ఇంకోపక్క నుండి గుడిసెలు వేసుకోవటం మొదలు పెట్టారు.

అలా కొంతవరకు ఆయన ప్రయత్నం చేసి ఆ తర్వాత విసిగిపోయారు. ఆర్ అండ్ బి వారు ఓ పక్కన చిన్న ఆఫీసు కట్టుకున్నారు.

సూర్య ఇవన్నీ జయంత్‌తో చెప్పాడు.

"ఇప్పుడు ఆడపిల్లలు టాయ్‌లెట్ సౌకర్యం లేక చాలా ఇబ్బందులు పడుతు న్నారు. ఎవరూ పట్టించుకోరు, నిజంగా ఎంత దౌర్భాగ్యం" అన్నాడు బాధగా.

"నిజమే అనుకో కానీ బాధపడేవారు ఎందుకు మౌనంగా ఉంటున్నారు వాళ్ళు అడగొచ్చు కదా!"

"అదే చెబుతున్నాను. బాధలుపడేవారు వాటికి అలవాటు పడిపోతారు. మనం పోరాటం చేస్తే ఏదయినా సాధించుకో వచ్చు అనేదానిని వారు గుర్తించరు. అది చదువుకున్నవారు కావచ్చు, చదువుకోని వారు కావచ్చు. మనమే వారిని ముందుకు కదిలించాలి" అన్నాడు.

"మనం అంటే"

"ముందు మనిద్దరం. నువ్వు, నేను మన వాళ్లతో మాట్లాడదాం"

"నేనా!"

"ఏంటి జయంత్ అలా అయిపో యావు? మీ అమ్మ ఏమన్నా అంటారని భయపడుతున్నావా? "

"అదేం కాదనుకో..." అని నసిగాడు.

"మీ అమ్మ ఒకటే చెప్పారు. నిర్ణయం తీసుకోవాల్సింది మీరే అని. తను చెప్పిన మాటల్లో మనం ఆలోచించాల్సిన విష యాలు కొన్ని ఉన్నాయి. నిన్ను నేను చదువు మానేసి ఈ పనులు చేయమ నటం లేదు. ఈ సమాజానికి మనవంతు కర్తవ్యం మనం చేయాలి" అన్నాడు సూర్య.

"నాకు ఆడపిల్లలతో మాట్లాడాలంటే సిగ్గు" అన్నాడు జయంత్.

"సిగ్గు పడటం ఎందుకు? మనుషులు ఆడవారిగానో, మగవారిగానో పుడతారు. అది ఎవరి చేతుల్లోనూ ఉండదు. మనం ఇంకా ఆడా- మగా కాని వారి గురించి మాట్లాడే పరిస్థితిలో లేం. ముందు ముందు వారి గురించి కూడా ఆలోచిం చాలి. వారి సంఖ్య ఎంత తక్కువగా అయినా ఉండవచ్చు" అన్నాడు సూర్య.

జయంత్‌కి భయం కలిగింది.

అతనికి ఈ ప్రపంచం, ముఖ్యంగా భార తదేశం కొన్ని వేల కులాలుగా, కొన్ని పదుల మతాలుగా, అనేకానేక ప్రాంతా

లుగా చీలిపోయి ఉందని కాస్త ఆలోచన మొదలయిన దగ్గర్నుండి అనుభవంలోకి వచ్చింది.

సూర్యని చూస్తుంటే మొత్తం ప్రపంచాన్నంతా సంస్కరించాలనే ఆవేశం కనిపిస్తోంది. ఇంత పెద్ద సమాజాన్ని ఎదుర్కోవాలనే ఆలోచన ఆ భయానికి కారణం.

అందుకు ఎవరికి వారు పూనుకోవాలి తప్ప- వీరందరిని మార్చటం ఎవరి తరం అవుతుంది?

కనీసం చిన్న లక్ష్యాలు ఏర్పరుచుకోవాలి తప్ప - ఇంత పెద్ద పనిని తలమీద పెట్టుకొంటే అది మోయటం కష్టం అని తెలుస్తూనే ఉంది.

అందుకే అమ్మ హెచ్చరించి ఉంటుంది!

జయంత్‌ని గమనించాక సూర్య "ఇప్పటికిప్పుడు నిన్ను అన్నీ చేయమని అనను. ముందు మనం హెడ్‌మాస్టార్ని కలిసి మాట్లాడదాం. నువ్వు మాట్లాడాల్సిన అవసరం లేదు. నా వెనకాల ఉండు. ఇంకో ఇద్దరు ముగ్గురు మిత్రుల్ని పిలుస్తాను. అందరం మాట్లాడదాం" అన్నాడు.

'నన్ను వదిలెయ్యి' అనాలనుకున్నాడు జయంత్. కానీ మొహమాటం అడ్డు వచ్చింది.

"మొదట్లో ఎవరికయినా ఇలాంటిది ఉంటుంది. నేను నలుగురి ముందు నిలబడి మాట్లాడటానికి నీలానే సిగ్గుపడేవాడ్ని. తర్వాత ఆ లక్షణాన్ని బలవంతాన వదిలించుకున్నాను" అన్నాడు సూర్య.

జయంత్ ఏదో చెప్పేలోగానే అన్నాడు.

"మనతోపాటు ఆడవారి తరఫున ఒకరయినా ఉంటే బాగుంటుంది. మనం హెచ్.ఎమ్. దగ్గరికి వెళ్లేముందు ఆరావళితో మాట్లాడుదాం."

"ఆరావళితోనా!" అన్నాడు నమ్మలేనట్లు.

"అవును. ఆ అమ్మాయికి ఫ్రెండ్స్ ఉంటారు. వాళ్లని కూడా పిలవమని అడుగుదాం"

"ఆరావళినే ఎందుకు అడగాలనుకుంటున్నావు సూర్యా?"

"కొన్ని పేర్లు అలా ఉంటాయి. వాటిని బట్టి వాళ్ళ అమ్మా-నాన్నల మనస్తత్వాన్ని అంచనా వేయవచ్చు. ఆరావళి అని పేరు పెట్టటంలోనే ఆ అమ్మాయి తల్లిదండ్రులు తననుండి ఏదో ఆశిస్తున్నారు"

'జయంత్' అని తన పేరు పెట్టడం వెనక అమ్మా-నాన్నలు తననుండి ఏం కోరుకుంటున్నారు? జీవితంలో వ్యక్తిగతంగా విజయం సాధించటమా?' అనుకున్నాడు.

ఇప్పుడు మాత్రం ఆరావళి పేరు వినగానే కాదనలేకపోయాడు.

> **కొత్తగాలి...**
>
> **ప్రగతి కూడిన ప్రకృతి**
> **అందాన్ని పెంచుతుంది**
> **మిడిసిపాటు మాత్రం**
> **వికృతమవుతుంది**
>
> – త్రిశూలం,
> పెద్దచెల్మెడ, మెదక్ జిల్లా

సూర్య- జయంత్ ఇద్దరూ వెళ్లారు.

కాగితపు పూలచెట్టు కింద లావణ్యతో ఎప్పటిలానే మాట్లాడుతోంది ఆరావళి. సూర్యని చూడగానే ఇద్దరి ముఖాల్లో అప్పటిదాకా ఉన్న చిరునవ్వు మాయం అయింది.

ఎందుకు వచ్చారు అన్నట్టు చూస్తున్నారు.

"నమస్కారం ఆరావళిగారూ" అన్నాడు సూర్య.

జయంత్ తలదించుకున్నాడు. ఆరావళికి అంత దగ్గరగా రావటం తనకు అదే

మొదటిసారి.

వాళ్లు కాస్త ఇబ్బందిగా చూసారు తప్ప ప్రతినమస్కారం చేయలేదు.

"మేం లేడీస్ టాయ్‌లెట్‌కి సంబంధించి హెచ్.ఎమ్. గారికి ఓ రిప్రజెంటేషన్ ఇవ్వాలను కుంటున్నాం, మాతోపాటు మీరు కూడా వస్తే బాగుంటుంది. రేపు మనం హెచ్.ఎమ్‌గారిని కలుసుకుందాం" అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు.

"నిజానికి మేమే చాలా ఇబ్బందులు పడుతున్నాం. మీ ఆడపిల్లలు ఇంకా ఇబ్బంది పడుతున్నారని మాకు తెలుసు, మన సమస్యల్ని మనం పరిష్కరించుకోవాలి కదా!" అన్నాడు సూర్య.



"నిజమే అనుకోండి కాకపోతే టాయ్‌లెట్..." అని ఆగింది లావణ్య.

"ఇందులో సిగ్గు పడాల్సిందేం లేదు లావణ్యగారూ... ఈ రోజుకి కూడా చాలా గ్రామాల్లో ఆడవాళ్లు ఈ సమస్యని ఫేస్ చేస్తున్నారు. మనం చదువుకుంటున్నాం. మన సమస్యలు చెప్పుకోవటంలో తప్పులేదు. ఇదే అనికాదు మీకు ఇంకే సమస్య ఉన్నా మనం వారితో మాట్లాడవచ్చు" అన్నాడు.

"రేపు ఎన్ని గంటలకి?" అంది లావణ్య.

"ప్రేయర్ అయిపోగానే కలుద్దాం" అన్నాడు.

లావణ్య తలూపింది. ఇద్దరూ అక్కడ నుండి వచ్చేసారు.

ఆరావళి ఏమీ మాట్లడకపోవటం జయంత్‌కి కాస్త నిరాశగా అనిపించింది. అయినా అక్కడ నిలబడినంతసేపూ తల దించుకునే ఉన్నాడు.

అదే సూర్య అన్నాడు.

"నువ్వు మాట్లాడకపోయినా తలదించుకోవటం ఎందుకు?"

"నాకు ఆడపిల్లల కళ్లలోకి చూసి మాట్లాడాలంటే సిగ్గు, ఏమన్నా అనుకుంటారని!"

"ఏమనుకుంటారు, మనలో ఎలాంటి వక్రదృష్టి లేనప్పుడు. మనందరం ఒకే చోట కలిసి చదువుకుంటున్నాం. అయినా నువ్వు అనంతగారబ్బాయిగా అంత సిగ్గు



డాలి. సూర్య పక్కన ఉన్నా మాస్టారు అడిగే ప్రశ్నలకి తను జవాబు చెప్పవలసిరావచ్చు. అప్పుడు తడబడకూడదు.

'మాస్టారు ఏమడుగుతారు? తను ఏం చెప్పాలి?' అనే ఊహల్లోనే రాత్రి కరిగిపోయింది.

ఉదయం లేవగానే అనంత జయంత్ ముఖంలోకి చూసింది. ఏమన్నా అడుగుతుందేమో అనుకున్నాడు. అనంత మాట్లాడలేదు!

కాలేజ్‌కి వస్తుంటే మదన్ ఎదురయ్యాడు.

"ఏం జయంత్ నువ్వు-సూర్య ఆరావళితో ఏదో మాట్లాడారంట" అన్నాడు.

"ఎవరు చెప్పారు?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఎవరు చెప్పారో వదిలేయ్. నాకు అన్ని విషయాలు తెలుస్తుంటాయి" అన్నాడు మదన్.

పడకూడదు" అన్నాడు సూర్య.

జయంత్ మాట్లాడలేదు.

హెచ్.ఎమ్. గారు అయిదారు సంవత్సరాల నుండి ఇక్కడ పని చేస్తున్నారు. ఇప్పుడు జూనియర్ కాలేజీకి అయన్నే ప్రిన్సిపాల్‌ని చేసారు. అంతకు ముందు ఓసారి ఆయనకి బదిలీ అయింది. అప్పుడు కూడా ఎక్కువ సంవత్సరాలు హెచ్.ఎమ్.గా ఆయనే పని చేసారు. అందుకే హెచ్.ఎమ్. గారు అని పిలుచుకోవటం అలవాటయింది.

ఏమైనా జయంత్‌కి ఆ రాత్రి పుస్తకాలు చదవాలనిపించలేదు. ఉదయం ఆరావళితో ఆయన ముందు నిలబడి మాట్లా

"బాత్‌రూమ్స్ ప్రాబ్లమ్ గురించి మన ప్రిన్సిపాల్ గారితో మాట్లాడాలి అన్నాడు సూర్య. అందుకు ఆరావళివాళ్లను రమ్మని అడిగాడు"

"అంతేనా?"

"అంతేకాక ఇంకేముంటుంది?"

"నువ్వు సూర్యగాడితో తిరిగితే ఎందుకూ పనికిరావు. యూనివర్సిటీ హాస్టల్స్‌లో ఇలాంటి బాపతు ఉంటారు. సంవత్సరాల తరబడి చదువుతూనే ఉంటారు. వాళ్లకి కావలసింది చదువుకాదు, రాజకీయాలు"

అన్నాడు.

"మన కాలేజీకి హాస్టల్ లేదు" అన్నాడు జయంత్.

"అంటే ఇంటర్ తర్వాత కూడా ఇక్కడే ఉంటావా? డిగ్రీ ఈ ఊర్లోనే చేయాలను కుంటున్నావా? యూనివర్సిటీ గడప తొక్కవా? " అన్నాడు.

"అవన్నీ నేను ఆలోచించలేదు మదన్"

"ఆలోచించాలి. నువ్వు ప్రిన్సిపాల్ ని కల వకపోవటం మంచిది. ఇది బాత్‌రూమ్లో ఆగదు. నిన్ను మెల్లగా వాడి పార్టీలోకి లాగేసుకుంటాడు" అన్నాడు.

"నీకు ఆరావళి ప్రేమ కావాలిగాని వాళ్ల సమస్యలు అవసరం లేదా? పైగా నువ్వు

## కొత్తగాలి...

**నీ పిల్లలకు**
**నువ్వు ఇవ్వాల్సిన**
**సంపద**
**పుస్తక భాండాగారం**

– భానుమూర్తి,
హైదరాబాద్

చలంగారి పుస్తకాల గురించి మాట్లాడ తావు" అన్నాడు జయంత్.

మదన్ కొద్దిక్షణాలు ఆశ్చర్యంగా చూసాడు.

"ఏం జయంత్! నీ వాయిస్‌లో మార్పు వచ్చింది. నీకు తెలియదు. ఎందరో ఇంజనీర్లు- డాక్టర్లూ ఈ ఉద్యమాల్లోకి వెళ్లి చనిపోయారు. నువ్వు నా ఫ్రెండ్‌వి కాబట్టి ముందుగా హెచ్చరిస్తున్నాను" అన్నాడు మెల్లగా.

"చలంగారు కూడా రమణాశ్రమానికి వెళ్లారు. అది కూడా ఓ చావులాంటిదే అన్నవారున్నారు"

ఈసారి షాక్‌తో చూస్తూ-

"నువ్వు చలంగారి పుస్తకాలు చదివావా, ఎప్పుడూ మాట్లాడలేదు" అన్నాడు.

"సందర్భం రాలేదు. అయినా నా గురించి నువ్వు వర్రీ కావద్దు మదన్. నేను ఏ ఉద్యమాల్లోకి వెళ్లటం లేదు. నీ గురించి నువ్వు బాధపడు"

"నా గురించి నేను బాధపడాలా? ఏ విషయంలో"

"ఆరావళి గురించి. తనను ఎవరు చూసినా, ప్రేమించినా నువ్వు తట్టుకోలేవు కదా? నాకు తెలిసి మధు చలాన్ని చదవ లేదు. పైగా అతనికి కండలున్నాయి. ఆరావళిని ఎవరన్నా చూస్తే మధు భరించ లేడు. ఆమె అతని స్వంతం అనుకుంటు న్నాడు"

"నువ్వు వాడితో మాట్లాడావా? "

"అతనే నాతో మాట్లాడాడు- నీ ఫ్రెండ్‌కి డబ్బులుండొచ్చు. నాలుగు నగరాలు చూడొచ్చు. నాలెడ్జ్ ఉండొచ్చు. అంతమాత్రాన ఆడపిల్లలు ప్రేమలో పడిపోరు- అని చెప్పు అన్నాడు"

"అంటే కండలు చూసి పడిపోతారా? "

"అని అతను అనుకుంటున్నాడు"

మదన్ చిన్నగా తలూపి ఆలోచనలోపడ్డాడు.

"నాకు తెలిసి ప్రేమ ఎప్పుడూ ఒకే చోట ఉండదని చలంగారు చెప్పారు. ఓ అందమైన పువ్వుని ఎవరైనా చూడొచ్చు. కొండల అందాన్ని చూడవచ్చు. అది నాకు మాత్రమే స్వంతం కావాలి అనుకోవటం తోనే బాధ మొదలవుతుందన్నారు"

"ఎక్కడ అన్నారు, ఏ పుస్తకంలో అన్నారు? " అన్నాడు మదన్ చిరాగ్గా.

"కొటేషన్ల గురించి నన్ను అడగొద్దు. నేను అర్థం చేసుకున్నవరకు నేను చెబుతున్నాను. ముందే ఆ విషయం చెప్పాను"

"అయినా వాడు నాతో మాట్లాడొచ్చు

నీ దగ్గర ఈ ఏడుపెందుకు? "

"నువ్వు కూడా సూర్యని అడగొచ్చు. జయంత్‌ని పాడుచెయ్యకని చెప్పవచ్చు. నాతోనే కదా మాట్లాడుతున్నావు"

మదన్ మాట్లాడలేకపోయాడు.

★ ★ ★

మదన్‌తో మాట్లాడింది నేనేనా అనుకున్నాను.

నేను నా ఆరా ముఖంలోకి చూడలేకపోయాను. అయితే నేను మాట్లాడుతున్నప్పుడు మదన్ ముఖంలో పలుకుతున్న రకరకాల భావనల్ని చూసాను.

అతని కమ్యూనికేషన్ స్కిల్స్ మీద అతనికి నమ్మకం ఉండొచ్చు. తన కంటే గొప్పగా మాట్లాడేవారు మా ఊర్లో లేరనుకోవచ్చు. మనిషి ఎంత కృత్రిమమైన భ్రమలు సృష్టించుకుంటున్నాడు. నా వరకు నాకు ప్రతిభా ప్రదర్శనం చేయాలనిపించిందా!

నువ్వనుకుంటున్నంత చిన్నవాడ్ని కాదు అని చెప్పాలనుకున్నానా?

ఇంతకూ మదన్ దిగ్భ్రమ చెందింది నా గురించా? మధు గురించా?

'నేనుసైతం ఆరావళిని ప్రేమిస్తున్నాను' అనే సంకేతం నేను పంపించగలిగానా?

అయినా ప్రేమ అనేది వ్యక్తిగత విషయం. నేను ఆరావళిని ప్రేమిస్తున్నాను. అది తెలియవలసింది 'ఆరా'కి.

అంతేగాని బట్టల్నీ - బంగారాన్నీ - ఆస్తుల్ని ప్రదర్శించినట్లు ప్రేమను అంత బహిరంగంగా వ్యక్తం చేయాలా?

మధు గులాబి రెక్కల్ని చప్పరిస్తాడంట.

ఎవరికి వారు తమకు చెందని మనుషుల మీద నిశ్చితాభిప్రాయాలకు వచ్చేయటమేనా?

ఇప్పుడు ఆలోచిస్తుంటే నాలోనూ అలాంటి ధోరణి మొదలయిందా అనిపిస్తోంది.

'ఇంతకూ ఈ రోజు ఆరా ఎందుకు కాలేజ్‌కి రాలేదు? '

ఆమెకు సూర్యనీ- నన్నూ చూడటం ఇష్టం లేకా?

ఇలాంటి కార్యక్రమాల్లో పాల్గొంటే ఇంట్లో ఒప్పుకోరా?

అలాంటిదుంటే సూర్యకు ముందే చెప్పవచ్చు. ఆ తర్వాత అతను అడగడు కదా.

లావణ్య మాత్రం వచ్చింది.

ప్రిన్సిపాల్ ముందు ముగ్గురు మగపిల్లలం, లావణ్య మాత్రం నిలబడ్డాం. సూర్య మాట్లాడాడు. ఆయన మౌనంగా విన్నారు. అప్పుడాయన ముఖంలో కాస్త సిగ్గు కనిపించిందా అనుకున్నాను.

మాస్టారికి ఆడపిల్లలుంటారు. వారు చదువుకుంటుంటారు. ఆయనయితే మా ఊర్లో ఉంటారుగాని కుటుంబం వేరే ఊర్లో ఉంది. ఆయన పిల్లలు అక్కడ చదువుకుంటున్నారు. ఎక్కడ చదివినా ఇలాంటి సమస్యలుంటాయి కదా. కాకపోతే మాస్టారికి సహకారం తక్కువగా ఉంది.

నిజానికి ఆయన మొదట్లో చాలా ప్రయోగాలు చేశారు. స్కూల్ ఆవరణలో మొక్కలు పెంచటం నుండి పిల్లల్లో క్రీడాసక్తి కలిగించడానికి దాంతో పాటు గ్రంథాలయాన్ని పిల్లలు ఉపయోగించుకునేలా చేయటానికి తాపత్రయం పడ్డారు.

అప్పట్లో క్రాఫ్ట్ టీచర్, డ్రాయింగ్ టీచర్, లైబ్రేరియన్, ల్యాబ్ అసిస్టెంట్లు ఈ ఉద్యోగాలన్నీ అలంకార ప్రాయంగా ఉండేవి. స్కూల్‌కి వచ్చి, కాలక్షేపం చేసి జీతాలు మాత్రం తీసుకునేవారు. స్వీపర్లు మూడు నాలుగు రోజులకి స్కూల్ పరిసరాలను శుభ్రం చేసేవారు. అలాంటివన్నీ ఒక్కసారిగా మారిపోయాయి.

గట్టిగా సంవత్సరం తిరగకముందే ఆయనకి సహకారం తగ్గిపోయింది. ఎక్కువ మంది స్టాఫ్‌కి రాజకీయాల్తో సంబంధాలు

న్నాయి. ఎవరికి వారు అవసరాన్ని బట్టి మంత్రుల నుండి కూడా ఫోన్లు చేయించటం మొదలుపెట్టారు.

జిల్లా పరిషత్ స్థాయి రాజకీయాలకు అంతే లేదు.

అందుకే తన పని తాను చూసుకోవటం మంచిది అనే అభిప్రాయానికి వచ్చారు. ఆయనకు ఎందుకో యూనియన్ల మీద అంత సదభిప్రాయం లేదు. అందుకు కారణం కూడా చెబుతుంటారు.

అప్పట్లో వార్షికోత్సవాలు చాలా ఘనంగా జరిపేవారు. ఆయా రంగాల్లో ప్రముఖులయిన వ్యక్తుల్ని వివిధ ప్రాంతాల నుండి తీసుకువచ్చేవారు.

సినిమా కళాకారులన్నా ఆయనకి ఇష్టం ఉండేది కాదు. కానీ పిల్లలందరితో కళారూపాలు తయారు చేయించి ప్రదర్శింపచేసేవారు. ఓ సంవత్సరం ఈ వేడుక జరుగుతుండగా రెండు వర్గాలు పరస్పరం దాడి చేసుకున్నాయి.

తలలు పగిలాయి. చాలా రోజులు పోలీస్‌స్టేషన్ల చుట్టూ తిరిగారు. అప్పటి నుంచి ఆయనలో మార్పు వచ్చింది. మెల్లగా ఆయన చొరవ చూపించటం మానేసారు. మళ్లీ ఇప్పుడు సూర్య చొరవతో కదలిక వచ్చింది.

మాస్టారు తన గది నుండి బయటకు వచ్చారు.

అందరూ కలసి బాత్‌రూమ్‌ల దగ్గరికి వెళ్లటం జరిగింది. వాటిని బయట తిరిగే జనం ఉపయోగిస్తున్నారనుకుంటా. భయంకరమైన దుర్వాసన! అక్కడ తుమ్మ చెట్లు ఏపుగా పెరిగివున్నాయి. ఇప్పటి వరకూ వాటి చాటుకు వెళ్లి ఆడపిల్లలు లఘుశంక తీర్చుకుంటున్నారు. అందు కోసం గుంపులుగా వెళ్తారు.

కొందరు చుట్టూ చూస్తుంటారు ఎవరన్నా వస్తున్నారా అని. ఒకరి తర్వాత ఒకరు వెళ్తారు. తిరిగి వారు క్లాస్‌రూమ్‌లకి వస్తున్నప్పుడు ఆ ముఖాల్లో ఎవరెస్ట్ శిఖరం ఎక్కినంత ఆనందం కనిపిస్తుంటుంది.

కొంతమంది చిలిపి కుర్రాళ్లు ఆ ప్రాంతంలో తచ్చట్లాడుతుండేవారు. వారిని చూస్తున్నప్పుడు తిరిగి ఆడపిల్లల తలలు భూమిలో కూరుకుపోయాయా అనిపించేది.

అక్కడ నీళ్ల సమస్య ఉంది. ఏమైనా ముందు వాటిని బాగుచేయించాలనుకున్నారు. తర్వాత అంతదూరంలో కాకుండా దగ్గర్లోనే ఇంకొన్ని టాయ్‌లెట్లు నిర్మించాలని సూర్య సూచించాడు.

అవసరమైన నిధులకోసం అంతగా అయితే ఆ ఊరి ప్రముఖులను కలుసుకోవాలనుకున్నారు. పేరెంట్స్‌తో మీటింగ్ ఏర్పాటు చేయాలని కూడా అనుకున్నారు.

ఎందుకో సంతోషం కలిగింది.

మాతోపాటు ఆరావళి కూడా ఉంటే బాగుండేదనిపించింది. ఎందుకు రాలేదో తనకూ తెలియదు అంది లావణ్య.

నేను అమ్మకు ఈ విషయం చెప్పాను. విన్నాక తలూపింది. అమ్మ మనసులో ఏముందో నాకు తెలియదు.

"మంచిపని చేసారు" అంది.

అమ్మ అలా అన్నందుకు నాకు ఆనందం కలిగింది.

★ ★ ★

అరవయ్యో దశకం చివర్లోనే ఆ ఊరిలో చిన్న సంచలనం కలిగింది. ఆ ఊరికి కొంతమంది కవులు, వామపక్షాలకు చెందిన నాయకులు వచ్చి సభలు పెట్టారు.

కొంతమంది యువకులు ఆ ఉద్యమాలకు ఆకర్షితులయ్యారు. కొందరు పాటలు పాడటం నేర్చుకోవటం మొదలుపెడితే, ఇంకొందరు నాటకాలు వేయటం ప్రారం

భించారు.

అప్పటికి సినిమా హీరోలు ప్రధానంగా రామారావు- నాగేశ్వరరావులే. వారిమధ్య వారి అభిమానుల మధ్య పోటీ ఉండేది.

వారి సినిమాలు విడుదలయినప్పుడు పూలకి, పేడకీ మంచి గిరాకి ఉండేది.

పోస్టర్లన్నీ పేడముద్దల్తో నిండిపోయేవి మొదటి రెండు మూడురోజులు సినిమాలకు వెళ్లేవారు అభిమానుల కేరింతల మధ్య సినిమాను ఆస్వాదించలేకపోయేవారు. ఈ విష సంస్కృతి ప్రారంభం అయిందప్పుడే.

అభిమానుల్ని కేవలం ప్రేక్షకులుగా తమ ఆర్థిక ప్రయోజనాలకు తగిన రీతిలో మార్చుకోవటం మొదలుపెట్టారు కొందరు. తమతమ వంశాలకు ఊడిగం చేయించటానికి బలమైన పునాదులు అప్పుడేపడ్డాయి.

అలాంటి పరిణామాలకు విరుగుడుగా పనిచేస్తామనుకున్న వామపక్ష ఉద్యమాలు ఎంత ఉప్పెనలా ఎగిసిపడ్డాయో, అంత తొందరగానూ చప్పబడిపోయాయి.

అందుకు ముఖ్యకారణం చీలికలు. ఎవరు ఎప్పుడు విడిపోతారో తెలియదు. అందుకు కారణాలు నాయకులు ఏం చెప్పినా సామాన్యులకి అర్థం అయ్యేవి కాదు. యువతరం కూడా ఓ గందరగోళంలో పడిపోయింది.

ఎవరిని అనుసరించాలో తెలియదు.

ఆ పరిణామాలన్నీ ఎమర్జెన్సీ విధించే నాటికి పతాకస్థాయికి చేరుకున్నాయి. వందలాది మంది విద్యార్థులు చంపబడ్డారు. మధ్య తరగతి కుటుంబాల్ని ఈ సంఘటనలు భయభ్రాంతుల్ని చేసాయి.

తమ పిల్లల్ని ఈ ప్రవాహంలో కొట్టుకుపోకుండా చూసుకోవాలనుకున్నారు. కెరీర్ ఓరియంటేషన్ అప్పుడు తొలి అడుగులు వేయటం మొదలుపెట్టింది.

మధ్య తరగతికి చెందిన పైపొరలవారు తమ పిల్లల్ని ప్రభుత్వ కళాశాలల్లో కాకుండా ప్రైవేట్ కళాశాలల్లో చేర్పించటం మొదలుపెట్టారు.

అలాగే రాష్ట్రంలోని యూనివర్సిటీల కంటే ఇతర రాష్ట్రాలకు తమ పిల్లల్ని పంపడం ఆరంభం అయింది.

భవిష్యత్తులో కొన్ని లక్షల కోట్ల రూపాయలకు విద్యా వ్యాపారం విస్తరించనుందని కొందరు మేధావులు లెక్కగట్టారు.

అందుకుతగ్గ ప్రణాళికలను మెల్లగా

## భానుమతి చతురోక్తులు



భానుమతి అసాధారణమైన కళాకారిణి. పరిపూర్ణమైన నటి. ఆమె ఎంత గంభీరంగా వుంటారో అంతే హాస్యచతురతని కూడా అలవోకగా ప్రదర్శించి ఆశ్చర్యపరుస్తుంటారు. వివిధ సందర్భాల్లో ఆమె పేల్చిన మాటల తూటాలు ఇవీ...

### 'జూమ్' అంటే బస్సా? రైలా?

'గడుసరి అత్త - సొగసరి కోడలు' చిత్రం కట్టా సుబ్బారావు దర్శకత్వంలో నిర్మించారు. అందులో భానుమతిది ప్రధాన పాత్ర. భానుమతిని చూస్తే అందరికీ హడల్. ఆమెకు సన్నివేశాలు వివరించడానికి భయపడుతుండేవారు. ఏదో వర్క్ జరుగుతోంది. కృష్ణ, శ్రీదేవి, భానుమతి అందులో నటించే కాంబినేషన్. సడన్‌గా కట్టా సుబ్బారావు అరిచినంత పనిచేసి "ఏమ్మా! మీ మీదికి ఇప్పుడు 'జూమ్' వస్తోంది, జాగ్రత్త" అన్నారు.

అంతే! భానుమతికి కోపం తారస్థాయికి చేరింది. అయినా తమాయించుకొని "జూమ్ అంటూ గగ్గోలు పెడతారేం? అదేమన్నా బస్సా రైలా? కట్టా...! కట్... కట్... కట్..." అంటూ తనే కెమెరా కట్ చేశారావిడ.

దాంతో ఒక క్షణం విస్తుపోయిన సెట్ ఆ తర్వాత గొల్లుమంది.

అమలు చేయడం మొదలుపెట్టారు.

'వ్యక్తి ఆరాధన' అనేది అన్ని రంగాల్లో పెరిగిపోయింది. అది మానవ సహజ ప్రభావమే అయినా, ఆరాధన ప్రేరణగా మారాలి. దాని నుండి నూతన సృష్టి జరగాలనే అంశం మరుగున పడిపోయింది.

అనుచరులు కావాలిగాని, సహచరులు అవసరం లేదనే ధోరణి ప్రబలింది.

అంతేగాక ఎవరి అవసరాలకు వారు 'ప్రతిభ'ను కొలమానంగా తీసుకోకుండా 'మీడియోకర్స్'ని ప్రమోట్ చేయటం మొదలుపెట్టారు.

## కొత్తగాలి...

**జంతువులు జ్ఞానం లేక**
**గుడ్డలేసుకోవు**
**జనాలు జ్ఞానం ఉండీ**
**సరిగ్గా వేసుకోరు**

– పెన్మెత్స సూరిబాబు,
హైదరాబాద్

వీటన్నింటి వల్ల సమాజం ముందు ముందు ఎవరి చేతుల్లోకి వెళ్లనుందనేది వారికి పట్టలేదు.

ఒక్కో దశాబ్దం కొన్ని పరిణామాలను ముందుకు తీసుకువస్తుంది. అవి మొదట్లో ఎంతోకొంత మంచి ప్రభావాన్ని చూపించి, అక్కడ నుండి వికృతంగా మారిపోతుంటాయి. అలాంటి వాటినుండి అందరూ అంత త్వరగా బయటపడలేరు. జయంత్‌ని ఇంటర్‌లో చేర్పించాలనుకున్నప్పుడు అనంత- తిలక్‌లు సైన్స్ గ్రూపులు తీసుకుంటే బాగుంటుందనుకోలేదు.

జయంత్‌ని ఏ బ్యాంక్ ఎంప్లాయిగానో, లెక్చరర్‌గానో చూసుకోవాలి అనుకున్నారు.

తర్వాతి కాలంలో అతని అభిరుచి, కృషిని బట్టి ముందుకు వెళ్తాడని అనుకున్నారు.

ఏదైనా ప్రభుత్వ ఉద్యోగం వచ్చి, నెలకు ఇంత జీతం వస్తే దాంతో కాలం గడుపుతూ వ్యక్తిగత అభిరుచులు పెంచుకుంటూ ఓ ప్రశాంత జీవితం గడపాలనుకుని, పిల్లలకు సైతం నాణ్యమైన విద్యను అందిస్తే చాలనుకున్నారు.

అందుకే జయంత్‌ని ఓ డాక్టర్‌గా, ఇంజనీర్‌గా చూసుకోవాలనే ఆలోచన రాలేదు. జయంత్‌కి అలాంటి ఆలోచన ఉంటే వారు ఏ నిర్ణయానికి వచ్చేవారో తెలియదు.

అనంత- తిలక్‌ల కుటుంబ నేపథ్యాలు కూడా అలాంటివే. సాధ్యమైనంతవరకు ఎవరితోనూ ఎలాంటి గొడవలు పడకుండా అందరితో మంచిగా ఉండటానికి ప్రయత్నం చేయటంతోపాటు తమవల్ల ఇతరులకు ఎలాంటి కీడు జరగకూడదు అనుకుంటారు.

తిలక్ ఉద్యోగ జీవితంలోనూ వివాదరహితంగా పనిచేస్తాడు. అతను లంచాల జోలికిపోడు. తోటివారి గురించి పట్టించుకోడు. వారు ఉంటున్నది కూడా అద్దెఇల్లు.

వారి గ్రామంలో పాతకాలపు ఇల్లుంది.

రెండెకరాల భూమి ఉంది.

తిలక్ అమ్మా- నాన్నలు అక్కడే ఉంటున్నారు.

వేసవి సెలవుల్లో మాత్రం అక్కడికి వెళ్తుంటారు.

ఎప్పటికయినా పల్లెటూర్లో ఉద్యోగానంతర జీవితం గడపాలని అనంత- తిలక్‌లు కోరుకుంటున్నారు.

అలాంటిది జయంత్‌లో కనిపిస్తున్న మార్పులు అనంతని ఆలోచనల్లో పడేస్తున్నాయి.

ఇప్పటివరకు అనంత జయంత్‌కి ట్యూషన్ పెట్టించలేదు. తాను తెలుగు, మిగతా సబ్జెక్ట్స్ చెబుతుండేది. ఆంగ్లం

విషయంలో తిలక్ ఉన్నాడు. అతని డ్రాఫ్టింగ్ అద్భుతంగా ఉంటుందంటారు ఆఫీసులో.

తిలక్ ఆంగ్ల సాహిత్యం బాగా చదివాడు.

షెల్లీ, కీట్స్ నుండి గతకాలపు గొప్ప గొప్ప కవులూ, నాటక రచయితలు ముఖ్యంగా షేక్‌స్పియర్. మొపాసా, టాల్‌స్టాయ్‌లాంటి రచయితల పుస్తకాలూ చదివాడు.

అదెలాంటి పుస్తకమైనా, సంగీతమైనా వ్యక్తిగత ఆనందానికి, సంస్కారానికి ఉపయోగపడాలి అని మాత్రం అనుకుంటారు.

జీవితం ఎప్పుడూ అలా ఉండదు. ఇంటి ప్రభావం కంటే బయటి ప్రపంచపు ప్రభావాలు బలీయంగా ఉంటాయి అని అనంతకి ఇప్పుడు అర్థం అవుతోంది.

అనంత పెళ్లి అయ్యాక గ్రాడ్యుయేషన్ పూర్తిచేసింది.

ఉద్యోగం విషయంలో ఆమెకు కొన్ని నిశ్చితమైన అభిప్రాయాలున్నాయి. "నేను కుటుంబానికి పరిమితం అవుతాను. మనకు వస్తున్న ఆదాయం మనకు సరిపోతుంది. అలా సరిపోనప్పుడు ఆలోచిస్తాను. ముఖ్యంగా పిల్లల్ని తీర్చిదిద్దుకోవాలి. ఇద్దరూ ఉద్యోగాలు చేస్తుంటే పిల్లలు చాలా కోల్పోతారు" అంది తిలక్‌తో.

"నీ ఇష్టం అనంతా! నువ్వు ఏం చేసినా నాకు సంతోషమే" అన్నాడు.

వాళ్లు ఇద్దరు ముగ్గురు పిల్లల్ని కావాలనుకున్నారు. అయితే అది సాధ్యంకాలేదు. దాని గురించి కూడా వారు చింతించలేదు.

'ముందుముందు అవసరాలు పెరుగుతాయి. ఖర్చులు పెరుగుతాయి' అనే వాదనలు వచ్చినప్పుడు కూడా ప్రశాంతంగానే చెప్పేది.

"మీరు మాట్లాడేది మానసిక అవసరాల గురించా? భౌతిక అవసరాల గురించా?" అనగానే ఎదుటివారు కొద్ది క్షణాలు మాట్లాడలేక పోయేవారు.

"నేనూ ఒకప్పుడు బాల్యం-కౌమారం దశలు దాటి వచ్చినదాన్నే. అప్పటికి ఇప్పటికి వస్తువులు పెరుగుతున్నాయి. వాటి మీద మోజు పెంచుకుంటూపోతే అంతు ఉండదు. వేసవికాలంలో మట్టికుండలోని నీళ్లకంటే ఫ్రిజ్‌లో నీళ్లు దాహం తీర్చవు. రేపట్నుంచి ఇలాంటి వస్తువులు గుట్టలు గుట్టలుగా వచ్చి పడుతుంటాయి. మనం బతికేది అవన్నీ కొనుక్కొని చూసి మురిసిపోవటానికి కాదు. మనం ఇతరుల్తో పోల్చుకోనంత కాలం సుఖంగా బతుకుతాం" అనేది.

బట్టల విషయమూ అంతే.

ఆమెకు పదులకొద్దీ చీరలు కొనటం ఇష్టం ఉండేది కాదు. ఇంట్లోకి అడుగుపెడితే అదో కుటీరంలా ఉంటుంది. తప్ప సరుకుల గోదాంలా ఉండదు.

మనం అనుభవించటానికి అవకాశం లేని, తీరికలేని వస్తువులు ఇంటిలో చేరి మనల్ని వెక్కిరించకూడదు.

'ముందు మనం మనకోసం బతకటం అలవాటు చేసుకుందాం. ఆ తర్వాత ప్రపంచం సంగతి' అనేది.

అలా అని ఎవరితోనూ వాదనలు పెట్టుకునేది కాదు.

అనంతను కదిలించి, 'మీరు ఒక్క అబ్బాయి అయినా పిసినారిగా బతుకుతున్నారు' అనే అర్థంలో మాట్లాడేవారికీ సమాధానం చెబుతుంది.

ఓ సారి మాత్రం సూటిగా అడిగింది.

"మీరు పది రూపాయలు పెట్టి ఓ పుస్తకం ఎప్పుడన్నా కొన్నారా?"

ఆమె ఆశ్చర్యంగా చూసింది.

"రెండువందలు పెట్టి చీరకొంటారు. పుస్తకం కొనాల్సివస్తే ఎందుకంత బాధప

డిపోతారు? "

"పుస్తకాలు కూడు పెడతాయా? " అందామె ముఖం చిట్లించి.

"చీరలు కూడు పెడతాయా? కార్లు కూడు పెడతాయా? అవన్నీ మన అవస రాల్ని తగ్గిస్తాయి. మన నోటి దగ్గర కూడు లాక్కుంటాయి" అంది అనంత.

"మీకు అవసరం లేవని అందరికీ అవ సరం ఉండవా? అవి కలిగించే ఆనందం గురించి మీకు తెలిస్తే ఇలా మాట్లాడరు"

"అలాంటప్పుడు పుస్తకాలు మీకు కూడు పెడతాయా అనకూడదు. ఆనందం కలిగి స్తాయా? అలా కదా అడగాలి"

ఆమె బిత్తరపోయింది.

"మీరు ఎందుకింత ఖరీదుగా బతుకుతు న్నారు అని నేను అడగలేదు. మా మీద జాలిపడొద్దు అని చెబుతున్నాను. మా పరి ధిలో మేం ఆనందంగా బతుకుతున్నాం"

"ఎప్పటికీ ఇలానే ఉండగలవా అనంతా? "

"ఉండటానికి ప్రయత్నం చేస్తాను"

"అది అసాధ్యం. రేపు నీ కోడలు వచ్చాక అప్పుడు తెలుసుకుంటావు. వాళ్లు ఇలాంటి సమాధానాలు ఇష్టపడరు" అని వెళ్లిపోయిందావిడ.

అనంతకి అవన్నీ గుర్తొస్తున్నాయి.

'కోడలు వచ్చాక' అనే మాటలు మరీ మరీ గుర్తొస్తున్నాయి. చూస్తుండగానే జయంత్ పదహారు సంవత్సరాల యువకు డయ్యాడు నూనుగు మీసాలు వస్తు న్నాయి. తిలక్ ఇరవై రెండు సంవత్సరా లకి పెళ్లి చేసుకున్నాడు. అలా చూస్తే ఇంకో ఆరు సంవత్సరాలకి జయంత్ పెళ్లి చేయాలి. జయంత్ అలాంటి అవకాశం ఇస్తాడా? ! ఆమె పెదవుల మీద చిరునవ్వు వెలిసింది.

★ ★ ★

జయంత్ కాలేజ్ అయిపోగానే మొదటి సారి గ్రౌండ్‌లో పరిగెత్తటం మొదలు పెట్టాడు. అంతకు ముందు వంద మీటర్ల రన్నింగ్ రేస్‌లు నిర్వహించేవారు.

ఫుట్‌బాల్-టెన్నిస్ కోర్టు కూడా అదే.

ఇంకా అక్కడ ఇనుప పోల్స్ ఉన్నాయి. వాటి మీద బస్కీలు తీస్తుంటారు. పోల్ జంప్ చేయటానికి కొంతమంది ప్రాక్టీస్ చేస్తున్నారు.

జయంత్‌ని అలా చూడటం కొంత మంది మిత్రులకి ఆశ్చర్యం కలిగించింది.

ఇంతకు ముందు ఎప్పుడెప్పుడు ఇంటికి వెళ్లిపోదామా? అన్నట్లు ఉండేవాడు.

రెండు రౌండ్లు తిరిగేసరికి విపరీతంగా చెమటలు పట్టాయి. గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి.

కొంచెంసేపు అలసట తీర్చుకున్నాడు. తర్వాత పోల్స్ దగ్గరకు వెళ్లి బస్కీలు తీయటానికి ప్రయత్నం చేసాడు. రెండు భుజాలమీద మొత్తం తన బరువుని బ్యాలన్స్ చేయటం కష్టం అనిపించింది. అలాగే మోకాళ్ల మీద తలకిందులుగా వేలాడటం మరింత కష్టం అనిపించింది.

అప్పుడు మధు గుర్తొచ్చాడు. అతను ఇలాంటివి అత్యంత సునాయాసంగా చేస్తాడు. అందుకే అతనికి తనమీద అంత నమ్మకం వచ్చి ఉంటుంది. మనసు మీదే కాదు - దేహం మీద కూడా నియంత్రణ ఉండాలి అనుకున్నాడు.

ఇప్పటి వరకు ఇంటి నుండి కాలేజ్‌కి నడిచి వస్తున్నాడు. కొంతమంది సైకిళ్ల మీద వస్తున్నారు. ఒక్క మదన్ మాత్రం బైక్ మీద వస్తుంటాడు.

జయంత్ ఇల్లు కాలేజ్‌కి ఒకటిన్నర కిలోమీటర్ల దూరం ఉంటుంది. అంతకు ముందు సైకిల్ నేర్చుకోవాలనుకున్నాడు. తన దగ్గర సైకిల్ లేదు. ఊర్లో సైకిల్‌ని అద్దెకిస్తారు.

'శ్రీను' అనే మిత్రుడు సైకిల్ తొక్క

తుంటాడు. అది పాత సైకిల్.

'నేనూ నేర్చుకుంటాను' అని అడిగాడు.

"మీ నాన్నని అడిగి సైకిల్ కొనిపించుకో" అన్నాడు శ్రీను. జయంత్ అప్పుడు ఏడో తరగతి చదువుతున్నాడు.

"ముందు సైకిల్ తొక్కటం వచ్చాక కొనిపించుకుంటాను" అన్నాడు జయంత్.

"అయితే రా. నేను రెండు రోజుల్లో నీకు సైకిల్ నేర్పిస్తాను. తర్వాత అద్దె సైకిల్ మీద ఓ పది రోజులు ప్రాక్టీస్ చేస్తే అదే వస్తుంది" అన్నాడు.

మొదటిరోజు శ్రీను సైకిల్ పట్టుకుని ఎలా తొక్కాలో చూపించాడు. అరగంట వరకు నేర్చుకున్నాడు. అయితే శ్రీను మాత్రం సైకిల్‌ని వదిలి పెట్టలేదు.

రెండోరోజు సైకిల్ జయంత్‌కి ఇచ్చాడు. కొద్దిదూరం వెళ్లగానే బ్యాలన్స్ కుదరక సైకిల్ కిందపడేసి తనూ పడిపోయాడు. శ్రీను పరిగెత్తుకుంటూ వచ్చాడు. హ్యాండిల్ వంకర తిరిగిపోయింది.

"సారీ శ్రీను" అంటున్నాడు.

"ఏం ఫర్వాలేదు" అని సైకిల్‌ని లేపి, దాని ముందు నిలబడి హ్యాండిల్ సరి చేస్తుంటే ఆశ్చర్యంగా చూస్తున్నవాడల్లా మోకాలి దగ్గర కలుక్కుమంటే చూసాడు రక్తం కారుతోంది.

జయంత్‌కి రక్తం చూసుకునేసరికి భయం కలిగింది.

శీను సైకిల్‌కి స్టాండ్ వేసి వచ్చాడు.

"కొత్తలో ఇలాంటివి మామూలే. కంగారుపడకు" అని పక్కనున్న మట్టి తీసి మోకాళ్ల మీద చల్లాడు. చురుక్కున మండేసరికి బాధతో అరిచాడు 'అమ్మా' అని.

"ఈ మాత్రం దానికే అంత అరుస్తావేంటిరా? నాకు మొదట్లో కింద పడినప్పుడు ఎముక చిట్లింది. అయినా నేను ఆరు నెలల తర్వాత మళ్లీ మొదలు పెట్టా. ఇప్పుడు నాకు సీట్‌మీద కూర్చుని తొక్కటం వచ్చింది" అన్నాడు.

## భరణి - ధరణి

తీరిక సమయాల్లో గార్డెన్స్‌లో కూర్చుని సంగీత సాహితీప్రియులతో భానుమతి ముచ్చట్లాడుతుండేవారు. ఒకసారి లింగమూర్తిగారు మాట్లాడుతూ 'మీ వారసత్వం అబ్బాయికొచ్చింది కాదు. ఎక్కడుంది లోపం? ' అన్నాడు. లింగమూర్తికి జ్యోతిష్యం తెలుసు. ఏదైనా మంచి సూచన చెయ్యాలని ఆయన ఉబలాటం.



'ఏం చేద్దామంటారూ? '

'పేరు మార్చి చూస్తే ఎలా వుంటుంది? '

'పరమ ఛండాలంగా ఉంటుంది. బాబుకేం? భరణి నక్షత్రం... ధరణి ఏలుతాడు...' అన్నారావిడ. దాంతో లింగమూర్తి నోటికి తాళం పడింది. నిజంగానే భరణి కొన్ని వందల కోట్ల విలువ చేసే 'భరణి గార్డెన్స్' కి హక్కుదారుడయ్యాడు.

"నేను ఇంటికి వెళ్తాను" అన్నాడు జయంత్.

"రక్తం గడ్డకట్టడానికి దుమ్ము చల్లాను. ఇంటి దగ్గర టించర్ రాసుకో" అన్నాడు.

జయంత్ కుంటుతూ ఇంటికి వెళ్లాడు.

అనంతని చూడగానే కళ్ల వెంట నీళ్లు వచ్చాయి.

"ఏమైంది జయా. ఏ బండయినా గుద్దేసిందా? " అంది కంగారుగా.

"నేను సైకిల్ నేర్చుకుంటూ పడిపోయాను" అన్నాడు.

ఓ క్షణం జయంత్ కళ్లలోకి చూసి

తర్వాత కాలుకేసి చూసింది.

"ఇలా మట్టి చల్లమని నీకు ఎవరు చెప్పారు. ఒక్కోసారి సెప్టిక్ అవుతుంది" అని తీసుకెళ్ళి శుభ్రం చేసి దూది మీద టించర్ వేసి అద్దింది.

మళ్ళీ బాధగా అరిచాడు.

"ఓర్చుకో, ఎందుకయినా మంచిది హాస్పిటల్‌కి వెళ్దాం. టి.టి. ఇంజక్షన్ చేయిద్దాం" అంది.

"వద్దమ్మా. నాకు భయం" అన్నాడు.

"సైకిల్ నేర్చుకోవటానికి భయం అనిపించలేదా? " అంది

జయంత్ మాట్లాడలేకపోయాడు.

అనంత హాస్పిటల్‌కి తీసుకెళ్ళి ఇంజక్షన్ చేయించి, కాలుకి కట్టు కట్టించింది.

మోకాలి మీద తగలడంతో నాలుగు రోజులు ఇబ్బంది పడ్డాడు.

శీను బడిలో అడిగాడు.

"సైకిల్ ఎప్పుడు నేర్చుకుంటున్నావు? "

"నేను నేర్చుకోవాలనుకోవటం లేదు" అన్నాడు.

శీను వింతగా చూసాడు.

వాడు ఇప్పుడు ఊళ్లో వ్యవసాయం చేస్తున్నాడు. తాటిచెట్లు, కొబ్బరి చెట్లు, ఎక్కటంలో, వాటి గెలలు తెంపటంలో నిష్ణాతుడు.

అనంత కూడా తర్వాత జయంత్‌ని సైకిల్ విషయం కదపలేదు. ఏదయినా తననుండి రావాలని ఆమె కోరుకుంటుంది.

అది గుర్తొచ్చింది జయంత్‌కి.

అప్పటికే చీకట్లు పడుతున్నాయి.

దారి పొడుగునా ఆరావళి గుర్తొస్తోంది.

తను అలా పరిగెడుతున్నప్పుడు ఆరావళి చూస్తే బాగుండేది కదా అని అనిపిస్తోంది.

అమ్మ చెప్పినట్లు ప్రేమను పొందటానికి సాధనాలు తయారు చేసుకుంటున్నాడు. మధు, మదన్, సూర్యలోని లక్షణాలు అన్నీ తను నింపుకోవాలి.

సూర్య లక్షణాలు కూడానా?

సూర్య ఆరావళికి నచ్చుకుంటే రెండు రోజులు కాలేజ్‌కి రావటం ఎందుకు మానేస్తుంది.

ఇది కూడా తప్పు అయి ఉంటుంది.

ఇప్పటి వరకు మదన్‌ను, మధును ఆరావళి ప్రేమిస్తున్నట్లు కనీసం ఇష్టపడుతున్నట్లు దాఖలాలు లేవు.

ఏమయినా ఓ అమ్మాయికి నచ్చాలంటే 'కంప్లీట్ మాన్' అయి ఉండాలి అనుకున్నాడు.

ఇంటికి వచ్చేసరికి అనంత ఎదురు చూస్తోంది.

"ఏంటి జయా! ఇంత ఆలస్యం అయింది? "

"ఈ రోజు నుంచి రన్నింగ్ మొదలుపెట్టాను. వ్యాయామం చేస్తున్నాను" అన్నాడు.

అనంత ఆశ్చర్యంగా చూస్తోంది.

"ఇప్పుడు అలా చేయాలనే ఆలోచన ఎందుకు వచ్చింది? " అంది మెల్లగా.

"ఫిజికల్ ఫిట్‌నెస్ కూడా అవసరం కదమ్మా? "

"ఇది కూడా సైకిల్ నేర్చుకున్నట్టు చేస్తావా? రేపటి నుంచి మానేస్తావా? "

"అవును సైకిలంటే గుర్తొచ్చింది. నాన్న సైకిల్‌ని నాకు ఇచ్చి, నాన్నను స్కూటర్ కొనుక్కోమనవా? " అన్నాడు.

అనంత ఉలిక్కిపడి చూసింది.

"ఏంటమ్మా అలా చూస్తావు? "

"కావాలంటే నువ్వు సైకిల్ కొనుక్కో. అందుకు నాన్న స్కూటర్ కొనటం ఎందుకు? "

"అదేంటమ్మా నాన్నకి ప్రమోషన్ వచ్చింది. ఇంకా ఆ పాత సైకిల్ మీద వెళ్లటం ఏం బాగుంటుంది? నాన్నకంటే

చిన్న చిన్న ఉద్యోగులు మోపెడ్లు, స్కూటర్లూ కొంటున్నారు"

"ఇతరులు కొంటున్నారని మనం కొనాలా? "

"డబ్బులు లేకపోతే వద్దమ్మా, డబ్బులున్నప్పుడు ఆ మాత్రం కంఫర్ట్స్ ఉండటంలో తప్పు లేదు కదమ్మా" అన్నాడు.

అనంత చిన్నగా తలూపింది.

జయంత్ స్నానం చేయటానికి వెళ్లాడు.

అనంత జయంత్‌ని చూస్తుండిపోయింది.

★ ★ ★

తిలక్ ఏదో పుస్తకం చదువుతున్నాడు.

అప్పుడు అనంత మరచెంబులో మంచి నీళ్లు తీసుకుని వచ్చింది.

"జయంత్ మిమ్మల్ని స్కూటర్ కొనుక్కోమంటున్నాడు" అంది.

తిలక్ అర్థం కానట్లు చూసాడు.

"మీకు ప్రమోషన్ వచ్చింది కాబట్టి ఆ మాత్రం సౌకర్యం కావాలంట. మీ సైకిల్‌ని తనకు ఇవ్వమంటున్నాడు"

"పాత సైకిల్ ఎందుకు? కావాలంటే కొత్త సైకిల్ కొనుక్కోమను. అంతగా అయితే నేను నడిచి వెళ్తాను. నేను నడిచి వచ్చాను అంటే ఎవరూ ఏమీ అనరు. ఇదేం మహానగరం కాదు"

"జయ మిమ్మల్ని కంఫర్ట్స్‌తో బతకమంటుంటే మీరు నడిచి వెళ్తాను అంటారేంటి? స్కూటర్ తీసుకొండి"

"వాడు స్కూటర్ నాకు కావాలంటున్నాడా? వాడికి కావాలంటున్నాడా? " అన్నాడు తిలక్.

ఈసారి ఆశ్చర్యపోవటం అనంత వంతయింది. ఆమెకు ఇలాంటి ఆలోచన రాలేదు.

"మీకు కనీసం స్కూటర్ నేర్చుకోవాలనిపించలేదా? "

"అనిపించేదేమో నువ్వు ఎప్పుడన్నా స్కూటర్ మీద నన్ను సినిమాకి తీసుకెళ్లు అంటే"

అనంత చిన్నగా నవ్వింది.

"మనం జయంత్‌ని 'ఆర్ట్స్' గ్రూప్ తీసుకొమ్మని తప్పు చేసామా? "

"అలా ఎందుకనుకుంటున్నారు? "

"అది పెద్దగా కష్టపడాల్సిన గ్రూప్ కాదు. జయంత్ తెలివిగలవాడు బై.పి.సి. గ్రూపు తీసుకుంటే ఇలా ఆలోచించటానికి సమయం ఉండేది కాదేమో? "

"వాడికి బొద్దింకల్ని, కప్పల్ని కోయాలంటే భయం. ఇంజెక్షన్ చేయించుకోవటానికి ఇప్పటికీ చిన్న పిల్లాడిలా భయపడతాడు" అంది.

> **కొత్తగాలి...**
>
> **మితిమీరిన వేగం**
> **కడపటి గమ్యాన్ని**
> **దగ్గర చేస్తుంది**
>
> – ప్రతాప వెంకట సుబ్బారాయుడు,
> సికింద్రాబాద్

"అందులో కూడా చాలా విభాగాలున్నాయనుకో" అన్నాడు.

"ఈ మధ్యకాలంలో జయలో చాలా మార్పులు కనిపిస్తున్నాయి. ఈ రోజు వ్యాయామం మొదలు పెట్టాడు. ఫిజికల్ ఫిట్‌నెస్ కావాలన్నాడు. ఇంతకు ముందు ఆడపిల్లలకి టాయ్‌లెట్స్ లేవని సూర్య అనే అబ్బాయితో కలిసి ప్రిన్సిపాల్‌ని కలిసాడు. ఇవేవి చెడ్డ పనులు కాదు. కాబట్టి ఇంకా నేను గట్టిగా ఏమీ అనలేకపోతున్నాను" అంది అనంత

"అనంతా! ఈ ఊర్లో ఇప్పటికీ గోడల

మీద కొన్ని సంవత్సరాల క్రితం రాసిన నినాదాలు కనిపిస్తుంటాయి. నేను వాడి వయసులో ఉండగా ఆర్.ఎస్.ఎస్.వాళ్లు మాతో డ్రిల్ చేయించేవారు. ఆటలు ఆడించేవారు. మేం ఉత్సాహంగా పాల్గొనే వాళ్లం. ఆ తర్వాత మాకు భారతదేశపు గొప్పతనం గురించి చెప్పేవాళ్లు. నా ఫ్రెండ్స్ కొందరు ఇప్పుడు ఆ సంస్థలో పని చేస్తున్నారు. ఒకతనయితే పెళ్లి చేసుకో లేదు. పూర్తిగా సంస్థకే అంకితం అయిపో యాడు"

అనంత తలూపి వింటోంది.

"యూనివర్సిటీల్లో దారుణంగా ఉం టోంది. అక్కడ యూనియన్ ఎన్నికలూ-రాజకీయాలూ కలగా పులగం అయిపో యాయి. ఈ ఊర్లో కాస్తనయం అను కుంటే ఇక్కడ కూడా మళ్లీ రాజకీయాలు మొదలయ్యేలా కనిపిస్తున్నాయి. ఇది లెక్చ రర్లపనా? రాజకీయ పార్టీల పనా? " అన్నాడు.

"అది నాకెలా తెలుస్తుంది" అంది అనంత.

తిలక్ ఆలోచనలో పడ్డాడు. కొడుకు భ విష్యత్ ఎటు దారి తీస్తుందో? అనే సంశయం అతనిలో మొదలయింది.

"ఓ రకంగా ఆలోచిస్తే మీరు చెప్పిన రాజకీయాలయితే మిమ్మల్ని స్కూటర్ కొనమని అనడు. వాడికి అలా అనిపించ టానికి ఇంకేదో కారణం ఉండివుంటుంది"

"అంటే సింపుల్ లివింగ్ అనేది జయకు నచ్చటం లేదా"?

"గాంధీగారి పేరు చెప్పుకునే వారినుండి వామపక్షాల వారినుండి, మీరు చెబుతున్న దేశభక్తుల దాకా చాలామంది సింపుల్ లివింగ్ అనే దాన్ని మరిచిపోతున్నారు. ఆ సంస్థల్లో వేళ్లమీద లెక్కపెట్ట దగినంత మంది మాత్రమే సిన్సియర్‌గా ఉన్నారు" అంది అనంత.

తిలక్ తలూపాడు.

"ఈ మధ్య సూర్య మన జయకి ఇచ్చిన పుస్తకాలు చూసాను. అందులోనూ నాకు సింప్లిసిటీ కనిపించలేదు. ఖరీదయిన అరాచకత్వం ఉంది. అందులో ఎంత వాస్తవం ఉందో ఏమిటో నాకు అర్థం కాలేదు"

"అరాచకత్వం కూడ ఖరీదంటావా? "

"నేను అనుకుంటున్నాను. ఓ విష యాన్ని రీసెర్చ్ చేయటానికి స్ట్రగుల్ అవ్వాలి. అది వివరించటానికి కాదు. క్రియేటివ్ మైండ్స్ కూడా జనాన్ని హింస పెట్టటంలో అర్థం ఏముంది? సింప్లిసిటీ, స్పష్టత జీవితంలో ఉంటే ఆర్ట్‌లో వస్తుంది. సాహిత్యంలో వస్తుంది. గతకా లపు ఆర్ట్ ఫామ్స్‌లో ఇంత అరాచకత్వం లేదు"

"ఆ ఛాయలున్నాయి. అనంతా! ముందు మనం తేల్చుకోవాల్సింది ఒకటే. మనం మన అభిప్రాయాలు మార్చుకో వాలా వద్దా అనేది ఒకటి. ఇవన్నీ టీనేజ్ టెంప్టేషన్స్ - ఇవి సహజం అనుకుంటే కొన్ని రోజులు వేచి ఉందాం. జయ మరీ దారి తప్పుతున్నాడనుకుంటే అప్పుడు మనం గైడ్ చేద్దాం"

"వాడు వినకపోతే? "

"మనం వాడ్ని కన్నాం. వాడి ఫేట్‌ని కాదు"

అనంత మాట్లాడలేదు.

సరళత్వం అనేది ఇలాంటి అనుభవా లను ఇస్తుందని పూర్తిగా అనంత కూడా ఊహించలేదు.

"జయంత్‌ని డైవర్ట్ చేయటానికి ఇంకే దన్నా మార్గం ఉందా? "

"అంటే? "

"చదువుతో పాటు ఇంకేదన్నా పని? "

"అలాంటి వాటిలోనే ఉన్నాడు"

"మ్యూజిక్ ఇంపాక్ట్స్ ది బ్రెయిన్ నెట్

వర్క్ అంటారు కదా? "

"అదేదో వాడి నుంచి రానివ్వండి. మనం ఎందుకు చెప్పాలి. గతంలో ఓసారి సైకిల్ నేర్చుకునే రోజు గాయం అయింది. ఆ తర్వాత దాని జోలికి పోలేదు. అనుభవమే ఎవర్నయినా మారుస్తుంది. నేను ఒకటే అనుకుంటున్నాను"

ఏమిటన్నట్లు చూసాడు.

"సిన్సియారిటీ. వాడు ఏం చేసినా సిన్సియర్‌గా చేయాలి. నమ్మింది చేయాలి. అందులో షార్ట్‌కట్స్ ఉండకూడదు. నిజంగా వాడు అడవుల్లోకి వెళ్లినా- జయంత్‌ని పోలీసులు కాల్చేసినా నేను బాధపడను. అయితే ఆ నిర్ణయం ఆవేశంతో జరగకూడదు. లెట్ హిమ్ థింక్ అండ్ డిసైడ్" అంది ఉద్వేగంగా.

"నువ్వు గుండెలోతుల నుండి ఆ మాట అంటున్నావా అనంతా"

"కాదని ఎందుకు అనుకుంటున్నారు? "

"జయంత్ మనకి ఒక్కగానొక్క కొడుకు"

"మీరే అన్నారు. వాడ్ని కన్నాంగాని వాడి 'ఫేట్'ని కాదని. నేను వాడి మార్గాన్ని అంటున్నాను"

తిలక్ మౌనంగా ఉండిపోయాడు.

★ ★ ★

మదన్ బైక్ మీద వస్తున్నాడు.

అప్పుడు మధు ఎదురుగా నిలబడున్నాడు. రోడ్డుకి అడ్డంగా అతని పక్క నుంచి వెళ్లవచ్చు. అది తనకు అవమానం అనుకున్నాడు. మధు ముందు సడన్ బ్రేక్ వేసాడు.

అలా బండి మీద నుండి దిగకుండా చూస్తూ అన్నాడు.

"రోడ్డు నీ స్వంతం కాదు మధూ"

"బైక్ దిగి మాట్లాడు"

మధుకేసి చూసి స్టయిల్‌గా దిగి స్టాండ్ వేసి దగ్గరకొచ్చాడు

"ఏంటో చెప్పు"

"ఆరావళి గురించి మరిచిపో. నీ ఆరోగ్యానికి అది మంచిది"

"మధూ నీకు సభ్యత లేదు. అందులో ఆశ్చర్యం ఏమీ లేదు. నీ బ్యాక్‌గ్రౌండ్ అలాంటిది. ఏదైనా మాట్లాడాలనుకుంటే నువ్వు నాతో మాట్లాడాలి. జయంత్ దగ్గర నీ కండల ప్రదర్శన ఎందుకు? "

"అందుకేగా రోడ్డు మధ్యలో ఆపి మాట్లాడుతున్నాను"

"ఆరావళి గురించి నువ్వు మాట్లాడకూడదు. మేం కలిసి చదువుకుంటున్నాం. రోజూ క్లాస్ రూమ్‌లో చూస్తుంటాను"

"అటు చూడొద్దనే చెబుతున్నాను? "

"నువ్వెవరివి చెప్పటానికి? ఆరా బ్రదర్వా? "

"రేయ్! పిచ్చిపిచ్చి సమాధానాలు చెప్పొద్దు"

"మధూ! బెదిరించటానికి నేను జయంత్‌లాంటివాడ్ని కాదు. నువ్వు ఆరావళిని పెళ్లి చేసుకున్నావా? నేను ఆ అమ్మాయిని అల్లరి చేసానా? ఎందుకంత భయపడుతున్నావు? నీ ప్రయత్నం నువ్వు చేసుకో. నేను కాదనటం లేదుగా"

అప్పుడు కొట్టాడు మధు.

మదన్ చెంపమీద. చేత్తో రాసుకుంటూ చూస్తున్నాడు.

"ఇది మొదటి వార్నింగ్. ఈసారి ఆరావళి చూస్తుండగా నిన్ను కొడతా. అప్పుడు తల ఎక్కడ పెట్టుకుంటావో చూస్తా"

"నీ జీవితంలో చాలా పెద్ద తప్పు చేసావు మధూ" అని బైక్ స్టార్ట్ చేసుకుని వెళ్లిపోయాడు మదన్.

సరాసరి ఇంటికి వెళ్లాడు.

వాళ్ల నాన్న రామచంద్ర ఇంట్లో ఉన్నాడు. జరిగింది చెప్పాడు.

"అలాంటి 'రోగ్'తో ఎందుకు పెట్టుకున్నావు" అన్నాడాయన చిరాగ్గా.

"నాన్నా! వాడు నన్ను కొట్టాడు. నేను

దెబ్బ తిన్నాను. ఈ విషయం నువ్వు చూసుకుంటావా? నన్ను చూసుకొమ్మం టావా? "

"ఇంతకూ ఆరావళి ఎవరమ్మాయి? ఆయనేం చేస్తుంటారు? "

"తెలియదు"

"ఏమీ తెలియని అమ్మాయికోసం తగా దానా? ఎప్పుడన్నా ఆ అమ్మాయితో మాట్లాడావా? "

"లేదు నాన్నా"

"పోనీ ఆ మధు గురించి చెప్పు.. వాడి ఫాదర్ ఏం చేస్తాడు? "

"తెలియదు"

"పోనీ నీ గురించి వాడికి తెలుసా? "

"వాడికేం తెలుసో నాకు తెలియదు నాన్నా. ఇకముందు తెలియాలి. మధు గాడు నాకు సీనియర్. వాడికి అమ్మా-నాన్నా ఉన్నారో లేదో తెలియదు. ఒక్క మాటలో వాడు లోఫర్"

"సరే. ఈ విషయం నేను చూసుకు టాను" అన్నాడు రామచంద్ర.

"ఈసారి నన్ను ఆరావళి ముందు కొడ తాను అన్నాడు. నన్ను కాలేజ్‌కి వెళ్లమం టావా? వద్దా? "

"వాడికి భయపడి కాలేజ్ మానుకుం టావా? వెళ్లు" అన్నాడు రామచంద్ర తాపీగా.

★ ★ ★

జయంత్ కాలేజ్ గ్రౌండ్‌లో సైకిల్ తొక్కుతున్నాడు. అతని వెనకాల ఓ మిత్రు డున్నాడు. తను సహాయపడుతున్నాడు. మొదట రెండుసార్లు సైకిల్ పడవేసి పక్కకు దూకాడు. అతను సైకిల్‌ని సరి చేసి మళ్లీ కూర్చోబెట్టాడు.

"జయా- సైకిల్‌ను బ్యాలన్స్ చేయటం ఈజీనే. చిన్నప్పుడు అంత బరువుని మోయలేం. ఇప్పుడది సమస్య కాదు. నువ్వు పెడల్ తొక్కకపోయినా కొంత దూరం ముందుకు వెళ్తుంది" అని సీట్ దగ్గర చెయ్యివేసి కొంతదూరం నెట్టు కుంటూ వెళ్లాడు. జయంత్ పెడల్ మీద కాలేసి తొక్కుతున్నాడు.

అతను అలా ఒదిలాడు సైకిల్ ముందుకు పరుగులు తీస్తోంది. జయం త్‌లో వెర్రి ఆనందం కలిగింది. ఇంకో గంట గడిచిపోయింది. ఇప్పుడు జయంత్ కాలేజ్ గ్రౌండ్ చుట్టూ సైకిల్‌పై తిరుగు తున్నాడు. ఇసుకలో కూడా బ్యాలెన్స్ చేయటం వచ్చింది.

"థాంక్స్ మిత్రమా" అన్నాడు.

★ ★ ★

> **కొత్తగాలి...**
>
> **ఈశాన్యంలో**
> **మంటలు**
> **శివుడు**
> **కన్నుతెరిచాడేమో!**
>
> – కిలపర్తి దాలినాయుడు,
> సాలూరు, విజయనగరం జిల్లా

సాయంకాలం ఏడు గంటలు

మధు ఓ థియేటర్ దగ్గర ఓ ఫ్రెండ్‌తో 'టీ' తాగుతున్నాడు.

అప్పుడు అక్కడికి పోలీస్ జీప్ వచ్చింది. యస్.ఐ. జీపులో కూర్చును న్నాడు. కానిస్టేబుల్ మధు దగ్గరకొచ్చి జీపు ఎక్కమన్నాడు.

"ఎందుకు? " అన్నాడు.

"యస్.ఐ.గారు నీతో మాట్లాడాల న్నారు. రా" అన్నాడు.

మధు తన ఫ్రెండ్‌కేసి చూసాడు. కన్ను గీటి యస్.ఐ. దగ్గరకు వచ్చాడు.

"వెనకాల కూర్చో" అన్నాడు

"ఎందుకు సార్!"

"స్టేషన్‌లో చెబుతా" అన్నాడు

మధు మాట్లాడకుండా జీపు ఎక్కాడు

స్టేషన్ దగ్గరకొచ్చాక మధుని లోపలకు తీసుకువెళ్లారు.

"మదన్‌ని కొట్టావా? " అన్నాడు చెయిర్‌లో కూర్చున్నాక యస్.ఐ.

"సార్ అదీ..."

"అడిగిందానికి సమాధానం చెప్పు"

"కొట్టాను సర్"

"వీడ్ని లాకప్‌లో వేయండి" అన్నాడు.

"సార్" అని ఏదో అనబోతుంటే కానిస్టేబుల్ మెడమీద చేతులు వేసి ముందుకు నెట్టాడు

"ఎందుకు సార్ నెడుతున్నారు? " అన్నాడు సీరియస్‌గా

"కొట్టరా కొడుకుని" అన్నాడు యస్.ఐ. కోపంగా

"ఫట్" మంటూ లాఠీ వీపుమీద పడింది.

మధు యస్.ఐ.ని మింగేసాలా చూసాడు. అప్పుడు యస్.ఐ. లేచాడు

లాకప్ రూమ్‌లోకి తీసుకువెళ్లి...

"ఏంటిరా.. నువ్వు పెద్ద రౌడీవా? ఆడపిల్లల మీద నీకు హక్కుందా? ఎవరూ నువ్వు చూసే అమ్మాయిని చూడకూడదా? చూస్తే కొట్టేస్తావా? నన్నే సీరియస్‌గా చూస్తున్నావు. రౌడీషీట్ ఓపెన్ చేస్తా-కొడకా! ఇప్పుడే నిన్ను కాల్చి పారేస్తా. ఏం చూసుకునిరా నీకు పొగరు" అని ఈడ్చి చెంపమీద కొట్టాడు.

"కుమ్మండి! దెబ్బలు బయటకి కనిపించకూడదు. కొడుక్కి కండలు చూసుకుంటుంటే లోకం కనపడడం లేదు" అన్నాడు.

ఆ తర్వాత బయటకు వచ్చి సిగరెట్ వెలిగించుకున్నాడు

మధుతో కానిస్టేబుల్స్ ఆడుకుంటున్నారు

'మధు' ఫ్రెండ్ పరుగులు తీసుకుంటూ వెళ్లి ఇంట్లో విషయం చెప్పాడు.

అప్పటికి మదన్‌ని కొట్టిన విషయం అతనికీ చెప్పలేదు మధు.

ఎందుకు పోలీసులు తీసుకువెళ్లారో తెలియదు. మామూలుగా దొంగల్ని తీసుకువెళ్లేవారు. గతంలో ఉద్యమాల్లో పనిచేస్తున్న వారిని అరెస్ట్ చేసి తీసుకువెళ్లేవారు. ఈమధ్య కాలంలో ఓ స్టూడెంట్‌ని స్టేషన్‌కు తీసుకురావటం మాత్రం ఇదే.

మధు వర్గంవాళ్లు వచ్చారు.

యస్.ఐ.తో బేరసారాలు మొదలుపెట్టారు.

అప్పుడుగాని వారికి అసలు విషయం తెలియలేదు

"మీరు ఏం మాట్లాడాలన్నా రామచంద్ర గారితో మాట్లాడండి. రేపు ఉదయం ఎఫ్.ఐ.ఆర్. బుక్ చేస్తున్నాను" అని చెప్పాడు

అప్పటికి రాత్రి పది గంటలయింది.

ఎవరో బిర్యానీ కట్టించుకుని వచ్చారు

"వాడికి ఎండిపోయిన చపాతీలు చాలు. ఇలాంటివి మేం అనుమతించం" అన్నాడు యస్.ఐ.

అతను వేరే పనిమీద బయటకు వెళ్లాడు. అప్పుడు పోలీసుల్ని బతిమాలి వారికి లంచం ఇస్తే ఒప్పుకుని "అయ్యగారు వచ్చేలోగా తిను" అన్నారు.

మధుకి చాలా అవమానంగా ఉంది.

దెబ్బలు బాధగా ఉన్నాయి.

అతని వర్గానికి చెందినవాళ్లు చివాట్లు పెట్టారు.

"రౌడీషీట్ తెరిస్తే నీ బతుకు ఏమైపోతుందో నీకు తెలియటంలేదు. అసలు ముందు నువ్వు చెయ్యి చేసుకోవటం ఏంటిరా? " అని తిట్టారు.

అప్పటికప్పుడు రామచంద్ర ఇంటికి వెళ్లారు

ఆయన అందరినీ మర్యాదపూర్వకంగా కూర్చోపెట్టాడు.

"ఇప్పటికే చాలా సమయం అయింది. మీరందరూ భోంచేసారా? " అన్నాడాయన.

"భోజనాలదేముంది లెండి. ఇది కుర్రాళ్ల వ్యవహారం. వారి బతుకులు అన్యాయమై పోతాయి. అందుకని మీతో మాట్లాడదా మని వచ్చాం" అన్నాడో పెద్దమనిషి.

"ఇది కుర్రాళ్ళ సమస్య అనకండి. ఇందులో ఏ పాపం తెలియని ఓ అమ్మాయి ఉంది" అన్నాడు రామచంద్ర

అందరూ ఒక్కసారిగా మౌనంగా ఉండిపోయారు.

"ఏం జరిగిందో మా మదన్ కొంతవ రకు చెప్పాడు. వారిద్దరి మధ్య గొడవలు మనం కొంతవరకు ఊహించగలం. ఎవరి కోణంలో వారు తాము చేసింది కరెక్ట్ అనుకుంటారు కదా? "

"అవుననుకోండి. దీన్ని పోలీస్ స్టేషన్ దాకా తీసుకువెళ్లకుండా ఉండాల్సింది" అన్నాడో వ్యక్తి కాస్త ఆవేశంగా

"అంటే వ్యక్తిగతంగా తగాదా పడాలా? ఇందులోకి కులాన్ని తీసుకురావాలం టారా? " అన్నాడు రామచంద్ర సూటిగా.

"నువ్వు కాస్సేపు మాట్లాడొద్దు వెంక ట్రావ్. ఇక్కడ పెద్దవాళ్లం ఉన్నాం" అన్నాడు ముందు మాట్లాడిన పెద్దాయన.

అతను కోపంగానే తలదించుకున్నాడు

"మనల్ని బట్టి కొంతవరకు మన పిల్లల ప్రవర్తన ఉంటుంది. మధు మా అబ్బాయి చెంప మీద కొట్టాడు. రేపు ఇంకొకరిని తల పగలకొడతాడు. అతను చదువుతు న్నది ఇంటర్మీడియట్. అంటే పదిహేడు సంవత్సరాలకే ఓ యాంటీ సోషల్ ఎలి మెంట్‌గా తయారవుతున్నాడు" అని వారందర్నీ చూసాడు రామచంద్ర.

ఎవరూ మాట్లాడలేకపోయారు

"ఈ వయసులో అద్భుతాలు చేస్తున్నవా రున్నారు. మన ఊరికి కూడా ఓ చరిత్ర ఉంది రమణమూర్తిగారూ. ఇక్కడ నుంచి ఎందరో ఆటగాళ్లు తయారయ్యారు. కళాకా

## భయంకర ప్రాణి!

భానుమతి ధైర్యస్థురాలని ప్రత్యేకించి చెప్ప వలసిన అవసరం లేదు. గార్డెన్‌లో ఒంటరిగా తిరుగుతూ పాములూ తేళ్లూ కనిపించినా హుందాగా పక్కకు తప్పుకొని పోయేవారు. దయ్యాలకు, భూతాలకు భయపడని ఆమె ఒకసారి పనిమ నిషిని పిలిచి... 'ఒసేవ్! వంట గదిలో భయంకర మైన ప్రాణి ఒకటి ఉంది. దాన్ని తరి మేసి రావే!' అంది.



దాంతో వంట మనిషికి ముచ్చెమ టలు పట్టాయి. ఆ భయంతో వంట గదిలోకి వెళ్ళి పరీక్షగా పది నిమిషాలు గదంతా కలయ చూసి నిస్సారంగా వచ్చేసింది.

'ఆ ప్రాణిని తరిమేశావా? '

'అక్కడేం లేదమ్మా' అమాయకంగా అంది.

'సరిగ్గా చూశావా? '

మళ్ళీ వెళ్ళి కాస్సేపట్లో వచ్చింది పనావిడ.

'అక్కడ నాలుగు బల్లులున్నాయమ్మా!'

'నాలుగు బల్లులా? నేను నాలుక్కాలాలు బతకాలే తల్లీ! ముందు వాటిని తరిమేసి రా! బల్లంటే నాకు భయమే తల్లీ!' అన్నారు భాను మతి, పసిపాపలా మొహం పెట్టి. తర్వాత తన చేష్టలకి తనే నవ్వుకొంటూ వుండేవారామె.

రులు తయారయ్యారు. వారందరూ ఈ వయసులోనే తమ భవిష్యత్తుకి పునా దులు వేసుకున్నారు"

"మధుకి ఆవేశం ఎక్కువే. వాళ్ల అమ్మా-నాన్నలు పల్లెటూర్లో రెండెకరాల్లో వ్యవ సాయం చేసుకుని వాడ్ని చదివిస్తున్నారు"

"అలాంటప్పుడు ఇంకా బాధ్యత ఉండా లండి. నేను బాధపడేది మా అబ్బాయిని కొట్టినందుకు కాదు. అసలు ఓ అమ్మా

యిని తన స్వంతం అనుకోవటం ఏంటి? ఇంకెవరినీ ఆ అమ్మాయికేసి చూడకూడదు, మాట్లాడకూడదు అనటమేంటి? రేపటినుంచి కాలేజ్‌లో ఆ అమ్మాయి గురించి మాట్లాడుకుంటారు. ఇవన్నీ తెలిస్తే ఆమె తల్లిదండ్రులు కాలేజ్ మాన్పించవచ్చు. అంటే ఇద్దరు లేదా కొంతమంది అబ్బాయిలవల్ల ఓ ఆడపిల్ల భవిష్యత్తు నాశనమయిపోవాలా? "

"తప్పు జరిగింది రామచంద్రగారూ. దీన్ని సరిదిద్దే విషయం గురించి ఆలోచిద్దాం" అన్నాడు రమణమూర్తి.

"పోలీసులంటూ ఉన్నారు. చట్టమంటూ ఉంది. ఈ విషయం మధు అనుభవంలోకి రావాలని నేను యస్.ఐ. గారికి చెప్పాను. మధుతో మాట్లాడమన్నాను. అంతేగాని అతనిమీద కేసు పెట్టాలని నేను అనుకోలేదు"

"చాలా సంతోషం రామచంద్రగారూ" అంటుంటే...

"అప్పుడే అయిపోలేదు ముందు ఈ విషయంలో మీరు చెయ్యాల్సింది ఇంకా వుంది. మధు మా అబ్బాయికి క్షమాపణ చెప్పాలి. ముఖ్యంగా 'ఆరావళి' అనే అమ్మాయి పేరు బయటకు రాకూడదు. నేను మా మదన్‌కి కూడా చెబుతాను. ఇప్పటికే నేను ఓ నిర్ణయానికి వచ్చాను. సంవత్సరం మధ్యలో వాడి చదువు దెబ్బతింటుంది కాబట్టి ఈ ఒన్ ఇయర్ ఇక్కడ ఉంటాడు. తర్వాత బయటికి పంపేస్తా"

"అంత శిక్ష ఎందుకు లెండి? "

"ఇది శిక్షకాదు. ముందు జాగ్రత్త. నేను మా అబ్బాయిని ఇలా చూసుకోవాలనుకోవటం లేదు. ఈ వయసులో ఆడపిల్లలూ-మగపిల్లలు కూడా ఒకరికొకరు ఎట్రాక్ట్ అవుతారు. అయితే 'నాకు మాత్రమే స్వంతం కావాలి' అనుకోవటం ప్రమాదం. ఇదేమీ రెండు గంటల సినిమా కాదు. రెండు జీవితాలు. నాకు నా కొడుకుని థర్డ్ రేట్ సినీ హీరోలకి నకలుగా తయారు చేయటం ఇష్టం లేదు. ఇప్పటివరకు మంచి పుస్తకాలు చదువుతున్నాడు. మంచి ప్రవర్తన ఉందనుకున్నాను. మధు ఓ రకంగా బలవంతం చేస్తుంటే, వీడు ఇంకో కరకంగా చేయవచ్చు. ముందు మధు-మదన్‌లు ఎదురెదురుగా ఉంటే ఇద్దరికీ పాత విషయాలు గుర్తొస్తాయి. ఏ నిముషంలో నయినా ఎవరో ఒకరు తొందరపడటానికి అవకాశం ఉంది" అన్నాడు.

"మీరు చెప్పింది బాగుంది" అన్నాడు రమణమూర్తి.

మరుసటిరోజు మధుని రామచంద్ర ఇంటికి తీసుకువచ్చారు.

మదన్‌కి 'సారీ' చెప్పటానికి ముందు సంశయించాడు. అప్పటికే అతనికి బ్రెయిన్‌వాష్ చేసినా అభిమానం అడ్డు వచ్చింది.

"ఏంట్రా ఆలోచిస్తున్నావు. అనవసరంగా కొట్టినప్పుడు ఇదే ఆలోచన ఉండాలి. తప్పు చేసినప్పుడు సిగ్గు పడనవసరం లేదు" అన్నాడు రమణమూర్తి.

మధు ఏమనుకున్నాడో "సారీ మదన్" అని చేతులు పట్టుకున్నాడు.

"ఇట్సాల్ రైట్" అన్నాడు మదన్ గంభీరంగా.

అప్పుడు చెప్పాడు రామచంద్ర "ఈ విషయం గురించి మీరిద్దరూ బయట మాట్లాడకూడదు. అంతేకాదు, ఈరోజు నుంచి మీరు ఆరావళిని కన్నెత్తి చూడకూడదు. మీ ఇద్దరికీ మీ చదువులు తప్ప ఇంకో లక్ష్యం ఉండకూడదు"

ఇద్దరూ దిగ్భ్రాంతితో చూస్తున్నారు.

"మధూ! నువ్వు మంచి బాడీ బిల్డర్‌వి. దాన్ని ఆడ పిల్లకోసం కాదు, ఉపయోగించాల్సింది. 'మధు.. మన ఊరి అబ్బాయి' అని మేం గర్వపడేలా నువ్వు తయార

యితే నేను సంతోషిస్తాను. నువ్వు ఎడ్యుకేషన్‌తో పాటు ఆటల్లోనూ రాణిస్తావని నమ్మకం నాకుంది" అన్నాడు రామచంద్ర.

మధు రామచంద్రకేసి చూస్తుండిపోయాడు.

★ ★ ★

"మధు నిన్ను కొట్టాడా?" అన్నాడు జయంత్ నమ్మలేనట్లు.

"నీకు అబద్ధం చెబుతానా? అందులోనూ ఇదేమన్నా గొప్ప విషయమా చెప్పుకోవటానికి" అన్నాడు మదన్.

"ఈ విషయం మన కాలేజ్‌లో ఎవరూ అనుకోలేదే?"

"జరిగింది మన కాలేజ్‌లో కాదు. బయట జరిగింది"

"నువ్వు తిరగబడలేదా?"

"లేదు"

"ఎందుకని మధుకి భయపడ్డావా?"

"మా నాన్నకి భయపడ్డాను. వాడు పది దెబ్బలు కొడితే నేను నాలుగు దెబ్బలయినా కొట్టగలను జయంత్. ఆరావళి విషయంలో వాడు చాలా ఎక్కువ చేస్తున్నాడు. అందుకు అనుభవించాడు కదా!"

"ఏం జరిగింది మదన్" అన్నాడు.

అప్పుడు జరిగిందంతా చెప్పాడు. "మా నాన్న నన్ను కూడా కోప్పడ్డారు. 'ఇంక నువ్వు ఆరాని చూడటానికి వీల్లేదు. ఈ సంవత్సరం తర్వాత నిన్ను విశాఖపట్టణంలో జాయిన్ చేస్తాను' అన్నాడు"

"నువ్వెళ్లి పోతావా?" అన్నాడు బాధగా.

"నిజానికి ఇంటర్ ఇక్కడే కంప్లీట్ చేయాలనుకున్నాను. అదీ 'ఆరా' కోసం. ఇది జరిగాక నాకూ 'అగ్లీ'గా అనిపించింది. ఓ అమ్మాయికోసం ఓ వెధవతో నేను పోటీ పడటం ఏంటని. ముందు ముందు మనకి చాలా భవిష్యత్తు ఉంది. ఇంతకూ నీకు ఈ విషయం ఎందుకు చెబుతున్నానంటే 'ఆరా' విషయం ఇక నుంచి నేను పట్టించుకోను.

జయంత్ కళ్లు సంతోషంతో వెలిగాయి.

"నీకు మాత్రమే జరిగింది చెప్పాలనిపించింది. ఇది ఎవరికీ తెలియకూడదు. అలా అలా నలుగురికి తెలిస్తే మెల్లగా ఆరాకి తెలుస్తుంది. అప్పుడు నన్ను చీదరించుకోవచ్చు"

"నేను ఎవరికీ చెప్పను" అన్నాడు జయంత్.

ఇది జరిగిన రెండు రోజులకి మధు కలిసాడు.

"మదన్ నీకు ఏమన్నా చెప్పాడా?" అన్నాడు సూటిగా

"ఏ విషయం మధూ?"

> **కొత్తగాలి...**
>
> **ఈదేశంలో అవినీతికి**
> **నింగీనేలా అడ్డుకాదు..!**
> **నిన్న.. టెలీ తరంగాలు**
> **నేడు.. బొగ్గు నిక్షేపాలు..!**
>
> – టి.వి.ఆర్. నర్సయ్య,
> మహబూబాబాద్, వరంగల్ జిల్లా

"నువ్వు మంచి నటుడువి జయంత్" అన్నాడు అదోలా చూస్తూ.

"నేను ఎప్పుడూ స్టేజ్ మీద నాటకాలు వేయలేదు. నటన మీద నాకు మక్కువ లేదు. ఎవరన్నా బాగా నటిస్తే చూసి ఆనందిస్తుంటాను" అన్నాడు జయంత్.

తనమీద వ్యంగ్య బాణాలు విసురుతున్నాడని మధుకి అర్థమైంది. తనకేసి మాట్లాడకుండా చూస్తుంటే జయంత్ చెప్పాడు- "ఈ సంవత్సరం తర్వాత తను మన ఊరి నుండి వెళ్లిపోతున్నాను అని మాత్రం చెప్పాడు. ముందు నుంచి మదన్‌కి మనూర్లో అవకాశాలు తక్కువగా

## కోడా? కోరా?

'మంగమ్మగారి మనవడు' చిత్రంతో భానుమతికి కోడి రామకృష్ణ మీద అభిమానం, ఆప్యాయతలు పెరిగాయి. ఆ చిత్రం సాధించిన విజయం అలాంటిది. కోడి రామకృష్ణ మరో చిత్రంలో ఆమె నటిస్తుండగా అలవాటుగా 'రామకృష్ణా!' అని పిలిచి ఉలిక్కిపడేవారు. ఎందుకంటే రామకృష్ణ అనే పేరు భానుమతి శ్రీవారి పేరు. పోనీ 'కోడీ!' అని పిలుద్దామంటే బాగుండదు. ఆయన అప్పటికే సక్సెస్‌ఫుల్ డైరెక్టరయిపోయాడు.



సెట్‌లో కోడి రామకృష్ణతో చనువుగా మాట్లాడ్డం ఆమెకు ఇబ్బంది అయిపోయింది.

"నిన్నేమని పిలవమంటావయ్యా. రామకృష్ణా అని పిలుద్దామంటే అది మా ఆయన పేరు. పోనీ 'కోడీ' అని పిలుద్దామంటే ఆ కోడి పేరు తలచుకుంటేనే కంపరంగా వుంటుంది!"

"మీ ఇష్టం అమ్మా!" అన్నాడు డైరెక్టర్ బిడియంగా.

"సరే ఒక పని చేద్దాం. కోడిలో 'కో' రామకృష్ణలో 'రా' కలగలిపితే 'కోరా' అని పిలుస్తా.. సరేనా? " అన్నారు భానుమతి.

"మీరు కోరారుగా అలాగే పిలవండీ" అన్నాడు రామకృష్ణ.

రామకృష్ణ తెలివితేటలకి ముసిముసి నవ్వులు రువ్వారామె.

---

ఉన్నాయనే ఫీలింగ్ ఉంది"

"వాడు ఎక్కడికయినా వెళ్తాడురా. డబ్బు ఉంది కదా!"

"నీకు మాత్రం డబ్బులు లేవా? "

"నా దగ్గర అంత డబ్బువుంటే నేను ఇంకో రకంగా ఉండేవాడ్ని. ఇప్పుడు నాకు డబ్బుల అవసరం మరింతగా తెలిసింది. నేను బాగా సంపాదించాలనుకుంటున్నాను" అన్నాడు మధు.

"ఉద్యోగం చేస్తావా? "

"ఉద్యోగం చేస్తే డబ్బులు ఏమొస్తాయి.. మీ నాన్న కూడా చేస్తున్నాడుగా!"

"మాకు వచ్చే డబ్బులు మాకు సరిపోతున్నాయి"

"అలా ఎడ్జస్టవుతూ బతకటం కాదు. డబ్బులుంటే దేన్నయినా కొనొచ్చు"

"అంటే... "

"ప్రేమని కూడా!"

"నిజమా!"

"అవున్రా.. ప్రతిరోజూ ఓ కొత్తడ్రస్- బైక్‌ల మీద రావటం. ఫ్రెండ్స్‌కి డబ్బులు ఖర్చు పెట్టడం- ఇలాంటివి చేస్తున్నా ఆడపిల్లలు పడిపోతారు"

"నీ అభిప్రాయాలు మార్చుకున్నావా? ఆడపిల్లలు కండలు చూసి పడిపోతారన్నావు" గుర్తు చేసాడు.

"అది కొంతమంది విషయంలోనే. ఆడపిల్లలందరూ ఒకటి కాదు. కొంతమందికి నీలాంటివారు కూడా నచ్చుతారు"

"అదేంటి? "

"నువ్వు బుద్ధిమంతుడివి కదరా. నీ పని తప్ప ఇంకొకర్ని పట్టించుకోవు" అన్నాడు.

"నువ్వూ బుద్ధిమంతుడిగా ఉండొచ్చు మధూ" అని వచ్చేసాడు.

జయంత్‌కి ఇప్పుడు ఆనందంతో పాటు ఇంకొక సమస్య అదనంగా చేరింది. ఆడపిల్లల్ని ప్రేమించటానికి కావలసిన లక్షణాలు పెరిగిపోతున్నాయి. ఒక్కొక్కరి అనుభవం ఒక్కోలా ఉంది.

మదన్ ప్రకారం జ్ఞానం- కమ్యునికేట్ చేయగలగటం కావాలి. మధు ప్రకారం దృఢమైన శరీరం కావాలి. దాంతోపాటు ఇప్పుడు డబ్బులు కూడా కావాలి. ఇప్పటి దాకా డబ్బుల గురించి ఆలోచించలేదు.

ప్రేమించే హృదయం మాత్రం ఉంటే చాలు అనుకుంటున్నాడు. ముందు

ముందు ఇంకెన్ని లక్షణాలు కావాలో అని పిస్తోంది. దానికి ముందు 'సూర్య' గురించి ఆలోచన వచ్చింది. అతనికి ఎప్పుడూ సమస్యలేనా? ప్రేమ భావనలు కలగవా అని. సూర్య కూడా తమలాంటి యువకుడే. అతనితో ఓసారి మాట్లాడి చూడాలనుకున్నాడు.

★ ★ ★

సైకిల్ కావాలని అడిగిన జయంత్ మళ్లీ ఆ విషయం మాట్లాడకపోయే సరికి ఇది కూడా ఇదివరకటిలా జయంత్ మరి చిపోయాడని అనుకుంది అనంత.

ఆదివారంనాడు "అమ్మా! నాన్న బయ టకు వెళ్లరు కదా? " అని అడిగాడు

"ఎందుకు అడుగుతున్నావు? " అందామె.

"సైకిల్ కావాలి"

"నేర్చుకోవటానికా? "

"కాదు. నాకు సైకిల్ తొక్కటం వచ్చింది. సరదాగా నేను ఊరంతా ఓసారి తిరిగివస్తాను" అన్నాడు.

అనంత ఆశ్చర్యాన్ని కనిపించనీయ కుండా "తీసుకువెళ్లు" అంది.

జయంత్ సైకిల్ మీద వెళ్తుంటే కళ్లప్ప గించి చూస్తోంది. తమవీధి దాటి వెళ్లాడు.

తర్వాత ఆరా దగ్గరికి వెళ్తే బాగుండును అనుకున్నాడు. ఇప్పటివరకూ 'ఆరా' ఇల్లు తెలియదు. తెలుసుకోవాలని ప్రయత్నం చేయలేదు. తను సైకిల్ తొక్కుతుండగా ఆరా చూడాలని జయంత్ ఆరాటం.

ఎక్కడయినా కనిపిస్తుందేమోననే ఆశ. అలా వీధుల చుట్టూ తిరిగాడు. గుడి దగ్గ రకు వెళ్లాడు. ఆమె ఆలోచనల్లో ఎవరికో డ్యాష్ ఇవ్వబోయాడు. వాళ్లు ఏదో అన్నారు. దాంతో బుద్ధిగా సైకిల్ తొక్కు కుంటూ వస్తున్నాడు.

ఓ వీధిలో అతనికి ఎవరిదో పాట విని పించింది. అలా పాట వినిపిస్తున్న ఇంటి కేసి వెళ్లాడు. సైకిల్ ఆపి నిలబడ్డాడు. ఎవరో అమ్మాయి ఇంటిలోపల నుండి పాడుతోంది. మధ్యలో ఎవరో ఏదో చెబు తున్నారు. ఆ మాటలు సరిగ్గా వినిపించ లేదు. మళ్లీ పాట మొదలయింది.

'కొండగాలి తిరిగింది. గుండె ఊసులా డింది. గోదావరి వరదలా...' అని వినిపి స్తోంది. అక్కడనుంచి కదలాలనిపించటం లేదు. అటునుంచి వెళ్తున్న ఒకరిద్దరు జయంత్ కేసి అనుమానంగా చూస్తూ వెళ్లారు. జయంత్‌కి సిగ్గు అనిపించింది.

పాట ఆగి పోయింది. మళ్లీ వినిపిస్తుం దేమోనని కొంచెంసేపు ఆగాడు.

అక్కడనుంచి బయలుదేరాడు. ఎందుకో ఇంటిలోకి వెళ్లి ఆ అమ్మాయిని చూడాలని పించింది. అంతలోనే 'ఆరా' గుర్తు వచ్చింది. ఇంకో అమ్మాయిని చూడటమా! అది 'ఆరా'కి అన్యాయం చేసినట్లు అవు తుందనుకున్నాడు.

ఇంటికి వచ్చేటప్పటికి ఒంటిగంట దాటింది.

అనంత- తిలక్‌లు ఎదురుచూస్తున్నారు.

"ఇప్పటిదాకా ఎక్కడికి వెళ్లావు? " అంది అనంత.

"ఊరంతా తిరుగుతున్నాన్నమ్మా"

"ఎవరికోసం? " అంది అనంత.

తిలక్ చూస్తున్నాడు కొడుకుని. ఏం చెబుతాడా అన్నట్టు.

"ఊరిని చూద్దామనే. ఇంతవరకు నేను ఊరిని చూడలేదమ్మా. ఈ రోజు కొంతవ రకు చూసాను"

"ఎలా ఉంది ఊరు? "

"నీకు పాటలొచ్చు కదమ్మా" అన్నాడు అకస్మాత్తుగా.

ఆశ్చర్యంగా చూసింది అనంత. తను అడిగిన ప్రశ్నకు జయంత్ అడుగుతున్న దానికి పొంతన లేదు.

"నేను వస్తుంటే ఓ వీధిలో ఓ అమ్మాయి పాట పాడుతోందమ్మా. నాకు

అక్కడ నుంచి కదిలి రావాలని అనిపించ లేదు" అన్నాడు ఏదో లోకంలో ఉన్నట్టు.

అనంత- తిలక్ ఒకరి ముఖం ఇంకొ కరు చూసుకున్నారు.

"చెప్పమ్మా" అన్నాడు.

"ఏదో పాడతాను- నాలో నేను" అంది.

"కాదమ్మా- నాన్నకోసం- నాకోసం కూడా నువ్వు పాడాలి" అన్నాడు.

"ముందు భోజనం చేద్దువుగాని. మేం నీకోసమే చూస్తున్నాం" అంది అనంత.

జయంత్ భోజనం చేస్తున్నప్పుడు కూడా అతనికి 'కొండగాలి వీస్తోంది' గుండె ఊసు లాడుతోంది.

> ## కొత్తగాలి...
>
> **అతడు మత్తేభం**
> **ఆమె చంపకమాల**
> **మనసు పడితే**
> **జీవితం ప్రబంధం**
>
> – *తల్లాప్రగడ మధుసూదనరావు,*
> *బెంగళూరు*

'గోదారి వరద' గురించి వినటం తప్ప ఎప్పుడూ చూడలేదు. వరద 'ఆరా' హృద యంలా ఉంటుందా? పర్వతాల మధ్య నుండి నదులు పారుతుంటాయి. పర్వ తాలు సౌందర్యానికి మాత్రమే గుర్తులా?

స్త్రీకి కూడా కదూ!

'ఆరావళి' అంటే పర్వతమేకదా!

చిటారు కొమ్మన మిఠాయిపొట్లం ఉన్నట్లు పుస్తకం మీద పుస్తకం పేర్చు కుంటూ- దాని మీద టిఫిన్ బాక్స్...

అది తెరిస్తే-

అందమైన గులాబి పువ్వు ఉంటుందా?

అందులో నుంచి సీతాకోక చిలుకలు ఎగురుకుంటూ వస్తాయా? అందులో పాటలుంటాయా?

'జయా' పిలిచింది.

ఉలిక్కిపడ్డాడు. "ముందు భోంచేయ్" అంది అనంత.

కలవరాన్ని కప్పిపుచ్చుకుని భోజనం పూర్తి చేసాడు. తన గదికి వెళ్లిపోయాడు.

అప్పుడతనికి ట్రాన్సిస్టర్ కావాలనిపిం చింది. ఓసారి మదన్ చెప్పాడు. వారి ఇంట్లో టీవీ ఉందని ఓసారి ఇంటికి రమ్మ న్నాడు. ఇంతవరకు వెళ్లాలనిపించలేదు. నలుపు, తెలుపుల్లో వస్తుందన్నాడు. ఇంట్లో రేడియో ఉంది. అది హాల్లో ఉంటుంది. అనంత వాళ్లు వింటుంటారు.

సాయంకాలం అవగానే ఓ సంగీతం వినిపిస్తుంది. ఆ ఊరి గ్రంథాలయంలో కూడా రేడియో ఉంది. సాయంకాలం ఓ గంట సేపు పెడతారు. గ్రంథాలయం చుట్టూ పార్క్ ఉంది. చెట్లున్నాయి. పచ్చ గడ్డి ఉంది. రకరకాల వయసులవారు అక్కడికి వస్తారు. ఇంతవరకు అమ్మా-నా న్నల్తో కలిసి ఒకట్రెండుసార్లు మాత్రం అక్కడికెళ్లాడు. ఎప్పుడూ ఇంట్లోనే. జీవిత మెందుకో నిస్సారంగా అనిపించింది.

అసలు ఏం చేస్తున్నాడు తను.

తన గురించి చెప్పుకోవటానికేముంది?

ఇదసలు జీవితం కాదేమో!

ఏదొకటి సాధించాలి.

అప్పుడుకదా పదిమంది గుర్తిస్తారు!

కాలం ఎలా గడిచిపోయిందో తెలి యదు. సాయంకాలం అందరూ తమ పూల తోటలో కూర్చున్నారు.

"అనంతా ఓ పాట పాడు" అన్నాడు తిలక్.

అనంత ఆశ్చర్యంగా చూసింది.

"నువ్వు పాట పాడితే నేను ఈ రోజు వెన్నెల్లో 'తిలక్' కవిత్వం చదువుతాను" అన్నాడు.

అప్పుడు అనంత పాట పాడటం

మొదలు పెట్టింది.

అది సినిమా పాట కాదు.

'సినిమా పాటలు కానివి కూడా ఇంత బాగుంటాయా?' అనుకున్నాడు జయంత్.

'ఉదయం విన్న పాట బాగుందా? అమ్మ పాడిన పాట బాగుందా?' అని తనలో తాను ప్రశ్నించుకున్నాడు.

రెండూ బాగున్నాయి.

ఉదయపు పాటలో లేతదనం ఉంది. అమ్మ పాటలో ఓ గంభీరత్వం ఉంది. సెలయేటి గలగలలకూ- నదీ ప్రవాహానికి ఉన్న తేడా!

రాత్రి తిలక్ 'అమృతం కురిసిన రాత్రి' చదువుతున్నాడు.

'నా అక్షరాలు వెన్నెల్లో ఆడుకునే అందమైన ఆరావళులు' అని వినిపించింది జయంత్‌కి.

అతనిముందు అప్పటికప్పుడు ఓ మైదానం- అందులో రెండు ఎత్తైన చెట్లు...

గుంపులుగా ఆడపిల్లలు. తెల్లటి వస్త్రాలు ధరించారు. నెమళ్ల గుంపులు నర్తిస్తున్నట్లు ఉంది. భావుకతలోకి జారిపోయాడు.

'తిలక్' సైతం మైదానాల్లోకి పరుగులు తీసుకుంటూ పోయి దోసిళ్లతో అమృతం తాగుతున్నాడు.

ఆ రోజంతా వారికి ఆనందంగా గడిచి పోయింది.

అసలు సమస్య రెండు రోజుల తర్వాత మొదలయింది.

★ ★ ★

సూర్య ఒక్కడే కూర్చుని 'మహాప్రస్థానం' చదువుకుంటున్నాడు.

అప్పుడు జయంత్ అతని దగ్గరికి వెళ్లాడు. చదువుతున్న పుస్తకం పక్కన పెట్టి "కూర్చో జయంత్" అన్నాడు సూర్య.

జయంత్ ఆ పుస్తకం కేసి చూసాడు కూర్చున్నాక.

"శ్రీశ్రీ పుస్తకం చదివావా?"

"ముందుమాట చదివాను"

"చలంగారు ఎలాంటి రచయితయినా ముందుమాట బాగా రాసాడు"

"ఎలాంటి రచయితయినా అంటే..." అన్నాడు జయంత్.

"అతను కథలూ, నవలలు రాసారు. కాస్త వివాదం ఉంది వాటిమీద"

"కాస్తేంటి... చాలా వివాదాలున్నాయి. నేను అనుకోటం ప్రతి దశాబ్దానికి ఆయన మీద ఆ వివాదాలు వస్తుంటాయి. బహుశా మనం చనిపోయాక కూడా" అన్నాడు జయంత్.

సూర్య తలూపాడు.

"చలాన్ని నువ్వు చదివావా?"

"చదివాను. పుస్తకం పట్టుకుంటే వదలాలనిపించదు. అయినా మనముందు బోల్డన్ని సమస్యలున్నాయి. అవన్నీ పట్టించుకోకుండా అలాంటి పుస్తకాలు చదువుతూ కూర్చుంటే మనం ఇంకో ప్రపంచంలోకి వెళ్లిపోతాం"

"సమస్యలు అన్నీ పరిష్కారం అయిపోతాయా? అది ఎప్పటికి జరుగుతుంది సూర్యా. అప్పటిదాక చలాన్ని చదవొద్దు. ఇంకేం పనులు చేయవద్దు అంటూ కూర్చుంటామా?"

"కూర్చునే సమయం లేదనికదా నేను అంటున్నాను"

"అలాంటప్పుడు చదువుకూడా అంతే కదా!"

సూర్య కొద్దిసేపు శూన్యంలోకి చూస్తుండిపోయాడు.

"నువ్వు ఎవర్నైనా ప్రేమించావా?" అన్నాడు జయంత్

సూర్య జయంత్‌కేసి చూసాడు కాస్త ఆశ్చర్యంగా

"అలా చూస్తావెందుకు? ప్రేమించటం తప్పు అంటావా? నువ్వు ఎవరినీ ప్రేమిం

చవా? కనీసం పెళ్లన్నా చేసుకోవా? ఇలా ఉద్యమాలంటూ వాటితోనే మిగిలిపోతావా? " అన్నాడు.

"అలా ఎందుకు అనుకుంటున్నావు. సైంటిస్టులున్నారు. వాళ్ళు సమాజానికి ఉపయోగపడేది కనుక్కోవాలనుకుంటారు. అలాంటివారు ప్రేమించరా? పెళ్లిళ్లు చేసుకోరా? అలాగే కమ్యూనిస్టులు, ఉద్యమాలు చేసేవారు ప్రేమిస్తారు. పెళ్లిళ్ళు చేసుకుంటారు"

"ఉద్యమకారులు ఎదుటివారిలో ఏంచూసి ప్రేమిస్తారు? "

"ఇంకాస్త స్పష్టంగా అడుగు"

"మామూలు మనుషులయితే అందం చూసి ప్రేమిస్తారు. కొందరు రంగుచూసి-ఇంకొందరు దేహం చూసి. డబ్బు-కీర్తి ఇలా రకరకాల అంశాలుంటాయి కదా"



"ఉద్యమకారులందరి గురించి నేను చెప్పలేను జయంత్. కొంతమంది మాత్రం ఆశయం చూసి ప్రేమిస్తారు. ప్రేమకు చూపులు కలవటం కాదు ముఖ్యం. భావాలు కలవాలి. మన ఇద్దరం కలసి బతకాలనుకుంటే దానికో ప్రయోజనం ఉండాలి కదా అనుకుంటారు"

"అంటే ఏదొక ప్రయోజనం లేకుండా ప్రేమ ఉండదా? "

"ఎలా ఉంటుంది? "

"ఎందుకు ఉండకూడదు? "

"ఉద్యమాలకు ఓ ప్రయోజనం ఉంటుంది. భక్తికీ ప్రయోజనం ఉంటుంది. అది వ్యక్తిగతం కావచ్చు. సామాజికం కావచ్చు. అసలు ఉపయోగం లేనిదంటూ ఈ ప్రపంచంలో ఏదయినా ఉంటుందా? "

"నేను కల్తీ లేని స్వచ్ఛమైన ప్రేమ ఉండాలనుకుంటాను. అది కుదురుతుందా? " అన్నాడు జయంత్.

"స్వచ్ఛమైన ప్రేమంటే నాకు తెలియదు. బహుశా నువ్వు అమలిన శృంగారం గురించి మాట్లాడుతున్నావనుకుంటాను. ఇప్పుడు మన కాలేజ్‌లోనే చూడు కొంత మంది ఆడపిల్లల విషయంలో అబ్బాయిలు తగాదా పడుతున్నారు. ఎవరికి వారు తమది స్వచ్ఛమైన ప్రేమనే అనుకుంటారు. అలాంటప్పుడు ప్రేమిస్తూ ఉండొచ్చు.. ఇంకొకరి మీద ద్వేషం ఎందుకు పెంచుకుంటున్నారు? "

"ఏ అమ్మాయిలు సూర్యా? "

"పేర్లు చెప్పాలా? ఎందుకు నీకంత కుతూహలం" అన్నాడు సూర్య



పడుంది. మనం మొదట్లో ఎవరినన్నా చూసి ఎట్రాక్ట్ అవటం సహజం. ప్రతివారినీ చూసి ఎట్రాక్ట్ అవుతున్నామంటే అది ప్రేమ కాదు, కోరిక"

"చలంగారు ప్రేమ ఓ చోట నిలవదు అంటారు కదా!"

"చలం అన్నారా? శ్రీశ్రీ అన్నారా? ఇంకొకరు అన్నారా? అనేది ముఖ్యం కాదు. శాశ్వతంగా ప్రేమలు నిలవకపోవచ్చు. కనీసం కొంత కాలం నిలవాలి కదా? మనుషులు కొద్దిరోజులు కలిసుంటే అర్థమైపోతారా? "

జయంత్ ఆశ్చర్యంగా వింటున్నాడు.

"తెలుసుకుందామని అడిగాను"

"తర్వాత చెబుతాను- దేన్నయినా మన స్వంతం చేసుకోవాలి- అనుకున్నప్పుడు ఇలాంటి గొడవలు వస్తాయి. మనం ప్రకృతిని ప్రేమిస్తాం. ప్రకృతిని ఎవరో విధ్వంసం చేస్తున్నారు. మనకు కోపం రాదా? నేను స్వచ్ఛంగా ప్రేమించాను. వాళ్లు స్వచ్ఛంగా నాశనం చేశారు అనుకోలేం కదా? "

"అంటే ప్రేమకి కూడా ఆశయం ఉండాలంటావు"

"అవును. అదో భావన మాత్రంకాదు"

"మనం ఎంతోమందిని చూస్తుంటాం. అందరి మీద ఎందుకు అలాంటి ప్రేమ భావన కలగదు? "

"చెబుతున్నాను కదా. అది ఏ ఒక్కరికో చెందింది కాదు కాబట్టి. ఇంకొకరితో ముడి

"ఇద్దరు పెళ్లి చేసుకున్నారు. ఈలోగా ఒకరికి కీర్తి రావచ్చు, డబ్బు రావచ్చు, ఇంకేవేవో జరగవచ్చు. అప్పటిదాకా అణుచుకున్నవన్నీ తిరగబడతాయి. ఇప్పటిదాకా ఏ సంకెళ్లు ఆపాయో వాటిని తెంచుకుంటారు. ఎవరి బతుకులు వారు బతకొచ్చు. కానీ మనుషులు వాటికి సిద్ధాంతాలు తగిలిస్తారు. అందుకని మనం ఒకరిని ఆరాధిస్తున్నామంటేనే వారిలో మనకు నచ్చిన లక్షణం ఏదొకటి ఉందని అర్థం. భేతాళ కథల్లో చెప్పినట్లు మౌనభంగం కలగగానే రాజుగారు మోస్తున్న శవం మళ్లీ వెళ్లి చెట్టుకు వేలాడుతుంది. ఇదో ముగింపులేని కథ. ఎవరికయినా నచ్చిన లక్షణం నచ్చని విధంగా మారినపుడు

అక్కడ ప్రేమ ఉండటానికి అవకాశం చాలా తక్కువ" అన్నాడు సూర్య.

"ఇంతకూ నువ్వు ఎవరినన్నా ప్రేమిం చావా?"

"నువ్వు చెప్పు. ప్రేమగురించి ఇంతసేపు మాట్లాడుతున్నావంటేనే నాకు అనుమా నంగా ఉంది" అన్నాడు సూర్య నవ్వుతూ.

"నేను చాలా విషయాలు తెలుసుకునేద శలో ఉన్నాను సూర్యా. అందులో ప్రేమ ఒకటి!"

"చెబుతున్నాను కదా.. అది వ్యక్తిగ తంగా మొదలవుతుంది. నేను ప్రేమించిన వ్యక్తికి అది చెప్పాలి. అలా చెప్పకుండా మూడోవ్యక్తికి చెప్పడం నాకు ఇష్టం

> **కొత్తగాలి...**
>
> **నేతల అవినీతి, అక్రమార్జనకు**
> **ఉచిత న్యాయసహాయం**
> **అదనపు బోనస్**
> **కష్టేఫలి.. కదా!**
>
> – తల్లాప్రగడ ప్రభాకర్,
> మదీనాగూడ, హైదరాబాద్

ఉండదు"

"మరి నన్ను అడిగావు కదా!"

"ముందు అడగలేదు. అయినా అందరూ నాలా ఆలోచించాలని నేను అనుకోను. నీకు ఇష్టమయితే చెప్పివుండే వాడివి" అన్నాడు సూర్య నవ్వుతూ.

"ఇంత బాగా మాట్లాడుతున్నావు. మా అమ్మ దగ్గర ఎందుకంత మౌనంగా ఉండిపోయావు?"

"అలా అనేంలేదు. నేను ఆలోచించుకో వాల్సిన విషయాలు ఉన్నప్పుడు ఎక్కువ మాట్లాడను" అన్నాడు సూర్య.

★ ★ ★

ఆరు నెలల పరీక్షలు జరుగుతున్నాయి- ఆరోజు నుండి.

రాత్రి కాస్త తొందరగానే నిద్రపోయాడు జయంత్.

ఉదయం అయిదుగంటలకి అనంత జయంత్‌ని నిద్రలేపింది.

"ముఖం కడుక్కో! కాఫీ ఇస్తా" అంది.

"మొన్న నువ్వు పాడిన పాట బాగుం దమ్మా" అన్నాడు.

అనంత విస్మయంగా చూసింది.

★ ★ ★

అనంత, తిలక్‌లు గదిలో ఉన్నారు.

వారి ఇద్దరి ముఖాలు గంభీరంగా ఉన్నాయి.

"తెల్లవారు జాములో చదువుకుంటావని నిద్రలేపితే పాట బాగుండటం గురించి చెప్పడం ఏంటి? అసలు జయంత్ చదు వుమీద దృష్టి పెడుతున్నాడా?" స్వగ తంగా అన్నాడు.

"నాకెందుకో వాడిలో రోజుకో మార్పు కనిపిస్తోంది. ఓ రోజు సైకిల్ గురించి మాట్లాడాడు. సౌకర్యాల గురించి మాట్లా డాడు. ఇంటికి ఆలస్యంగా వస్తున్నాడు. అదేమంటే వ్యాయామం చేస్తున్నానని అంటున్నాడు. ఇప్పుడు పాటల గురించి మాట్లాడుతున్నాడు. రేపు ఇంకే విషయం గురించి మాట్లాడతాడో" అంది అనంత.

"ఈ వయస్సు అలాంటిది. అన్ని పనులూ చేయాలనిపిస్తుంది. ఏం చేయాలో నిర్ణయించుకోలేరు. ఇవన్నీ చేయగలిగితే మంచిదే. ముందు మనం ఈ పరీక్షలు అయ్యాక జయంత్‌ని కూర్చో బెట్టుకుని మాట్లాడాలి" అన్నాడు సూర్య.

అనంత అంగీకరించింది.

ఆమెకు తెలుసు. ఓ కొత్తదారిలోకి వెళ్లా లనుకున్నప్పుడు ఘర్షణ జరుగుతుంది. అందులోనూ అనేక రంగాలుంటాయి. వాటి ఎన్నిక కోసం తెలియకుండానే ఓ

మథనం జరుగుతుంది. ఎవరైనా తాము ఏ రంగానికి పరిమితం కావాలో నిర్ణయిం చుకునేముందు పెద్ద యుద్ధం చేయాల్సి ఉంటుంది.

కొంతమంది ఎటూ నిర్ణయించుకోలేరు. ఏగాలి వీస్తే ఆ గాలికి కొట్టుకుపోతుం టారు. వాళ్లు ఓ నిర్ణయానికి వచ్చేలోగా జీవితం ఇంకేమాత్రం వారి చేతిలో ఉండదు. అక్కడ్నుంచి రాజీపడటం, అసం తృప్తే బతుకు అవుతుంది.

జయంత్ జీవితం అలా కాకూడదు. అందులోనూ ఇద్దరూ చదువుకున్నారు. ఇద్దరికీ జీవితం పట్ల కొన్ని భావాలు న్నాయి. ముందు ప్రశాంతంగా, ఆనం దంగా బతకటానికి మించిన పరమార్థం లేదు అనుకుంటున్నారు. అలాంటి చోట పెద్ద విస్ఫోటం రాకుండా చూసుకోవాలి. ఇదే ఆమెలో ఉంది.

జయంత్ పరీక్షలు రాస్తున్నాడు.

నిజానికి అవన్నీ అతనికి చిన్న విష యాలు. చిన్నప్పటినుంచి ఇంట్లో నేర్చు కున్న, నేర్పిన అనేక విషయాలున్నాయి. అందుకే పాఠం వినగానే జయంత్ మన సులోకి చొచ్చుకుపోతుంది. కొత్తకొత్త విష యాలు స్ఫురిస్తుంటాయి.

జ్ఞాపకశక్తికూడా ఎక్కువే.

ఇదంతా పదో తరగతి వరకు ఉన్నాయి. ఎప్పుడయితే 'ఆరా' అతని మన సులోకి ప్రవేశించిందో అప్పటినుంచే జయంత్‌లో మార్పులు రావటం మొదలు పెట్టాయి.

ఇప్పుడేం చేస్తున్నా ఆ అమ్మాయి గుర్తొ స్తుంది. పరీక్ష రాస్తున్నప్పుడూ అంతే. ఈసారి ఇద్దరూ ఒకే గదిలో పడ్డారు. ముందు సీట్లో ఆరావళి ఉంది.

వెనకాల జయంత్ ఉన్నాడు.

పరీక్ష పేపర్లు ముందున్నాయి. రాయా లనిపించడంలేదు.

తననే చూడాలనిపిస్తూంది.

రెండోరోజు ఇన్విజలేటర్ అది గమనిం చాడు.

దగ్గరకు వచ్చాడు.

"ఏంటి జయంత్ చూస్తున్నావ్?" అన్నాడు మెల్లగా.

"గుర్తు తెచ్చుకుంటున్నాను మాస్టారూ" అనగానే ఆయన జయంత్ కళ్లలోకి సూటిగా చూసాడు. ఆ మాస్టారు ఎప్ప ట్నుంచో జయంత్‌ని చూస్తున్నాడు. జయంతంటే అతనికి ఇష్టం. తన పని తను చూసుకుపోతుంటాడు తప్ప ఇతర విషయాలు పట్టించుకోడు.

అలాంటిది మొదటిసారి జయంత్ అత నికి దొరికిపోయాడు.

"నువ్వు రాస్తున్నది కవిత్వం కాదు, ఊహల్లోకి జారిపోవటానికి. పరీక్ష! దాని మీద దృష్టిపెట్టు" అన్నాడాయన.

జయంత్‌కి సిగ్గు అనిపించింది.

ఒకరిద్దరు 'ఏం జరుగుతోందా?' అని తలతిప్పి చూసారు.

'ఆరా' మాత్రం ఈ ప్రపంచంతో సంబంధం లేనట్లు పరీక్ష రాసుకుంటూపో తోంది.

తన తండ్రి తిలక్ కవిత్వం చదువుతు న్నప్పుడూ ఇంతే.

నా అక్షరాలు వెన్నెల్లో ఆడుకునే అంద మైన ఆడపిల్లలు అని చదువుతుంటే ఆరా వళులు అని వినిపించింది. అప్పుడు నాన్న అడిగివుంటే ఇలానే దొరికిపోయేవాడు.

ప్రపంచమంతా నిద్రిస్తున్న సమయంలో కవులు అమృతపు సోనలకోసం పరుగులు తీస్తున్నట్లు. అందరూ వచ్చింది రాస్తు న్నారు. తను మాత్రం ఆరావళిని చూస్తున్నాడు.

'అసలు పరీక్ష ఎందుకు రాయాలి?'

తల దించుకున్న తనను చూసి మాస్టారు ఇంకో విద్యార్థి దగ్గరకు వెళ్లిపో

యారు.

'అసలు ఈ చదువులు ఎందుకు?'

ఉద్యోగం చేయాలి. ఉద్యోగం అంటే జీతం. డబ్బులు.

ఉదయం నుంచి సాయంకాలం దాకా-ఆఫీస్ టేబుళ్ల ముందు కూర్చుని ఫైల్స్ చూసుకుంటూ రెక్కలు కట్టేసుకుని, లెక్కల్లో మిగిలిపోతూ ఏమిటీ బతుకు?

బతుకంటే ఇది కానేకాదు.

అందుకే మధు అన్నాడు.

డబ్బులు సంపాదించాలనీ!

అలాంటి పని అమ్మా-నాన్నలు నాకు వారసత్వంగా ఎందుకు ఇస్తున్నారు?

నువ్వు ఈ ప్రశ్నలూ-సమాధానాలకోసం రాత్రులన్నీ వృథా చేయకుండా ఆరావళి చేతులు అంధుకుని ప్రపంచమంతా చుట్టిరా అని డబ్బుల కట్టలు ఇవ్వొచ్చు కదా?

అందరూ చేసే పనిని నన్ను ఎందుకు చేయమంటున్నారు?

అనుభూతి రాహిత్యంతో ఎందుకు బతకమంటున్నారు?

ఇంక పరీక్ష రాయాలనిపించలేదు.

బయటకువెళ్లి కాగితపు పూల చెట్ల కింద కూర్చుంటే ఊహల్లోకి జారిపోతున్నావని మాస్టారు అడగరు.

జయంత్ లేచి వెళ్లాడు.

మాస్టారు అతన్ని చూసి చిన్నగా నవ్వుకున్నాడు.

అతనికి తన యవ్వనపు రోజులు గుర్తుకు వచ్చివుంటాయి.

పరీక్షలన్నీ అయిపోయాయి.

సెలవులు ఇస్తున్నారు. మళ్ళీ దిగులు మొదలయింది.

ఆరావళి వెళ్లిపోతుంది. రెండు వారాల వరకు కనిపించదు.

'ఈ రోజు ధైర్యం చేయాలి' అనుకున్నాడు.

'ఎవరన్నా తనను చూస్తున్నారా?' అని అటూ ఇటూ చూసుకున్నాడు.

ఎవరూ లేరు. కాలేజ్ నుండి బయటకు వచ్చారు.

ఆరావళి ఒంటరిగా నడుస్తోంది.

'ఈ రోజు ఎలాగయినా ఆమె ఇల్లు తెలుసుకోవాలి' అనుకున్నాడు.

ఆమెకి కాస్త దూరంగా నడుస్తున్నాడు.

అతనికి అప్పుడు మధు, మదన్ గుర్తొచ్చారు.

ఏమయిందోగాని వారు ఇప్పుడు ఎవరి గొడవలో వారున్నారు.

తను కనిపిస్తున్నా 'ఆరా' గురించి మాట్లాడటం లేదు.

ఒక్క సంఘటన వారిని మార్చేసి ఉంటుంది.

ఆ రకంగా వారు తనకిప్పుడు పోటీ కాదు. అలా అనుకున్నప్పుడు చాలా ఆనందం కలిగింది.

అప్పుడు చూసాడు.

'ఆరావళి' కనిపించలేదు. ఒక్కసారిగా ఏదో పోగొట్టుకున్న భావన. ఆలోచనలు ఒక్కోసారి ఎంత ప్రమాదకరంగా ఉంటాయో అప్పుడు అర్థం అయింది.

పరిగెత్తడం మొదలుపెట్టాడు. ఒకటి రెండు వీధులు తిరిగాడు. కనిపించలేదు. అయినా ఆరావళి ఇల్లు తెలుసుకోవడటం ఏమంత కష్టంకాదు. ఎవరో ఒకర్ని అడిగితే చెబుతారు.

దానికిముందు అనుమానంగా చూస్తారు.

'ఆ అమ్మాయి ఇల్లు నీకెందుకు?' అని అడుగుతారు.

ఏం సమాధానం చెప్పాలి?

ఇన్ని రోజులుగా చూస్తున్నా ఆమె ఇల్లు తెలుసుకోవాలని ఇప్పుడే ఎందుకు అనిపిస్తోంది!

అంటే తీవ్రత పెరుగుతుంది.

ఇది మంచికో, చెడుకో అర్థం కావటం లేదు. అలా చాలాసేపు గమ్యం లేనివా డిలా తిరుగుతుండిపోయాడు.

ఎప్పటికో ఇల్లు చేరుకున్నాడు.

★ ★ ★

"నాన్నగారికి సెలవు దొరకటం లేదు. మనం ఓ వారం రోజులు తాతయ్య వాళ్ల దగ్గరికి వెళ్దాం జయా" అంది అనంత

"నాకు రావాలని లేదమ్మా" అన్నాడు.

"అదేంటి ఎప్పుడూ తాతయ్య దగ్గరకు నాయనమ్మ దగ్గరకు వెళ్దాం అనేవాడివి"

జయంత్ మాట్లాడలేదు.

"చదువుకోవాల్సినవి, రాసుకోవాల్సినవి ఏమన్నా ఉన్నాయా? "

"అవి ఎప్పుడూ ఉంటాయి కదమ్మా!"

"మరెందుకు రానంటున్నావు? "

"నాకు ఈసారి రావాలనిపించటం లేదమ్మా" అన్నాడు.

అనంత చిన్నగా తలూపింది

"నాన్నని స్కూటర్ కొనమన్నాను. మన ఇంట్లో టీవీ లేదు. మనం అంత పేదవాళ్లమా అమ్మా" అన్నాడు.

అదిరిపడింది అనంత

"అవన్నీ నీకు అవసరమా? " అంది.

"నాకు అవసరమైనవే మీరు కొంటారా? మీకు ఏమీ అవసరం లేదా? "

"అవసరం లేకనే కొనలేదు జయా" అంది పరీక్షగా చూస్తూ

"నాకు ఎప్పుడన్నా డబ్బులు ఇచ్చావా? సినిమాకు వెళ్లేటప్పుడు మాత్రం ఇస్తావు? "

మళ్లీ ఉలిక్కిపడింది

"నీకు డబ్బుల అవసరం ఏముంది జయా? పుస్తకాల దగ్గర్నుండి బట్టలవరకు అన్నీ నాన్న కొంటున్నారు. ఇంటిదగ్గర తింటున్నావు. అయినా నువ్వు డబ్బులు కావాలని ఎప్పుడూ అడగలేదు"

"మా కాలేజ్‌లో చాలామంది దగ్గర డబ్బులుంటాయి. వాళ్లు సరదాగా ఖర్చులు పెట్టుకుంటారు"

## సారీ... బాటసారి!

బెంగాలీ రచయిత శరత్‌చంద్ర ఛటర్జీ రాసిన 'బడదీదీ' నవలంటే భానుమతికి చాలా ఇష్టం. సున్నితమైన మానవ సంబంధాలూ, మౌనభాషణలూ ఆ నవలలో పుష్కలంగా వున్నాయి.



ఆ నవలను 'బాటసారి' పేరుతో ఆమె సినిమా తీస్తున్నారని తెలిసి అందరూ ఉలిక్కిపడ్డారు. బెంగాలీ కథల మీద 'పట్టు' న్న చక్కన్న (చక్రపాణి) మరింత విస్తుపోయారు.

'ఏవిటీ బడదీదీ సినిమాగా తీస్తున్నారా? అందులో ఏముంది? ' అని అడిగారు. ఆ చనువు భానుమతిగారి దగ్గర ఆయనకుంది.

'ఏం కావాలి మీకూ? ' అనడిగారామె.

'ఓ హ్యూమన్ డ్రామా వుండాలిగా! అది సినిమాకి నప్పాలి కదా!'

'సినిమా సక్సెస్‌కి ఫార్ములా అంటూ ఏదైనా వుందా? '

'అఫ్‌కోర్స్ లేదు!'

'అందుకే హేండిల్ చేస్తున్నాం. సినిమా సక్సెస్, ఫెయిల్యూర్‌తో సంబంధం లేదు. గంగిగోవు పాలు గరిటెడైనను చాలు! అంటారు కదా.. ఇదీ అంతే! సారీ... బాటసారీ తీస్తున్నాం!' అన్నారు పకాలున నవ్వేస్తూ భానుమతి.

చక్కన్నగారికి నోటమాట రాలేదు.

"సరదాగా అంటే...? " అంది సూటిగా

జయంత్ మాట్లాడలేకపోయాడు.

"సిగరెట్లు తాగుతారు. హోటళ్లచుట్టూ తిరుగుతారు. కాలేజ్ ఎగ్గొట్టి సినిమాలు చూస్తుంటారు. అలాంటి ఖర్చుల గురించి

నువ్వు మాట్లాడుతున్నావా?"

"అసలు ఈ చదువులన్నీ ఉద్యోగాల కోసం, వాటి ద్వారా వచ్చే జీతాల కోసం. మరి నువ్వూ చదువుకున్నావు. ఉద్యోగం చేయటం లేదు. నాన్నా నువ్వు బాగా డబ్బులు సంపాదిస్తే నాకు అందుకోసం చదవాల్సిన అవసరం ఉండదు కదా?" అన్నాడు.

"మేం సంపాదించి ఇస్తే నువ్వు ఖర్చు పెడతావా?"

"నువ్వు మాత్రం నాన్న సంపాదిస్తే ఖర్చు పెట్టటంలేదా?" అని చాలా మామూలుగానే అన్నాడు.

అనంత ఓ క్షణం విలవిలలాడిపోయింది.

"అంటే నేను ఇంట్లో చేస్తున్న పనికి విలువ లేదంటావా? నేను నీకోసం ఉద్యోగం చేయాలనుకోలేదు. నిన్ను బాగా చదివించాలనుకున్నాను. నా బదులు ఆ ఉద్యోగం ఇంకొకరు చేసుకుంటారని అనుకున్నాను" అంది.

"ఏమోనమ్మా.. అందరూ మనలా అనుకోరు. నేను బాగా చదువుకోవాలి అనుకున్నప్పుడు ఇంత చిన్న చదువు చదివించటం ఎందుకు? డాక్టర్ని చేయాల్సింది. అప్పుడు నువ్వు కూడా ఉద్యోగం చేసేదానివేమో!"

"అది నీ నుంచి రావాలి జయా!"

"మీరు ఇంత సింపుల్‌గా ఉన్నప్పుడు నాకు అలాంటి ఆలోచనలు ఎందుకు వస్తాయి. మీకు ఇబ్బంది కలిగించకూడదనుకున్నాను"

"పోనీ ఇప్పట్నుంచి నీ ఇష్టం వచ్చింది చదువుకో జయా. అంతగా అయితే ఒకటి రెండు సంవత్సరాలు నష్టపోతావు. అదేం పెద్ద సమస్య కాదు" అంది అనంత

"అది ఇప్పుడు రమ్మంటే రాదమ్మా. దేనికయినా పునాది చిన్నప్పటినుంచే పడాలి" అన్నాడు.

"మేం చాలా తప్పు చేసాం. ఒప్పుకుంటున్నాను. ఇప్పట్నుంచయినా నీ జీవితాన్ని నీ ఇష్టం వచ్చినట్లు మలుచుకో. నువ్వు బాగా సంపాదించు. ఇంకేదయినా పని చేయాలనుకుంటే చెయ్యి" అంది అనంత.

జయంత్ మాట్లాడలేదు.

ఇన్ని సంవత్సరాల తర్వాత మొదటిసారి అనంత గాయపడింది. జయంత్ అలా మాట్లాడినందుకు కాదు!

ఎంత గొప్పవారయినా, ఎంత సామాన్యులయినా ముందు తమ ఇంటి నుండి ఏదొక రోజు తమ జీవనవిధానం మీద విమర్శలు ఎదుర్కోక తప్పదని అర్థం అయింది.

జయంత్ ఎందుకు మాట్లాడినా, ఆ మాటల్లో మరో రెండు మూడు దశాబ్దాల్లో ఎలాంటి పెనుమార్పులు రాబోతున్నాయో తెలుస్తున్నాయి. కొంతవరకు ఈ ఇంట్లో జయంత్ మీద పర్యవేక్షణ ఉంది. క్రమశిక్షణ ఉంది. అవి లేని కుటుంబాల్లో పరిస్థితి తలచుకుంటే అనంతకి ఇంకా భయం కలిగింది.

★ ★ ★

అనంత- తిలక్‌లు దాదాపు ఆ రాత్రి మూడు గంటల దాకా మాట్లాడుకుంటూనే ఉన్నారు.

మొదటిసారి వారికి తమ కొడుకు తమకి అర్థం కావటం లేదనిపించింది.

రోజుకో రకంగా మారుతున్నాడు. ముందు ఏవైతే తాము ఆదర్శాలు అనుకుంటున్నారో, ఏయే విషయాల్లో తాము సంతృప్తిగా ఉన్నారో అవన్నీ ప్రశ్నలకు గురయ్యాయి.

బయటివారు ప్రశ్నించటం కాదు. కన్న కొడుకే అడుగుతున్నాడు.

ఇతరులకు సమాధానం చెప్పటం వేరు. వారు ఎదురెదురుగా ఉండరు. కలిసి బత

కరు. ఈ బంధం అలాంటిది కాదు. తిల క్‌కి తమ చిన్నప్పుడు చెప్పుకునే విషయం గుర్తొచ్చింది. ఓ ఇంట్లో దొంగలు పడ్డారు. వారు దోచుకుపోవటానికి ఏమీ లేవు. దొంగలు పడ్డారని కూడా తెలియకుండా హాయిగా నిద్రపోతున్నవారిని లేపి మరీ కొట్టారంట.. కనీసం దొంగలకోసమైనా సంపాదించాలి కదా అని. అప్పుడు నవ్వు వచ్చింది. ఇప్పుడు నవ్వు రావటం లేదు.

పిల్లలు దొంగలా? అందరూ దొంగల్ని కంటున్నారా?

తన ఆలోచనకు తానే సిగ్గుపడ్డాడు తిలక్

"నాకు అర్థం కానిది ఒకటేనండీ" అంది అనంత

ఏంటన్నట్టు చూశాడు

"జయంత్ కొత్త ఊరికి వెళ్లలేదు. కనీసం కొత్త కాలేజీకి వెళ్లలేదు. ఇంత త్వరగా ఇన్ని మార్పులు ఎందుకు వస్తు న్నాయి? "

"తొలి యవ్వనంలోకి ప్రవేశిస్తున్నాడు కదా? అందుకయి ఉంటుంది"

"ఇంత మార్పు ఉంటుందా? "

"జయంత్ అందరిలాంటివాడు కాదు అనంతా. చిన్నప్పటి నుంచి మనం ఆలో చించటం నేర్పాం. అది కూడా ఓ కారణం అయి ఉండాలి. కేవలం క్లాసు పుస్తకాల వరకు పరిమితం చేస్తే ఇంకోరకంగా ఉండేవాడేమో. మనం వయసుకు మించిన జ్ఞానం కూడా నేర్పామేమో? "

"జ్ఞానం నేర్పించటం కూడా తప్పేనా? "

"మనం మన దృష్టితో, మన కోణంలో నుంచి కొన్ని విషయాలు జయకి చెబుతూ వచ్చాం. వాడు చదువుకునే స్థలంలో మార్పులు లేకపోవచ్చు. ఎప్పటికప్పుడు కొత్త స్నేహితులు పరిచయమవుతున్నారు. ప్రభావం చూపిస్తున్నారు" అన్నాడు.

"మిగతావన్నీ నేను అర్థం చేసుకుంటు న్నాను. డబ్బు సంపాదన గురించి వాడి తాపత్రయాన్ని మాత్రం నేను అర్థం చేసు కోలేకపోతున్నాను. అయినా ఈ వయ సులో..." అని ఆగిపోయింది.

"పదహారు సంవత్సరాల వయసు చిన్న దని నేను అనుకోవడంలేదు అనంతా. మన దేశానికి ఇంకా స్వతంత్రం రానప్పుడు ఆ వయసులోనే ఎన్నెన్నో అద్భుతాలు చేసారు. భగత్‌సింగ్‌ని ఉరి తీసేటప్పటికి అతని వయసెంత? అప్పటికే అతను ఎంత చదివాడు? రేపటి భారతదేశం ఎలా ఉండాలనే విషయం మీద ఎంత గొప్పగా రాసుకున్నాడు"

అనంత మాట్లాడలేకపోయింది.

"మనం ఘర్షణ లేనిదాన్ని కోరుకున్నాం.

> ## కొత్తగాలి...
>
> **'అ'మ్మలోని అనురాగం**
> **'నా'న్నలోని నయగారం**
> **అందించే వాడే**
> **అన్న!**
>
> – ఎస్.కె. నాగ్,
> పెనుగొండ, ప.గో.జిల్లా

మనం చూసిన వ్యక్తులు మనకు అనుమా నాన్ని కలిగించారు తప్ప ప్రేరణను కలి గించలేకపోయారు. అందుకని ఇదంతా మనకి కొత్తగా అనిపిస్తోంది"

"ఇప్పుడు మనమేం చేయాలి? "

"మనం మారటమో, జయంత్‌ని మార్చుకోవటమో చేయాలి" అన్నాడు ఆలో చిస్తూ.

"నాకయితే జయంత్ కోరుకున్నట్లు మారాలని లేదు"

"అహం అడ్డు వస్తోందా? "

"నాకు ఎండమావుల వెంట పరుగులు

తీయాలని లేదండి. అందుకే వాడికి చెప్తాను, నువ్వేం చేయాలనుకుంటున్నావో అది చెయ్యమని. మనం డబ్బులు సంపాదించి ఇవ్వాలనే ఆలోచన నాకు ఏ మాత్రం నచ్చటంలేదు. మనం డబ్బులు ఇవ్వగలం. నాకూ కోరికలున్నాయి. అవన్నీ జయ సాధిస్తాడా? "

"అదే అడగాల్సింది" అన్నాడు చిరునవ్వుతో.

"తప్పకుండా అడుగుతాను" అంది అనంత

★ ★ ★

సెలవుల్లో జయంత్ చేసిన పని 'ఆరావళి' పర్వతాల గురించి తెలుసుకోవటం

ఆంగ్లంలో 'ఆరావళ్లి' అని కొన్నిచోట్ల, 'ఆరవళి' అని కొన్నిచోట్ల ఉండటం గమనించాడు.

ప్రపంచంలోనే అత్యంత ప్రాచీనమైన 'లైన్ ఆఫ్ పీక్స్'గా వాటిని వర్ణిస్తున్నారు. ఆ పర్వతశ్రేణులు ఎనిమిది వందల కిలో మీటర్ల వరకూ వ్యాపించి ఉన్నాయి.

భారతదేశానికి చెందిన రాజస్థాన్-హర్యానా-గుజరాత్ రాష్ట్రాల్లోనూ, పాకిస్థాన్ పంజాబ్-సింధులలో ఉన్నాయి.

అత్యంత ఎత్తయిన శ్రేణి మౌంట్ అబులోని 'గురుశిఖర్' ప్రాంతం 5650 అడుగుల ఎత్తులో ఉంది.

ఈ పర్వత శ్రేణుల్ని ఒవాస్, లూనీ, సఖి, సబర్మతి నదులు ఒరుసుకుంటూ ప్రవహిస్తుంటాయి.

ఎప్పటికయినా 'ఆరావళి' పర్వతశ్రేణుల వద్దకు వెళ్లి రావాలి. వాటి అందాలను దగ్గరగా చూడాలి. అందుకు సంకోచాలు, సిగ్గుపడటాలూ ఉండవు.

బహుశా 'గురుశిఖర్' మీదకు వెళ్లి అక్కడ టిఫిన్ బాక్స్‌ని మెల్లగా తెరిచి చూడాలి.

అందులోనుండి శతాబ్దాల సంగీతాలు- మానవాత్మలు- నదులు చెప్పే ఎన్నెన్నో గాథలు అన్నీ దర్శనీయం కావటమో- అనుభూతి చెందటమో జరుగుతుంది అనుకున్నాడు.

ఈ సెలవుల్లోనే ఇంకో సంఘటన జరిగింది.

'మధు' వర్గానికి చెందిన వ్యక్తికి కాస్త 'కుల' అభిమానం ఎక్కువ. మధుని లాకప్‌లో ఉంచటం, అతన్ని కొట్టించటం తన 'కులా'నికి జరిగిన అవమానంగా భావించాడు. పైగా అతను శ్రమించటం కాక ఇతరుల్ని బెదిరించటం, భయపెట్టడం లాంటి పనుల ద్వారా డబ్బు సంపాదించే పనిలో ఉన్నాడు.

అతను మధుకి జరిగిన 'అవమానా'నికి బదులు తీర్చుకోవాలి అని రెచ్చగొట్టటం మొదలుపెట్టాడు. అప్పటివరకు మధుకి 'మద్యం' అలవాటు లేదు. మెల్లగా మద్యం అలవాటు చేసాడు. అతన్ని బైక్‌ల మీద తిప్పటం మొదలుపెట్టాడు. మధుకి ఎప్పుడేం కావాలంటే అవి అందుతున్నాయి. డబ్బులకి లోటు లేదు. ముఖ్యంగా ఎన్నికలు రాబోతున్నాయి.

ఆ ఊర్లో ఓ మహాసంగ్రామం జరగబోతోంది.

మధు ఎలా అయినా మదన్ మీద దాడి చేయడానికి అవకాశం కోసం ఎదురు చూస్తున్నాడు. ఈ విషయాలు మదన్‌కి తెలియవు.

రామచంద్ర కూడా మధు విషయం సమసిపోయింది. ఇది కుర్రవాళ్ల తగాదా అనుకున్నాడు.

ఆ ఊర్లో ఎప్పటినుంచో రెండు కులాల మధ్య వైషమ్యాలున్నాయి. అలాగే మరి కొన్ని కులాల మధ్య కూడా పోరు బీజరూపంలో ఉంది. ఎప్పుడు ఏ రెండు కులాలు కలుస్తాయో తెలియదు. ముఖ్యంగా ఎన్నికలప్పుడు ఇవి బయటపడుతుంటాయి.

మదన్ సెలవులకి ఈసారి బెంగుళూరు వెళ్లాడు. అక్కడ అతని బంధువులు స్టేట్స్ వెళ్తున్నారు. ఓ వారం రోజులు అతను రకరకాల వ్యక్తుల్ని కలుసుకున్నాడు. అతనికి అప్పుడు తన గమ్యం ఏమిటో స్పష్టమైంది.

ఇంక ఎక్కువ కాలం మదన్ ఇండియాలో ఉండదలుచుకోలేదు. తను సాధించాల్సింది అమెరికాలో ఉంది. అందుకు తగ్గ అన్ని అవకాశాలూ అక్కడ ఉన్నాయి. ముఖ్యంగా స్వేచ్ఛాప్రతిమని అతను చూస్తుంటే మొదట్లో 'ఆరావళి' గుర్తువచ్చింది. అతను తన కజిన్స్‌తో ప్రేమ గురించి కూడా మాట్లాడాడు. 'అదంతా చెత్త. ఇప్పుడు కళ్లు తెరిస్తే మంచి భవిష్యత్ ఉంటుంది. అమెరికాలో అయితే డేటింగ్ ఉంటుంది. ఎవరికి ఇష్టమైనవారితో వారు డేటింగ్ చేస్తుంటారు. శాశ్వత సంబంధాలుండవు. ఎప్పుడు కావాలంటే అప్పుడు విడిపోవచ్చు. ముందు నిర్మించుకోవాల్సింది భవిష్యత్తుని. ఓ ఆడపిల్ల కోసం బతుకులు నాశనం చేసుకునేది ఈ దేశంలోనే. అందుకే మన సినిమాలు ఎప్పుడూ ప్రేమల చుట్టూ తిరుగుతాయి. అదే హాలీవుడ్ సినిమా సైన్స్ ఫిక్షన్స్ గురించి, ఎలియన్స్ గురించి ఆలోచిస్తోంది. మనకి అక్కడి ఫిలాసఫి, అక్కడి సాంకేతిక ప్రగతి మూడు దశాబ్దాల తర్వాతగాని అందుబాటులోకి రాదు' అనేది మదన్‌ని ఆకర్షించింది.

సూర్య కూడా ఈ సెలవుల్లో కొంత మంది యువజన నాయకుల్ని కలుసుకున్నాడు. తమ కాలేజీలో టాయ్‌లెట్ల గురించి ప్రిన్సిపాల్‌తో మాట్లాడటం, సైకిల్ స్టాండ్‌ని నిర్మించటానికి విద్యార్థులని కదిలించటంలాంటి తన కృషి గురించి చెప్పాడు. అతనిలోని ఉత్సాహం గమనించారు.

"నీలాంటి యువకుల అవసరం విశాఖ, హైదరాబాద్‌లాంటిచోట్ల ఉంది. నువ్వు ఈ సంవత్సరంలో ఏదో ఒక సెంటర్‌ని ఎన్నుకో. నీకు మంచి భవిష్యత్తు ఉంటుంది అని చెప్పారు" సూర్యమీద ఆ మాటల ప్రభావం పడింది.

అలా ఆ నలుగురూ సెలవుల తర్వాత కాలేజ్‌కి వస్తుంటే తమకే కొత్తగా అనిపించింది.

★ ★ ★

జయంత్ ఎప్పటిలానే ఎదురుచూస్తున్నాడు. ఒక్కొక్కరూ కదలి క్లాస్‌రూమ్‌లకి వెళ్తున్నారు. "ఏరా జయంత్" అని వినిపిస్తే ఉలిక్కిపడి చూసాడు. పరీక్షలు రాస్తున్నప్పుడు పర్యవేక్షణకి వచ్చిన మాస్టారు కనిపించారు.

"ఎవరి కోసం చూస్తున్నావు?"

"అదీ... మదన్‌కోసం" అన్నాడు తడబడుతూ.

"అంటే నువ్వింకా ఊహల్లోనే బతుకుతున్నావు" అన్నారాయన.

"అదేంటి మాస్టారూ" అన్నాడు మెల్లగా.

"నేనే చెప్పాలా!"

జయంత్ తలదించుకున్నాడు

"పాఠాలు చెబితే మాకు జీతాలు వస్తాయి జయంత్. మీరు ఎప్పుడేం చేస్తున్నారు అని చూడటం మా పనికాదు.

## కొత్తగాలి...

**స్నేహం నిలవాలంటే**
**అప్పు అసలడక్కు**
**స్నేహితుని వదుల్చుకోవాలంటే**
**మరీ మరీ అప్పు అడుగు**

– చక్కా చెన్న కేశవరావు,
కావలి

నువ్వంటే నాకు ఇష్టం కాబట్టి చెబుతున్నాను. నువ్వు ఇదివరకటి జయంత్‌వి కాదు. మీ నాన్న నాకు తెలుసు. విలువలున్న మనిషి. నీనుండి చాలా ఆశిస్తుంటారు. ఇప్పటివరకు నువ్వు చేసింది తప్పు కాదు. ఆ ఫేజ్ అయిపోయింది. ఇంకా నువ్వు అదే ఆరాటంలో ఉంటే మాత్రం సుఖపడలేవు"

అప్పుడు తలెత్తి మాస్టార్ని చూసాడు.

"యవ్వనంలో 'గాడిద' కూడా అందంగా ఉంటుంది అంటారు. మనం నేర్చుకోవాల్సింది 'గాడిద' చాకిరీని. దాన్ని చదువుకి అన్వయించుకుంటే బాగుపడతావు" అని

## కొత్తగాలి...

**ఓ ఉగ్రవాది సృష్టించే**
**బీభత్సం కంటే**
**ఓ మేధావి మౌనమే**
**జగతికి తీరని నష్టం**

– బిక్కునూరి రాజేశ్వర్,
పొన్కల్

వెళ్లిపోయాడు.

అప్పుడు కోపం వచ్చింది జయంత్‌కి

తను ఆరావళిని చూస్తున్నానని మాస్టారు గమనించేవుంటారు. ఆరావళిని గాడిదతో పోల్చటం ఎంత అన్యాయం!

ఈ మాస్టారికి సౌందర్య దృష్టి ఉందా?

ఓ అమ్మాయి కోసం ఇంతమంది మగపిల్లలు కొందరు తెలిసి, ఇంకొందరు రహస్యంగా పోటీ పడుతున్నారు. అందుకు యవ్వనం మాత్రమే కారణమా?

అసలు ఇంతవరకూ చరిత్రలో 'బాగా చదువుకో. మంచి డాక్టర్‌వి కావాలి. మంచి ఇంజనీర్‌వి కావాలి. మంచి ఉద్యోగస్తుడివి కావాలి అనే తల్లిదండ్రులున్నారు గాని మంచి ప్రేమికుడివి కావాలి అన్నవారున్నారా? అసలు ప్రేమించని వాడు మనిషెలా అవుతాడు? గాడిదలు మాత్రం ప్రేమించవా? ఏం మనిషితను?' అనుకున్నాడు.

అప్పుడే అతనిలో పట్టుదల వచ్చింది. 'ఎవరెన్ని చెప్పినా నేను ఆరావళిని ప్రేమిస్తాను. ప్రేమించి తీరతాను. జీవితాంతం ప్రేమిస్తూనే ఉంటాను' అనుకున్నాడు. ఆరావళి నా కళ్లలో ఉంది. నా గుండెల్లో ఉంది. తనను ప్రత్యక్షంగా చూడనవసరం లేదు. నేను రెండు కళ్లు మూసుకుని మనసుని కేంద్రీకరిస్తాను. అది చాలు నాకు అనుకున్నాడు.

విసురుగా క్లాస్ రూమ్‌కి నడిచాడు. నాలుగు అడుగులు వేయగానే లోనికి వెళ్లాలనిపించలేదు. వెనక్కి తిరిగాడు. అప్పుడు కనిపించింది ఆరావళి.

ఎప్పటిలానే నడిచివస్తోంది.

ఈ రోజు కొత్త దుస్తుల్లో!

అవే పుస్తకాలు! అదే టిఫిన్‌బాక్స్. స్థానం మారలేదు.

'ఇప్పుడు కూడా క్లాస్‌కి వెళ్లవా?' ఎవరో అరుస్తున్నారు.

తను ఓ నిర్ణయానికి వచ్చాడు.

'ఈ రోజు నేను కాలేజీకి వెళ్లను' అనుకున్నాడు. ఇద్దరూ ఎదురెదురుగా వస్తున్నారు. ఆరావళి కేసి చూడకూడదు అనుకున్నాడు. అలా తలదించుకుని వస్తుంటే 'ఆరా' అతన్ని కాస్త ఆశ్చర్యంగా చూడటం అతను గమనించలేదు.

కొంతదూరం వచ్చాడు.

ఎందుకో జేబులు తడువుకున్నాడు. ఏదో కాగితం తగిలింది.

ఏమైవుంటుందా అని చూసుకున్నాడు. వంద రూపాయల నోటు కనిపించింది!

ఎలా వచ్చింది? ఎవరు జేబులో పెట్టారు?

ఇంతకుముందు అమ్మతో జరిపిన సంభాషణ గుర్తు వచ్చింది. 'నాకు ఎప్పుడన్నా డబ్బులు ఇచ్చావా?' అని అమ్మను అడిగాడు. అది గుర్తుంచుకుని చెప్పకుండానే జేబులో పెట్టిందా? నాకూ ఖర్చులుంటాయి కదా అన్నాను- ఇప్పుడు ఎలా ఖర్చు చేయాలి అనుకున్నాడు. అలా నడిచివస్తుంటే ఓ సినిమా పోస్టర్ కనిపించింది. సినిమా చూస్తేనో అనుకున్నాడు. అందులోనూ అదో ప్రేమ తాలూకు సినిమా. ఇంక ఆలస్యం చేయలేదు. సినిమాహాల్ దగ్గరికి వెళ్లాడు. టిక్కెట్ కొనుక్కుని లోపలికి వెళ్లి కూర్చున్నాడు. సినిమా మొదలయింది. పెద్దగా జనం లేరు. అప్పుడు ఓ స్త్రీ వచ్చి తన పక్కనే కూర్చుంది. అలా కూర్చుంటున్నప్పుడు పొరపాటున కాలు తొక్కింది. 'సారీ' అంది. 'ఫర్వాలేదండి' అన్నాడు మొహమాటంగా, కాలు నొప్పిగా అనిపిస్తున్నా. ఆడవాళ్ల కాళ్లలో ఇంత బలం ఉంటుందా? అనుకున్నాడు. ఆ తర్వాత అర్థమైంది ఆమె కాలిబలం కన్నా ఆమె చెప్పుల తాలూకు 'హీల్' బలమైనదని.

ఆరావళి గుర్తు వచ్చింది. ఆమె ఎద సౌందర్యం సమున్నతంగా ఉండొచ్చు. కానీ ఆడవాళ్లు వేసుకునే చెప్పుల హీల్స్ కూడా ఎత్తుగా ఉంటున్నాయి. అంటే కొండలమీద నడుస్తుంటారు. తమ ఎత్తు తక్కువ అని వారికి న్యూనత ఉంటుందనుకుంటా. అయినా 'ఆరా' కూడా అలాంటి చెప్పులనే ధరిస్తుందా? ఇంతవరకు ఎప్పుడూ తను గమనించనేలేదు. ఆరావళి పొట్టికాదు. లావు కాదు. ఎంత ఉండాలో అంతే ఉన్నట్లుంటుంది. జయంత్ ఆలోచనలు అలా సాగుతుంటే-

మల్లెపూల వాసన ఒక్కసారిగా గుప్పుమంది. ఏదో మైకం కమ్మింది. అంతలోనే ఆమె చెయ్యి జయంత్‌ని తాకింది. శరీరం ఒక్కసారిగా కరెంట్ షాక్‌కి గురయిన భావన కలిగింది. గాజుల చప్పుడుతో పాటు మళ్లీ 'సారీ' అనే మాటల మత్తు ప్రవహించింది.

జయంత్ చేతులు ముడుచుకుని కూర్చున్నాడు. మొదటిసారి అతనికి ఆ చీకట్లో ఆ స్త్రీని చూడాలనిపించింది, అంతే. కాదు.. ఇంకోసారి ఆమె చేతిని తాకాలని కూడా అనిపించింది. ఎటూ తేల్చుకోలేకపోయాడు. సినిమాలో మాటలూ - పాటలూ కూడా వినిపించటం మానేసాయి.

★ ★ ★

చాలా రోజుల తర్వాత మళ్లీ జయంత్ తన నోట్‌బుక్ అందుకుని రాయటం మొదలు పెట్టాడు.

ఇప్పటిదాకా నేను పతనం అవుతున్నానని అనిపిస్తోంది. ఇదంతా వయసు ప్రభావం అని మదన్ అన్నాడు. అందుకే 'ఆరా' పట్ల నేను ఆకర్షింపబడటం సహజం అనే భావంలో ఉన్నాను. అయితే ఈ రోజు మాత్రం నాకు ఇంకో స్త్రీ పట్ల కోరిక కలిగింది. ఇప్పుడది నాకు వయసు ప్రభావం అనిపించటం లేదు. నా ప్రేమ, ఆరాధన కూడా కలుషితం అయిపోయాయి. నేను పూర్తిగా పతనం అయ్యాను. ఇది క్షమించరాని నేరం.

మదన్, మధు గురించి చెబుతూ 'ఆరా' మీద అతనికి కాంక్ష మాత్రమే ఉందన్నాడు. ఆ రకంగా చూసినప్పుడు నాకూ- మధుకి ఏ మాత్రం తేడా లేదు. అతను తన కోరికను బహిరంగంగా మిత్రులకి చెబుతున్నాడు. నేను మనసులో దాచుకుంటున్నాను. అంతే తేడా. ఈ రోజు నుంచి ఆరావళిని ప్రేమించటానికి నాకు అర్హత లేదు.

పుస్తకం మూసేసాడు. అప్పుడే గదిలోకి అనంత వచ్చింది.

"సినిమా బాగుందా జయా" అంది

మెల్లగా.

జయంత్ ముఖం మాడిపోయింది.

అంటే అమ్మ తన జేబులో టిక్కెట్ చూసి ఉంటుంది. అది అప్పుడే పారేయాల్సింది. తననితాను తిట్టుకుంటున్నాడు.

"సినిమా చూడటానికి క్లాసులు ఎగ్గొట్టాల్సిన అవసరం ఉందా? అయినా సెలవుల్లో నువ్వు ఆ పని చేయలేదు. కాలేజ్ మొదలు పెట్టిన రోజున ఈ పని చేసావు. నీకు మేం డబ్బులు సంపాదించి ఇస్తే నువ్వేం చేయబోతున్నావో ఇప్పుడు అర్థం అయింది. ఇప్పుడు చెప్పు. నన్ను కూడా ఉద్యోగం చేసి డబ్బులు సంపాదించమంటావా? " జయంత్ మాట్లాడలేదు.

"మాట్లాడు జయా. నీ వయసులో ఎన్నెన్నో అద్భుతాలు చేసిన యువకుల గురించి నేనూ, నాన్న మాట్లాడుకున్నాం. ఎవరికయినా ప్రశ్నించటం మాత్రమే కాదు. జవాబులు చెప్పాల్సిన అవసరం కూడా ఉంటుంది" అంది అనంత.

"ఈరోజు కాలేజ్ కి వెళ్లాలనిపించలేదమ్మా"

"అది వెళ్లక ముందు అనిపించిందా? వెళ్లాక అనిపించిందా? "

"వెళ్లాక అనిపించింది. ఇంటికి వద్దామనుకున్నాను. జేబులు తడువుకుంటే వంద రూపాయల నోటు కనిపించింది"

"నేనే నీ జేబులో పెట్టాను. నీకు ఖర్చులుంటాయనే విషయం నాకు గుర్తుచేసావు కదా!"

తలదించుకున్నాడు

"ఇంకా నువ్వు కాలేజ్ కి వెళ్లాలనుకోవటం లేదా? నువ్వు చదువుకోకపోయినా మేం ఏమీ అనుకోం. నీ జీవితం నీది. మా జీవితం మాది జయా. నేనయితే ఒకటే నిర్ణయానికి వచ్చాను"

జయంత్ తలెత్తి అమ్మ కళ్లలోకి చూసాడు.

"ఇరవై ఒక్క సంవత్సరాలు వయసు వచ్చేవరకు మాత్రం నేనూ, నాన్న నీ బాధ్యతలు తీసుకుంటాం. అప్పటిదాకా నీకు ఎంత డబ్బు కావాలో మాకు చెప్పు. వేలూ, లక్షలూ కావాలంటే మావల్ల కాదు. నాలుగు సంవత్సరాల తర్వాత నీ గురించి మేం పట్టించుకోం. నీ బతుకు నువ్వు బతకాలి. ఇక నుంచి ఏం చేస్తావో నీ ఇష్టం. నీకు డబ్బులు అవసరమయినప్పుడు మమ్మల్ని అడగాల్సిన అవసరం కూడా లేదు. ఓ కాగితం మీద రాసిచ్చినా చాలు" అని అనంత వెళ్లిపోయింది.

జయంత్ కి భూమి బద్దలయి తను అగాధాల్లోకి కూరుకుపోతున్నట్లు అనిపించింది.

★ ★ ★

ఇది జరిగిన నాలుగురోజుల తర్వాత-మదన్ ఇంటికి వెళ్తుంటే దారి కాచి మధు ఆపాడు. అప్పుడతను నడుముకి చుట్టిన సైకిల్ చెయిన్ బయటకు తీసాడు.

"నేను నిన్ను కొట్టాను. నీకు దమ్ముంటే నన్ను కొట్టాలి. పోలీసులతో కొట్టించావు. ఇప్పుడు మళ్లీ కొడతా. ఈసారి పోలీసులు ఏం చేస్తారో చూసుకుందాం" అన్నాడు మధు.

"నీతో నాకు తగాదా లేదు మధూ. మేం పోలీసులకి రిపోర్ట్ ఇచ్చాం తప్ప నిన్ను కొట్టమనలేదు. అయినా నీ భవిష్యత్తుకి మంచిదికాదని పెద్దవాళ్లు చెబితే కేసు విత్‌డ్రా చేసుకున్నాం"

"నేను విత్‌డ్రా అవలేదురా" అంటూ చెయిన్‌తో తలమీద కొట్టాడు. చిన్నగా శబ్దం తలనుండి రక్తం కారటం మొదలు పెట్టింది. అప్పటిదాకా బైకు మీదకూర్చుని మాట్లాడుతున్న మదన్ బండిని వదిలేసాడు. రెండు చేతుల్తో తలపట్టుకున్నాడు.

మధు కసిగా చెయిన్‌తో మదన్‌ని కొడుతున్నాడు. ఆ దెబ్బలకి తట్టుకోలేక మదన్ అరుస్తున్నాడు. అటుగా వస్తున్న కొంత



మంది జనం పరుగులు తీసుకుంటూ రావటంతో మధు పారిపోయాడు. మదన్ రక్తం కారుతుండగా కిందకి జారిపోయాడు.

★ ★ ★

"మంచి పని చేసావు. ముందయితే మందుతాగు" అన్నాడు నరసింహం.

మధు మాట్లాడకుండా ఆలోచిస్తున్నాడు.

"ఏంటి ఆలోచిస్తున్నావు?"

"మదన్‌గాడు ఛస్తాడేమోనని భయంగా ఉంది"

"ఛస్తే చావనీ" అన్నాడు అతను క్రూరంగా.

"అలా అంటావేంటి బాబాయి? అప్పుడు

కేసు అవుతుంది. నువ్వు చెప్పావని కొట్టా నుగానీ ఇప్పుడు పోలీసులు మళ్లీ నన్ను లాకప్‌లో పెడతారని భయంగా ఉంది"

"నీకేం భయం వద్దు. నాలుగు రోజులు నువ్వు ఎవరికీ కనిపించకుండా ఉండు. ఈ లోగా నేను మనవాళ్లందరితో మాట్లాడ తాను"

"నాలుగు రోజులు ఎక్కడ ఉండమం టావు? "

"నీ ఇష్టం వచ్చిన ఊరువెళ్లు. నీకు డబ్బులకి లోటు ఉండదు. సరదాగా ఎంజాయ్ చెయ్యి" అని ఓ అయిదువేల రూపాయలు చేతిలో పెట్టాడు.

అంత డబ్బుని మధు ఎప్పుడూ చూడ

> **కొత్తగాలి...**
>
> **నేటి సినిమాల్లో**
> **అశ్లీలత**
> **కనిపించడం లేదు**
> **అలవాటయి పోయి...!**
>
> – బొండా శ్రీనివాసరావు,
> అద్దంపల్లి, తూ.గో. జిల్లా

లేదు.

అప్పుడు మందుగ్లాసు అందుకున్నాడు. ఓ పెగ్ లోనికి వెళ్లాక అంతకు ముందున్న అపరాధభావం మాయం అయింది.

అదే సమయంలో మధుకి 'ఆరావళి' గుర్తొచ్చింది.

★ ★ ★

రామచంద్ర ముఖం గంభీరంగా ఉంది.

అతనికి ఆసుపత్రిలో మదన్‌ని అలా చూసుకోవటం బాధగా ఉంది. ఇలా జరుగుతుందన్న ఆలోచన రాలేదు. మదన్ తలకి కుట్లు పడ్డాయి. శరీరం కదుములు కట్టింది. ముఖ్యంగా అతని భార్య దుఃఖం ఆగటం లేదు. తమ బిడ్డగురించి వారు ఎన్నో ఆశలు పెట్టుకున్నారు. వాళ్ల కుటుంబంలో అందరూ మంచి వ్యాపారాలు చేస్తున్నారు. రకరకాల వృత్తుల్లో ఉన్నారు. విదేశాల్లో ఉన్నారు.

"ఎందుకు ఆ ఊర్లో పడుంటున్నావు? నువ్వు మా దగ్గరికి వచ్చేయి" అంటున్నారు. దగ్గర్లో ఉన్న వారి గ్రామంలో తాతలనాటి పెద్ద ఇల్లు, నలభై ఎకరాల భూమి ఉంది. ఈ ఊర్లోనూ వ్యాపారాలున్నాయి. మదన్‌ని పెద్ద చదువులకి పంపించాక ఓ నిర్ణయం తీసుకుందాం అనుకున్నాడు.

మదన్‌ని ఛార్టెడ్ ఎకౌంటెంట్‌ని చేయాలని అతని కల. సహజంగా అతని వాళ్లు అందరూ చదువుకున్నారు. ముందు నుంచి తమ పిల్లల్ని వేరే రాష్ట్రాలకు పంపించారు. కొంతమంది బెంగుళూరు, మద్రాసుల్లో హాస్టల్స్‌లో ఉంచి చదివించారు.

మదన్‌ని అంతదూరం పంపించటానికి రామచంద్ర దంపతులు ఇష్టపడలేదు. ఇప్పుడు తాము పొరపాటు చేసామేమో అనుకుంటున్నారు.

దూరంగా ఉంచి చదివించటం వల్ల కూడా ఇలాంటి సమస్యలు రావచ్చునని వారికి అనిపించటంలేదు.

మదన్ స్పృహలో లేడు. మత్తుగా పడుకున్నాడు.

అతనికి స్పృహ వచ్చాక ఎలా రియాక్ట్ వుతాడో అనే అనుమానం కూడా ఉంది. ఈ విషయం తెలిసి బంధువులతో పాటు రామచంద్ర, మిత్రులు, పరిచయస్తులు మదన్‌ని చూడటానికి వస్తున్నారు.

"ప్రాణాలకు ప్రమాదం ఏమీ లేదుగా" అనేది వారి ముందు ప్రశ్న.

"అంటున్నారు.. తలకి బలంగా దెబ్బ తగిలింది కాబట్టి ముందు ముందు ఏవన్నా సమస్యలు వస్తాయేమో చూడాల్సి ఉంది"

అన్నాడు రామచంద్ర.

"ఎందుకయినా మంచిది, విశాఖపట్టణం తీసుకువెళ్తే బాగుంటుంది" అని ఒకరిద్దరు అన్నారు.

"చూద్దాం అవసరమయితే ఎక్కడికన్నా తీసుకువెళ్తాను" అన్నాడు రామచంద్ర.

ఇది ఎవరు చేసారు? ఎందుకు చేసారు? ఈ ప్రశ్నలు మొదలయ్యాయి. ఈసారి పోలీసులకి కంప్లయింట్ ఇవ్వటానికి రామచంద్ర ముందు సిద్ధపడలేదు.

"వాడికి నువ్వు భయపడతున్నావా? "

"ఈరోజు మదన్‌ని కొట్టాడు. రేపు ఇంకొకర్ని కొడతాడు. మనం చూస్తూ ఊరుకోవటమేనా? "

"ముందయితే కేసు బుక్ కావాలి"

ఇలా తలోకరకంగా మాట్లాడుతున్నారు. అందులోనూ చెయిన్లతో దాడి అనే దానిని వారు భరించలేకపోతున్నారు.

అదేరోజు రాత్రి రామచంద్ర లేకుండా అతని వర్గం సమావేశం జరిగింది.

★ ★ ★

రెండు రోజులపాటు రహస్యంగా ఉండటం బాగానే ఉంది మధుకి. హాయిగా కోరుకున్నది తినటం, తాగటం చేస్తున్నాడు. పత్రికల్లో వార్తలు వస్తాయేమోనని చూస్తున్నాడు.

మదన్ మీద తన దాడి గురించి ఎవరూ రాయలేదు. మూడోరోజు అనుమానం వచ్చింది. నరసింహం ఫోన్ చేసినపుడు అడిగాడు.

"నా మీద కేసు బుక్ అయిందా? "

"బుక్ చేసారు. అయినా నువ్వు భయపడాల్సిన అవసరం లేదు"

"ముందు మా ఇంటికి పోలీసులు వెళ్లుంటారు కదా!"

"వెళ్లారు. మా దగ్గర ఉండటం లేదు అని చెప్పారు మీ అమ్మా-నాన్నలు"

"అంటే నా గురించి వెతకటం మొదలు పెట్టి ఉంటారు కదా? "

"నువ్వు ఎక్కడున్నావో నాకు తప్ప ఇంకెవరికీ తెలియదు"

"ఎంతకాలం ఇలా? "

"నేను ఏర్పాట్లు చేస్తున్నా. నేను చెప్పినప్పుడు నువ్వు వచ్చి లొంగిపోదువుగాని. అదే రోజు బెయిల్ వచ్చేలా నేను ఏర్పాటు చేస్తున్నాను"

"కాలేజ్ పోతోంది కదా"

"ఇంక నువ్వు కాలేజ్ గురించి మరచిపో. మనలాంటివాళ్లకి చదువుతో పని లేదు. అవన్నీ ఉద్యోగాలు చేసుకోవాలనుకునే వారికి. ఇక నుంచి మనూర్లో పెద్దవాళ్లకు నువ్వు దగ్గరవుతావు. డబ్బుకి డబ్బు.. పేరుకి పేరు"

"మళ్లీ ఫోన్ ఎప్పుడు చేస్తావు బాబాయి? "

"నేను నీ పనిలోనే బిజీగా ఉన్నాను. వీలు చూసుకుని చేస్తాను" అన్నాడు నరసింహం.

మధుకి తను ఓ విష వలయంలోకి దిగుతున్నట్లు అనిపించింది. అయినా పరిచయం లేని ప్రాంతంలో, పరిచయం లేని మనుషుల మధ్య ఉండటం ఇబ్బందిగా ఉంది.

మరుసటి రోజు అనుమానం వచ్చింది.

ఇలాంటి సమయాల్లో పోలీసులు ముద్దాయి కుటుంబ సభ్యుల్ని నానా రకాలుగా హింసలు పెడతారని విన్నాడు.

ఎప్పట్నుంచో అమ్మా-నాన్నల మాట వినటం మానేసాడు. ఎప్పుడూ వాళ్లని డబ్బులు కావాలని హింసించేవాడు.

'నువ్వు మాకు ఎందుకు పుట్టావురా! మమ్మల్ని కాల్చుకు తినటానికా! నువ్వసలు మాకు పుట్టలేదనుకుంటాం' అన్నాడు మధు నాన్న ఇంక భరించలేక.

అమ్మ మాత్రం ఎప్పటికప్పుడు ఎంతో కొంత డబ్బులు చేతిలో పెట్టి కన్నీళ్ల

పెట్టుకునేది.

'నువ్వు మమ్మల్ని ఉద్ధరించకపోయినా బాధపడం కొడకా. నువ్వు ఏమైపోతావో అని భయంగా ఉంది' అనేది.

'నేను చాలా సంతోషంగా బతుకుతా. నువ్వు బాధపడకు' అని చెప్పేవాడు.

'ఇప్పుడు పోలీసులు అమ్మని కూడా కొడుతున్నారేమో? ముందు తను ఎక్కడ ఉన్నానో తెలియక- పోలీసులు ఏం చేస్తారో అనే భయంతో నిద్ర పోదు, కడుపు నిండా తినదు' అనుకున్నాడు.

ఎప్పుడయితే మందు పుచ్చుకునేవాడో అప్పుడు మాత్రం అమ్మా-నాన్నలు గుర్తొచ్చే వారు కాదు.

★ ★ ★

జయంత్‌ని సూర్య 'నీతో మాట్లాడా'లని తీసుకువచ్చాడు. అప్పటికి జయంత్‌లో బాధ ఉంది. ఇంట్లో అమ్మ మాట్లాడటం మానేసింది. అవసరమైన వరకు మాట్లా డుతుంది. నాన్న కూడా అంతే. తన ఇంట్లో తను ఒంటరిగా ఉంటున్న భావన కలిగింది. అమ్మతో మాట్లాడిన మరుసటి రోజు నుంచి కాలేజీకి వస్తున్నాడు. ఒక్క 'ఆరా' విషయం తప్ప ఇంకెవరి గురించీ పట్టలేదు. ఆ అమ్మాయిని మాత్రం గమని స్తున్నాడు. మదన్ కాలేజ్‌కి రావటంలేదని సూర్య చెప్పాక తెలిసింది.

సూర్యే మదన్ హాస్పిటల్లో ఉన్నాడనే విషయం చెప్పాడు.

అపుడు నిర్ఘాంతపోయాడు.

"ఒకప్పుడు ఈ ఊర్లో ఉద్యమాల కోసం విద్యార్థులు అరెస్ట్ అయ్యేవారు. ఇప్పుడు మధు పరారీలో ఉన్నాడు. మదన్‌ని భయంకరంగా కొట్టాడు"

"ఇంతకు ముందు ఓసారి కొట్టాడు. అప్పుడు పోలీసులు గట్టి వార్నింగ్ ఇచ్చారు" అన్నాడు జయంత్.

"నీకా విషయం తెలుసా? నాతో ఎందుకు చెప్పలేదు? "

"మదన్ చెప్పాడు. అయినా ఇలాంటి వాటిలో ఏం గొప్పతనం ఉందని మనం చెప్పుకుంటాం" అన్నాడు జయంత్.

"మాట్లాడుకోకపోతే ఎలా? ఓ ఆడపిల్ల విషయంలో ఇవన్నీ జరుగుతున్నాయి. అది యువతరం సిగ్గుపడాల్సిన విషయం కదా? "

"ఏ ఆడపిల్ల విషయంలో? " అన్నాడు జయంత్.

"మదన్ నీకు చెప్పలేదా? "

"అప్పట్లో ఓసారి ఆరావళి విషయంలో మధు గురించి చెప్పాడు"

"ఓ ఆడపిల్ల గురించి మాట్లాడుకోవడం బాగుండదు. దానివల్ల ఆ అమ్మాయిని అందరూ ప్రత్యేకంగా చూస్తారు అనుకు న్నాను"

"అసలు ఈ తరంలో ప్రేమకి అర్థం తెలియటం లేదు. ఈ గొడవ ఏ రూపం తీసుకుంటుందో? " అన్నాడు సూర్య.

"అంటే..."

"కులం అనేది ధ్వంసం కావాల్సిన ఈ రోజుల్లో దాన్ని మళ్లీ తెర మీదకు తీసుకు వస్తున్నారు. వామపక్ష ఉద్యమాలు బలంగా ఉన్నప్పుడు ఇలాంటివన్నీ వెనకబడ్డాయి. ముందుముందు ప్రతిదానికీ కులాన్ని ఆపాదిస్తారని భయంగా ఉంది"

"ఉద్యమకారులు భయపడతారా? "

"ఏం.. వాళ్లు మనుషులు కాదా? ఇంతకు ముందు కూడా నీకు చెప్పాను. మన కాలేజ్‌లో నేను చాలామందిని సమస్యల గురించి ఆలోచించమన్నాను. వాళ్లు సినిమాలకి- కులాలకి ఆకర్షింపబడు తున్నారు. నన్నో విచిత్ర వ్యక్తిని చూసి నట్లు చూస్తున్నారు" అన్నాడు.

జయంత్ మాట్లాడలేదు.

"నువ్వోసారి మదన్‌ని చూసిరా" అన్నాడు.

జయంత్ తలూపాడు. అయినా రెండు రోజులు వెళ్లలేదు.

మూడోరోజు ఆసుపత్రికి వెళ్లాడు.

అప్పటికి మదన్ లేడు. అతన్ని బెంగళూరు తీసుకువెళ్లారని తెలిసింది.

అదే రోజు మధు పోలీసులకి లొంగిపోయాడు!

★ ★ ★

మధుకి వెంటనే బెయిల్ వచ్చింది.

అసలు మధు అంత త్వరగా వస్తాడని నరసింహం ఊహించలేదు.

ఆ రాత్రి తన ఇంటి తలుపులు ఎవరో కొడుతుంటే తీసాడు. ఎదురుగా మధు కనిపించాడు.

"నువ్వేంటి ఇలా?"

"అమ్మ గుర్తొచ్చింది" అన్నాడు.

అతనికి తెలియని విషయం ఒకటుంది. నరసింహం ఈ గొడవని విద్యార్థుల గొడవగా కాక, తమ కులం మీద రామచంద్రం కులం గొడవగా చిత్రించాడు. ఇప్పుడు మన వాడిని మనం కాపాడుకోవాలి అన్నాడు. కొంతమంది 'ఇలాంటి వాటిని మేం ఆమోదించం' అని మధ్యలో వెళ్లిపోయారు.

ఇంకొందరికి వ్యక్తిగత కక్షలున్నాయి. మరికొందరికి రాజకీయ ప్రయోజనాలున్నాయి. మా పేర్లు తెర మీదకి రాకూడదు అని వారు ఆర్థికంగా విరాళాలు అందించారు. అది ఎంత మొత్తమో నరసింహానికి మాత్రమే తెలుసు.

మధు కాలేజీ జీవితానికి అప్పుడే తెర పడింది.

అతను నరసింహం చెప్పిన పనులు చేస్తున్నాడు.

బెంగళూరు నుండి మదన్ వచ్చాడు.

జయంత్‌ని తీసుకురమ్మని ఓ మనిషిని పంపించాడు.

అదే జయంత్ మొదటిసారి వారి ఇంటికి వెళ్లటం.

"నేను ఇంక కాలేజీకి రావటంలేదు" అన్నాడు.

## మీనాక్షి.. బుంగమూతి!

అవి 'లైలా-మజ్ను' చిత్ర నిర్మాణం జరుగుతున్న రోజులు. అక్కినేని నాగేశ్వరరావు సారంగపాణి వీధిలో వుండేవారు. ప్రతిరోజూ ఆయన్ని తన కారులో పికప్ చేసుకొని స్టూడియోకొచ్చి రోజంతా రిహార్సల్స్ చేసుకొని పెర్‌ఫెక్ట్‌గా సంభాషణలు, హావభావాలూ పట్టు చిక్కాకనే షూటింగ్‌లో పాల్గొనేవారు భానుమతి. ఆ రోజు షూటింగులో భానుమతి భర్త రామకృష్ణ మంచి హుషారుగా వున్నారు. ఎప్పటిలా అక్కినేనిని తనకార్లో పికప్ చేసుకుని వచ్చారు భానుమతి. సారంగపాణి వీధిముందు చేపల బజారు ఉంది. దాని దుర్గంధంతో ముక్కుపుటాలు చిట్లిపోతున్నై. ఎలాగో భరించి షూట్‌లో పాల్గొన్నారామె. నిజంగా లైలా గెటప్‌లో ఆమె చూపరుల కళ్ళను చెదరగొడుతున్నారు. అందులోనూ పదును దేరిన ఆమె చూపులు మిలమిలమంటూ మెరుస్తున్నాయి. రెప్పార్పకుండా ఆమెనే చూస్తున్నారు రామకృష్ణ.



'మీకు ఓకేనా?' అడిగింది భానుమతి.

'కళ్ళు మాత్రం చేపపిల్లలా తళతళ మెరిసిపోతున్నాయి భానూ!' అన్నాడు రామకృష్ణ సన్నగా.

'చాల్లెండి, ఈ చేపల కంపు. మీ హీరోగారింటికెళ్ళే దార్లో చేపల బజారు. షూటింగులోనూ చేపపిల్ల కళ్లేనా? నన్ను పొగడ్డానికి మీకే ప్రాణీ దొరకలేదా?' అంటూ బుంగమూతి పెట్టారామె.

ఎప్పుడూ నవ్వని రామకృష్ణ పగలబడి నవ్వారు. తలపుకి వచ్చినప్పుడల్లా మిత్రులతో చెబుతూ మనసారా నవ్వుకొనేవారు.

"అదేంటి? ఓ సంవత్సరం వృథా అయి పోతుంది కదా? " అన్నాడు జయంత్

"ఒక జీవితం వృథా అయిపోవటం కంటే ఒక సంవత్సరం వృథా కావటం నయం కదా? " అన్నాడు.

ఆ తర్వాత తను స్టేట్స్ వెళ్లిపోతున్నానని, అక్కడికి వెళ్లాక తన జీవితం గురించి నిర్ణయించుకుంటానని చెప్పాడు.

"మధుమీద నీకు కోపం లేదా? " అన్నాడు జయంత్.

"కోపం ఉండకుండా ఎలా ఉంటుంది? అయితే పగ తీర్చుకోవాలని నాకు లేదు. వాడు కొట్టిన దెబ్బ నాకు ఎప్పుడూ గుర్తుంటుంది జయంత్. నేను నేర్చుకున్న పాఠం కూడా అదే. మనం కళ్లు తెరవాలంటే ఏదో ఒక దెబ్బ తగలాలి. మనకి అవతల చాలా పెద్ద ప్రపంచం ఉంది. ఇప్పుడు దెబ్బకి దెబ్బ. కంటికి కన్ను అంటూ కూర్చుంటే మన బతుకులు ఈ ఊరిని మించి ఎదగవు. అందుకే నేను నా భవిష్యత్ కోసం వెళ్లిపోతున్నాను" అన్నాడు.

"మరి ఆరావళి? "

"ఓ అందమైన జ్ఞాపకం. ఇప్పటివరకు 'ఆరా'ని నేను నా స్వంతం కావాలని అనుకున్నాను. ఆ అమ్మాయికి నా పట్ల ఎలాంటి భావం ఉందో తెలియదు. మా పెళ్లిని ఆ ఇంట్లో ఒప్పుకోరు. మా ఇంట్లోనూ ఓ యుద్ధం చేయాలి. దాన్నిబట్టి నాకు అర్థమైందొక్కటే. ఏదీ వన్ సైడెడ్‌గా ఉండకూడదు. బహుశా మా అమ్మా-నాన్నలు కూడా ఈ ఊర్లో ఉండరు"

"చివరిసారి మన కాలేజ్‌కి రా.. మదన్"

"రావాలని లేదు"

"ఆరావళిని చూస్తే పాత మదన్ లేస్తాడని భయమా? "

"కాదు. ఇప్పుడు 'ఆరా' స్వయంగా వచ్చి నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పినా 'సారీ.. ఇంకో పదేళ్ల తర్వాత ఆలోచిస్తాను' అంటాను. ఈ ప్రేమని సినిమాలకి, సాహిత్యానికి వదిలేస్తున్నాను" అని నవ్వాడు.

"అంటే ఇంక చలంను, మిగతా అందర్నీ మరచిపోతావా? "

"మరచిపోను. కొంతకాలం వారికి దూరంగా ఉంటా. ఇంకొంత మెచ్యూరిటీ వచ్చాక మళ్లీ కొత్తగా చదువుతా. ఎందుకో నీకు మాత్రమే వీడ్కోలు చెప్పాలనిపించింది" అన్నాడు మదన్.

"అది నా అదృష్టం. నన్ను మరిచిపోవద్దు" అన్నాడు జయంత్.

★ ★ ★

"మనం చేస్తున్న పని సరైందేనంటావా? " అన్నాడు తిలక్ అనంతతో.

"ఏ పనయినా సరయిందో కాదో ఫలితాలు వచ్చాక కదా తెలుస్తుంది" అంది అనంత.

నిజానికి ఆమెకి కూడా జయంత్‌తో పట్టీపట్టనట్లు ఉండటం బాధగానే ఉంది. ఏమయినా బాధ లేకుండా ఏ పనీ జరగదు. పిల్లల పుట్టుకలోనే బాధ, సంతోషం కలిసి ఉన్నాయి. పిల్లల పెంపకంలోనూ అవి ఉంటాయి.

కొంతమంది పిల్లల్ని దండిస్తారు. ఇంకొందరు రకరకాలుగా తమ నిరసనను తెలియచేస్తారు. వారందరూ కూడా ఏదోక రకంగా పిల్లల్ని తమ అదుపాజ్ఞలలో ఉంచుకోవాలనుకుంటారు. కనీసం వారికి స్వంత జీవితం ఏర్పడే వరకూ. ఇంకొందరు తాము బతికి ఉన్నంతకాలం పిల్లలు తాము చెప్పిందే వినాలనుకుంటారు.

జయంత్‌తో సమస్య అది కాదు.

తమ జీవిత విధానాన్ని మార్చుకొమ్మంటున్నాడు. అదేదో పరిపక్వతతో చెప్పటం కాదు. ప్రతిరోజూ ఓ కొత్త అనుభవం వస్తుంది. అలా అని దానికి తగ్గట్టుగా మారిపోవాలనుకుంటే క్రమంగా అశాంతి,

అరాచకం చోటు చేసుకుంటాయి.

అందుకే కొన్ని సందర్భాలలో మౌనాన్ని మించిన ఆయుధం ఉండదని అనంత నిశ్చితాభిప్రాయం. అలా అని ఆమె పూర్తిగా జయంత్‌ని అతని స్వేచ్ఛకి వదిలేయాలని అనుకోవటంలేదు. ఇంటర్ మొదటి సంవత్సరం జయంత్ పూర్తిచేయాలి.

అప్పటిదాకా జోక్యం చేసుకోలేదు. జయంత్ ఈ కొద్ది రోజుల కాలంలో ఏ రకంగా ప్రవర్తించినా, తను మౌనంగా గమనించింది.

అదే విషయం తిలక్‌కి చెప్పింది.

తిలక్ కూడా మౌనంగా తలూపాడు.

★ ★ ★

మొదటి సంవత్సరం పరీక్షలు మొదలయ్యాయి.

ఈ మధ్య కాలంలో కాలేజ్‌లోగాని, ఆ ఊర్లోగాని పెనుమార్పులేమీ జరగలేదు. తుఫాన్‌కి ముందు ప్రశాంతతలా ఉంది.

జయంత్ విషయంలోనూ అంతే.

ఎలాంటి నూతన అనుభవాలూ లేవు. ఎప్పటిలానే 'ఆరా' ఊహల్లో బతుకుతున్నాడు. అప్పుడప్పుడూ కాగితపు పూల చెట్ల మధ్య కూర్చునే 'ఆరా'ని రహస్యంగా గమనిస్తున్నాడు.

మదన్ వెళ్లిపోయాడు.

మధు మీద కేసు ఏమయిందో కూడా తెలియటంలేదు.

అతనూ కాలేజ్‌కి రావటంలేదు.

సూర్య ఏవేవో సభలూ, సమావేశాలంటూ ఎక్కడెక్కడికో వెళ్తున్నాడు.

ఇంట్లో పరిస్థితి అలానే ఉంది.

పరీక్షలు యాంత్రికంగా రాస్తున్నాడు. చివరి పరీక్ష అయిపోయింది. ఈ రోజు మాత్రం 'ఆరావళి' వాళ్ల ఇంటిని చూసి తీరాలనుకున్నాడు. ఇకనుంచి నెల రోజులకు పైగా కనిపించదు. కనీసం ఇల్లయినా తెలుసుకుంటే ప్రతిరోజూ ఆ వీధిలోకి వెళ్ళ

## చదివించే కిటుకు!

చతుర ప్రపంచం

చాలా మంది బుక్ ఎగ్జిబిషన్స్‌కో, పుస్తకాల షాప్‌కో వెళ్ళినప్పుడు తమకి నచ్చిన పుస్తకాలు కొంటారు. కానీ వాటిని ఇంటికి తెచ్చాక చదవరు. పుస్తకాల అరలో అవి దుమ్ము కొట్టుకుపోతుంటాయి. అలా చదవని పుస్తకాల రచయితలు ఇలాంటి పాఠకుల వల్ల నష్టపోతుంటారు. తమ పుస్తకాన్ని వారు చదవకపోతే వారు తమ




ఇంకో పుస్తకాన్ని ఎలా కొంటారు? తర్వాతి పుస్తకాలు అమ్ముడవ్వాలంటే అంతకు ముందు కొన్న పుస్తకాలను చదవాలి. అలా జరగకపోతే రచయితలే కాక వాటి ప్రచురణకర్తలు కూడా బాగా నష్టపోతారు.

ఈ సమస్యను పరిష్కరించడానికి అర్జెంటీనియన్ ప్రచురణకర్త ఎటెర్నా సాడెన్షియా, ఓ ప్రకటనల వ్యాపార సంస్థ సహకారంతో పుస్తకాలను కొన్న పాఠకులు వాటిని చదివే ఓ చక్కని మార్గాన్ని కనుగొంది. ఇందుకోసం పుస్తకం అచ్చువేయడానికి ఓ ప్రత్యేక సిరా వాడతారు. రెండు నెలల తర్వాత క్రమేపీ ఆ సిరా వెలిసిపోతూంటుంది. గాలి, వెలుతురు ఆ సిరాని మాయం చేస్తాయి. దాంతో కొంత కాలానికి ఆ పుస్తకంలో కేవలం తెల్ల కాగితాలే మిగులుతాయి!

అర్జెంటీనాలో ఆ ప్రచురణ కర్త పుస్తకాలన్నీ కొన్న తర్వాత ఆ మాయ సిరా వల్ల చదివే వారి సంఖ్య బాగా పెరిగిందట.

## చతుర ప్రవేశిక

### నవంబరు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. జయంత్ ఎవరిని ఆరాధించాడు?
జ.
2. మదన్‌ను కొట్టింది ఎవరు?
జ.
3. అనంత భర్త పేరు?
జ.
4. అభ్యుదయ భావాలుగల విద్యార్థి?
జ.
5. ఆరావళికి వచ్చిన ప్రాణాంతక వ్యాధి?
జ.
6. సత్యవ్రత శాస్త్రికి జ్ఞానపీఠం వచ్చిన ఏడాది?
జ.
7. 'బడదీదీ' నవల ఆధారంగా తీసిన సినిమా?
జ.
8. విమానం ఎక్కాలంటే భయపడే పిల్లాడు?
జ.
9. లాజవంతిని తెల్లదొరలు తార్చాలని చూసింది?
జ.
10. 'సిందూర కెరటాలు' కథ మూల రచయిత?
జ.

పంపినవారి పేరు: ----------------

------------------వయసు (   )

చిరునామా: -----------------

---------------------------

---------------------------

పిన్‌కోడ్:                ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

వచ్చు. ఒకసారి కాకపోతే ఇంకొకసారి కని పిస్తుంది అనుకున్నాడు.

ఆరావళి ఇంటికి బయలుదేరింది.

అప్పటిదాకా ఆమె ఇంటిని మాత్రమే తెలుసులోవాలనుకున్న జయంత్ ఆలోచ నలు మారిపోయాయి.

'ఇప్పుడు తనకు పోటీ ఎవరూ లేరు. ఇకముందు ఇలా ఉండకపోవచ్చు. అందుకే ఈ రోజు ఎలా అయినా తన ప్రేమ గురించి ఆరావళికి చెప్పేయాలి. అందుకు ఆరా ఎలా ప్రతిస్పందించినా ఫర్వాలేదు. ముందు ఎక్స్‌ప్రెస్ చేయటం అనే విషయంలో మాత్రం ఫెయిల్ కాకూ డదు' అనుకున్నాడు.

ఆరావళి వెనకాల నడుస్తున్నాడు.

తననితాను తయారు చేసుకుంటు న్నాడు.

నడుస్తున్నదల్లా ఆరావళి ఆగిపోయింది. అది జయంత్ గమనించే లోపు వెనక్కి తిరిగింది.

జయంత్ ఊహించని ఈ ఘటనకి ఓ శిలలా నిలబడిపోయాడు.

ఆరావళి చిరునవ్వు నవ్విందా? కోపంగా చూస్తోందా?

నా వెనకాల పడటంలో నీ ఆంతర్యం ఏంటి? అసలు నా గురించి నువ్వేమను కుంటున్నావు?

ఇలా ప్రశ్నల మీద ప్రశ్నలు చూపుల తోనే అడుగుతున్నట్లు అనిపించింది. లోపలి మనిషి 'చెప్పెయ్, ఇంతకంటే మంచి అవకాశం రాదు' అని అరుస్తు న్నాడు.

ఇప్పుడు ఆరావళి గుండెల మీద ఏ పుస్త కాల దొంతరా లేదు. ఏ ఆచ్ఛాదనా లేదు. ఖజురహో శిల్పంలా నిలబడిన 'ఆరా' కళ్ల లోకి చూడాలంటే భయం. చెమటలు పడుతున్నాయి.

అలా ఎన్ని క్షణాలు తలదించుకు నిల బడ్డాడో తెలియదు.

మెల్లగా పరిమళం దూరం అవుతోంది. ఎప్పటికో తల ఎత్తి చూసాడు. అప్పుడు వీధి మలుపు తిరుగుతూ 'ఆరావళి'.

★ ★ ★

ఆ రాత్రి...

జయంత్ తన పుస్తకం అందుకున్నాడు.

'నా ప్రేమ పుస్తకపు ఆఖరి పేజీ ఇది. ఇప్పటివరకు 'ఆరావళి' విషయంలో నేను ఎన్నో రకాల భావాలు పొందాను. అందులో నేను సిగ్గుపడిన సందర్భాలున్నాయి. నా మీదే నాకు జాలి కలిగిన సందర్భాలున్నాయి. ఈ రోజు మాత్రం నా మీద నాకు అసహ్యం కలిగింది. కనీసం 'ఆరా' కళ్లలోకి చూడలేని నేను, నోరు తెరిచి ఒక్క మాట మాట్లాడలేని నేను ప్రేమకి ఏమాత్రం తగను. హిమాలయ పర్వతాలను టెన్సింగ్ నార్కేలాంటి వాళ్లు అధిరోహిస్తారు. ఇది సాహసవంతుల రాజ్యం. ప్రేమించటానికయినా, ఏదైనా సాధించటానికయినా నాలో ఉన్న ఏ గుణ గణాలూ సరిపోవు. ఇది యవ్వనపు శకలం!

ఈ భ్రాంతిలో పడి అమ్మా-నాన్నల దగ్గరితనాన్ని దూరం చేసుకున్నాను. ఈ రాత్రితో నేను నా ప్రేమకథకు ముగింపు పలుకుతున్నాను' అని రాసుకుని ఆ పుస్తకం మూసేసాడు. ఆ రాత్రంతా నిద్ర పోటానికి విశ్వప్రయత్నం చేసాడు. నిద్ర రావటంలేదు.

ఈ వయసులో ఓటమిని అంగీకరించటం చాలా కష్టం. అయినా ఇప్పటి వరకు ఆరావళి కులం తెలియదు. ప్రేమకు కులం ఉండదు. స్నేహానికి ఉండదు. కానీ పెళ్లికి మాత్రం ఇంకా కులం కొలబద్దగానే ఉంది.

కుటుంబాలకు కుల పట్టింపులున్నాయి.

'ప్రేమను జయించటమంటే ఓ అబ్బాయి ఓ అమ్మాయి ఒకరినొకరు ఇష్టపడటం కాదు. వారు కలసి జీవించటానికి ఎన్నో అవరోధాలు ఉన్నాయి. బహుశా మదన్ ముందుగా కళ్లు తెరిచాడు. అందుకే ఆరాకి దూరంగా పారిపోయాడు. అది పారిపోవటం కాదు. అలాంటి పని చేస్తే జయంత్ చెయ్యాలి.

ఇంక మధు గురించి ఆలోచించటానికి లేదు. అతనికిది కాంక్ష మాత్రమే. అందులోనూ రాక్షసత్వంతో నిండిపోయినవాడు. అతని పక్కనే ఆరావళిని కాదు, ఏ స్త్రీని ఊహించుకున్నా బాధ కలుగుతుంది' అనుకున్నాడు.

ఇప్పుడు సెలవులు. ఎక్కడికి వెళ్తే బాగుంటుంది?

ముందు ఈ విషయం అమ్మా-నాన్నల్ని అడగటానికే నోరు రాదు. ఇంతకుముందున్న స్వేచ్ఛని తనే పోగొట్టుకున్నాడు. ఏదోకటి చేయాలి అనుకున్నాడు. ఎప్పటికో నిద్ర పట్టింది. ఉదయం లేచేటప్పటికి కళ్లు ఎర్రగా అయిపోయాయి.

అప్పుడు 'అనంత'కి మొదటిసారి అనుమానం వచ్చింది.

పరీక్షలప్పుడు పిల్లలు నిద్రపోరు. టీలు తాగి మరీ చదువుతుంటారు. జయంత్ పరీక్షలయిపోయాక ఏం ఆలోచిస్తున్నాడు? ఇప్పటివరకు జయంత్ గురించిన ఆలోచనల్లో ఇంకో కోణం దాగి ఉంటుందని ఎందుకు అనిపించలేదు? అనుకుంది.

★ ★ ★

జయంత్ సాయంకాలం ఇంటి నుండి బయటకు బయలుదేరాడు.

ఆ రోజు నుండి అమ్మ జేబులో ఎప్పుడూ వంద రూపాయలకు తక్కువ కాకుండా ఉంచుతూనే ఉంది.

ఇప్పటివరకూ జయంత్ వాటిని ఖర్చు చేయలేదు. బలవంతంగా ఖర్చు చేయాల్సిన ఒకటి రెండు సందర్భాలు వచ్చాయి.

అయినా సరే, తన జేబులో డబ్బులున్నా యనే విషయం మనసు నుండి నెట్టేశాడు.

'ఏదో తెలియక ఆవేశంలో అన్నాను. అంతమాత్రాన ఇంత కఠినమైన నిర్ణయం తీసుకోవాలా? ' అనుకున్నాడు.

'అసలు మీరు సంపాదించితే నేను ఖర్చు చేయటం ఏంటి? రేపు నా ఆరా వళిని బయటకు తీసుకువెళ్లాలన్నా- పూలు కొనాలన్నా మీ దగ్గర చెయ్యి చాచాలా? ' అనుకున్నాడు.

ఒక్క 'ఆరావళి' విషయంలోనే తను అనుకున్న పనులు ఏమీ చేయలేకపో యాడు. అమ్మా-నాన్నల విషయంలో మాత్రం మాట మీద ఉన్నాడు.

అలా నడుచుకుంటూ వెళ్తున్నాడు.

అప్పుడు తన ముందు ఎవరో విసురుగా పరిగెత్తుతున్నారు.

ఉలిక్కిపడి ఆగిపోయాడు.

ముందు పరుగులు తీస్తున్న మనిషిలో ప్రాణభయం కనిపించింది.

సరిగ్గా అరనిముషంలోపే ఓ బైక్ మీద ఇద్దరు వ్యక్తులు వేగంగా వెళ్లటం కనిపిం చింది.

ఏదో జరుగుతోంది అనిపించింది జయంత్‌కి.

ఓసారి ముందుకు వెళ్లి చూసివస్తేనో అనుకున్నాడు.

ఇదేదో తగాదా అయి వుంటుంది. మద న్‌ని 'మధు' కొట్టినట్టు.

'అక్కడికి నేను వెళ్లటం ఎందుకు? ఇంటికి వెళ్తాను' అని వెనక్కి తిరిగాడు.

అప్పుడు గాలి మోసుకొస్తోంది ఓ పాటని. ఆగి పాట వినిపిస్తున్న దిశకు మంత్రముగ్ధుడిలా నడిచి వెళ్తున్నాడు.

'ప్యార్ కియాతో డర్నా క్యా - జబ్ ప్యార్ కి యాతో డర్నాక్యా' అని ఓ అమ్మాయి పాడుతోంది.

జయంత్‌కి హిందీ కూడా నేర్పించారు. అతను 'పాకీజా' సినిమాని చూసాడు. అనంత, తిలక్‌లు కావాలని జయంత్‌ని ఆ సినిమాకి తీసుకువెళ్లారు.

కొన్ని సంవత్సరాలయిపోయింది ఆ సిని మాని చూసి. అయినా ఆ పాటలు మన సులో మెదులుతుంటాయి. పాట ఆగిపో యింది. ఇంకేదయినా పాట వినిపిస్తుందే మోనని కొద్దిసేపు వేచి చూసాడు. అలాంటి సవ్వడి లేకపోయేసరికి ఇంటికేసి నడుస్తున్నాడు.

మెయిన్ రోడ్ మీదకి వచ్చాడు.

అప్పుడు గుంపులు గుంపులుగా మను షులు మాట్లాడుకుంటున్నారు. ఇవన్నీ నాకు ఎందుకు? అనుకోలేకపోయాడు. రోడ్డుకి ఓ పక్కన ఆగాడు. వారి దగ్గరికి వెళ్దామంటే సంశయం.

చివరికి ధైర్యం చేసి పక్కనుండి వెళ్తున్న మనిషిని అడిగాడు- "ఏమైందండీ.. అందరూ ఎందుకంత ఆందోళన పడుతు న్నారు? "

"మనూర్లో ఎవర్నో చంపేసారంట"

"ఎప్పుడు? "

"ఓ అరగంట క్రితం అనుకుంటా" అని వెళ్లాడు.

అప్పుడు గుండెలు వేగంగా కొట్టుకో వటం మొదలయింది.

అంటే అతను తన ముందు నుండి పరి గెత్తిన వ్యక్తి అయి ఉంటాడు. "ఎవర తను? ఇంతకుముందు ఎప్పుడూ చూసి నట్లు లేదు" అనుకున్నాడు.

ఇంక అక్కడ ఉండాలనిపించలేదు. చక చకా ఇంటికేసి నడుస్తున్నాడు.

అప్పుడెందుకో మధు గుర్తొచ్చాడు.

★ ★ ★

ఒకటి రెండు రోజులు ఊర్లో చాలామం దికి నిద్రలు లేవు. అతి కొద్దిమంది మాత్రం ఇదొక విషయంగా పట్టించుకో లేదు. వారి పనుల్లో వారు మునిగిపో

యారు.

ఈ హత్యకి చెంది రకరకాలుగా మాట్లాడుకుంటున్నారు. నిజానికి అందరికంటే జయంత్‌ని కలవరపెట్టింది ఈ అంశం. 'నరసింహం' అనే వ్యక్తిని చంపేసారు. ఆ రోజు ప్రత్యర్థులు ఇద్దర్ని చంపాలనుకున్నారు. అందులో మొదటివాడు మధు!

సమయానికి మధు ఎక్కడో ఇరుక్కుపోయాడు. ఈ హత్య చేయటానికి ముందు ఎప్పట్నుంచో ప్రణాళిక తయారయింది. మధు, నరసింహం కదలికలు, అలవాట్లు అన్నీ పరిశీలించారు. ఏ సమయంలో ఎక్కడ ఉంటారు? వారి మధ్య ఎంత మంది ఉంటారు? ఒకరిని చంపటంతో ఆగుతుందా? ఇంకెవరినన్నా చంపాల్సి వస్తుందా?

ఇలాంటివన్నీ చర్చించుకున్నారు.

ముందు నరసింహం అండ చూసుకుని మధు ముదిరిపోతున్నాడు. వాళ్లని ఇలా వదిలేస్తే ముందు ముందు ప్రమాదం అనుకున్నారు. ఇది కొన్ని పెద్ద తలకాయలకి మాత్రం తెలుసు. ఫండింగ్ వచ్చింది. అదే కులానికి చెందిన ఆవేశపరులయిన ముగ్గురు కుర్రాళ్లని ఎన్నుకున్నారు.

ఇద్దరు ఈ పని పూర్తిచేసి అజ్ఞాతంలోకి వెళ్లిపోయారు.

మధువాళ్లకు జాగ్రత్తగా ఉండాలని తెలుసు. మదన్‌ని కొట్టిన తొలిరోజుల్లో అలానే ఉన్నారు. తర్వాత కాలంలో ఇంక మనకి ప్రమాదం లేదని అనుకున్నారు. అందులోనూ మదన్ అమెరికా వెళ్లిన విషయం. రామచంద్ర ఈ ఊరినుండి వెళ్లటానికి చేస్తున్న ప్రయత్నాల గురించి తెలుసు. అందుకని అజాగ్రత్తగా ఉండిపోయారు.

అసలు ఈ విషయం గురించి రామచంద్రకి కూడా తెలియదు. నరసింహం స్వంత కులం నుండి చందాలు వసూలు చేయటం మొదలుపెట్టి, వ్యాపారాలు చేసుకునేవారి దగ్గర వసూళ్లు మొదలుపెట్టాడు. అవి వారికి తలనొప్పిగా మారాయి. ఒకరి నుంచి మరొకరికి పగ, ప్రతీకారాలు పాకుతున్నాయి. దానికి మించి ఆ రెండుకులాల మధ్య ఎప్పటి నుంచో ప్రచ్ఛన్నయుద్ధం జరుగుతోంది.

జయంత్‌కి ఒకటే అనిపించింది.

'చాలామంది అనుకునేటట్లు ప్రతి యుద్ధం వెనకా స్త్రీ ఉంటుందా? ఇప్పటి ఈ హత్యకి మూలం ఆరావళినే కదా!'

## అక్టోబరు - 2012
### చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.

1. **వంగపల్లి శ్రీనివాస్** - నల్లకుంట, హైదరాబాద్
2. **పి. పి. కళ్యాణి** - జేసీపూర్, కాకినాడ
3. **కె. పద్మావతి** - చెట్టుపల్లి, విశాఖ జిల్లా
4. **మల్యాల ప్రసన్న శుభలక్ష్మి** - యమ్మంపేట, హైదరాబాద్
5. **అధికారి గౌరీనాయుడు** - మాదలంగి, విజయనగరం జిల్లా

### సరైన జవాబులు

1. జీవభద్ర
2. తాతారావు
3. నందగోపాల్
4. రాజశేఖర్
5. కృష్ణారావు మాష్టారు
6. సూరిబాబు
7. భీమారావు
8. లిబర్టీ బెల్
9. ఇంగ్లండ్
10. కొంకణి

అనుకున్నాడు.

మనకు సంబంధం లేకుండా- ప్రమేయం లేకుండా మన వెనకాల ఎన్నెన్ని జరగవచ్చునో అంటానికి ఇంతకుమించిన ఉదాహరణ అవసరం లేదు అనుకున్నాడు.

'నరసింహం చావు' అతని అమ్మా-నాన్నల కంటే మధుని ఎక్కువగా కదిలించింది. తను చనిపోయి, నరసింహం బతికివుంటే బాగుండేది అని బోరున ఏడ్చాడు. 'నిన్ను చంపిన వారినెవరినీ వదిలిపెట్టను' అంటూ మనసులో శపథం చేసుకున్నాడు.

మధుఅమ్మ కొడుకుని పట్టుకుని ఏడ్చేసింది.

'ఎందుకురా మనకీ గొడవలన్నీ? కత్తి తిప్పి బతికేవాడు ఆ కత్తికే బలయిపోతాడు' అంది. ఎప్పుడూ కసురుకునే మధు ఈసారి మాట్లాడలేదు. ఇప్పుడు మధు ఆ వర్గానికి నాయకుడయ్యాడు.

★ ★ ★

ఆ రాత్రి....

"జయంత్!" అని పిలిచాడు తిలక్.

గదిలో మంచం మీద పడుకుని తల కింద రెండు చేతులూ పెట్టుకుని ఆలోచిస్తున్న జయంత్ లేచి వచ్చాడు.

అనంత కూడా ఉంది.

"ఏంటి నీ సమస్య? " అన్నారు.

"నాకు సమస్య ఏముంది? " అన్నాడు జయంత్ ఏమీ తెలియనివాడిలా.

"నువ్వు ఎవర్నన్నా ప్రేమిస్తున్నావా? " అంది సూటిగా అనంత.

ఉలిక్కిపడి చూసాడు.

"మనసులో ఉన్నది చెప్పటానికి భయమెందుకు? నువ్వు రాత్రులు ఎందుకు నిద్రపోవటం లేదు. అసలు అద్దంలో నీ ముఖాన్ని ఓసారి చూసుకున్నావా? ఎందుకిలా తయారయ్యావు? ఈ మధ్యకాలంలో నువ్వు దేనిమీదా దృష్టి నిలపలేకపోతున్నావు. మాస్టారు నీ గురించి మాట్లాడారు. రేపు నీకు ఎన్ని మార్కులు వస్తాయో మాకు ముందే తెలుసు. దీనికి పరిష్కారం ఏంటో నువ్వే చెప్పు" అని తిలక్ సుదీర్ఘంగా మాట్లాడాడు.

"నేను ఈ ఊర్లో చదవాలనుకోవటం లేదు నాన్నా" అన్నాడు జయంత్.

"ఏ ఊర్లో చదువుతావు? "

"ఇంకే ఊర్లో అయినా ఫర్వాలేదు. ఇక్కడ మాత్రం చదవను"

"నాన్నని బదిలీ చేయించుకోమంటావా? లేకపోతే నాన్నని వదిలేసి నేను నీ దగ్గర ఉండాలా? "

"ఎవరూ నాతో ఉండనవసరం లేదు. నేను రూమ్ తీసుకుని ఉంటాను. మీరు భరించలేనంటే చదువు మానేస్తాను"

తిలక్, అనంత్‌లు ఒకరి ముఖం ఇంకొకరు చూసుకున్నారు.

"నువ్వు మా దగ్గర ఉన్నప్పుడే ఇన్ని రకాలుగా తయారయ్యావు. మేమిద్దరం లేకపోతే నువ్వు ఎలా మారతావో" అంది అనంత.

"నా మీద నమ్మకం ఉంటే పంపించండి. నువ్వు చెప్పావు కదా.. ఇరవై ఒక్క సంవత్సరాల వరకే మా బాధ్యత అని. మీరు కాదంటే ఈ రోజే ఇంటినుంచి వెళ్ళిపోతాను"

"అదే ఇవన్నీ ఎందుకు చేస్తున్నావు" అని అడుగుతున్నాం.

"అవన్నీ నేను చెప్పలేను నాన్నా... నన్ను క్షమించండి" అన్నాడు.

ఆ తర్వాత మాటలు లేవు.

జయంత్ ఆరావళికి- ఆ ఊరికీ దూరంగా పారిపోయాడు.

★ ★ ★

ఇంటర్ పరీక్షలు అయ్యేవరకూ జయంత్ ఇంటికి రాలేదు. సెలవుల్లో తాతయ్య-నాయనమ్మల దగ్గరకు వెళ్లాడు. అంతకుముందు వెళ్లినప్పుడు ఇల్లూ,

పొలాలూ, తాతయ్యవాళ్ల అనుభవాలు వినటం తప్ప మిగతా విషయాలు అంతగా పట్టించుకోలేదు.

ఈ మధ్యకాలంలో అక్కడి యువకులు కూడా తనలాగే ఉన్నారా? అనే పరిశీలన చేసాడు. కొత్తగా చేరినచోట కూడా అతనికి కొన్ని విషయాలు అర్థం అయ్యాయి.

గ్రామాల్లో యువకులు కూడా మారుతున్నారు. అందరిలోనూ ఓ ఆకర్షణ మొదలవుతుంది. అయితే కేవలం ఒకరో ఇద్దరో తమలోతాము కాలిపోతున్నారు. మిగతా వారికి అదేమంత సీరియస్ విషయం కాదు. ఆడపిల్లలూ అలానే ఉన్నారు. వారికి కూడా కొత్త కొత్త ఆలోచనలు వస్తున్నాయి. కొంతమంది కులాన్ని, మతాన్ని కూడా ఎదిరిస్తున్నారు. ఇంటినుంచి బయటికి వెళ్లిపోతున్నారు.

ఏభయ్యవ దశకానికి ముందు ప్రేమ వివాహాలున్నాయి. వేరే కులాల వారిని చేసుకోవటం ఉంది. అప్పుడున్న వ్యతిరేకత, అప్పుడున్న సంచలనం మాత్రం ఇప్పుడు తగ్గాయి. ముఖ్యంగా ఎవరికి వారు తమ పిల్లల్ని కాపాడుకోవటానికి రకరకాల మార్గాల్ని ఆశ్రయిస్తున్నారు. వాటన్నింటినీ మౌనంగానే పరిశీలించాడు.

ఇంటికి వచ్చాక బయటికి వెళ్లాలనిపించలేదు.

రెండుసార్లు మాత్రం కాలేజ్‌కి వెళ్లాడు. కాగితపు పూలచెట్లని చూసుకున్నాడు. ఆరావళి నడిచి వస్తున్న దృశ్యాలు- చివరిసారి తను ఆరావళి వెంట నడవటం గుర్తొచ్చాయి.

నరసింహం హత్యకేసులో ఇద్దర్ని అరెస్ట్ చేసారు. క్రిమినల్ కేసు ఇంకా హియరింగ్‌కి రాలేదు అనుకున్నారు. మధు కూడా నిశ్శబ్దంగా ఉన్నాడు.

అనంత- తిలక్‌లు జయంత్‌ని 'తర్వాత ఏం చేయదలుచుకున్నావు?' అని అడిగారు. అప్పటిదాకా బీకామ్ చేయాలనుకున్న జయంత్ బీఏ చదువుతానని అన్నాడు.

"ఇప్పుడు బీఏ చదవటం వల్ల పెద్దగా ఉపయోగం ఏముంటుంది? బీకాం చదివితే కనీసం బ్యాంక్ ఎంప్లాయ్‌వి కావచ్చు. ముందు ముందు ప్రమోషన్లు ఉంటాయి" అన్నాడు తిలక్ కాస్త ఆశ్చర్యపడి.

"ఎవరి డబ్బుల్లో లెక్కలు పెట్టటం నాకు ఇష్టం లేదు" అన్నాడు జయంత్. అనంతకి మళ్లీ జయంత్ తాము డబ్బులు సంపాదించలేదని వ్యంగ్యంగా అంటున్నాడనిపించింది.

"నువ్వు మాకు అర్థం కావటం లేదు జయా" అన్నాడు తిలక్.

"ఇందులో అర్థం కాకపోవటానికి ఏమీ లేదు నాన్నా. నేను బ్యాంక్ ఎంప్లాయిగా ఉంటే ప్రతిరోజూ నా కళ్ల ముందు లక్షల రూపాయలు బదిలీ అవుతుంటాయి. అప్పుడు డబ్బు సంపాదించాలనే ఒత్తిడికి నేను గురికావచ్చు. అందుకే నేను ఆ ఉద్యోగం వద్దంటున్నాను."

"మేం నీకు చాలినంత డబ్బు సంపాదించలేదనేగా నీ ఆరోపణ?" అంది అనంత.

"నేను ఆ మాట అడిగినప్పుడు నువ్వేమన్నావో నాకు గుర్తుందమ్మా. అందుకే నా కోసం మీ భావాలు మార్చుకోమనటం లేదు. నేను నేనుగా బతకాలనుకుంటున్నాను"

"బీఏ లిటరేచర్ తీసుకుంటున్నావా?" అన్నాడు తిలక్.

"లేదు. సైకాలజీ తీసుకుంటాను" అన్నాడు.

వాళ్లు మౌనంగా ఉండిపోయారు.

★ ★ ★

జయంత్ బీఏ పూర్తి చేసాడు.

అప్పటికి తిలక్‌కి ఆ ఊరినుండి కాకినాడకి బదిలీ అయింది.

జయంత్ ఎంఏ చేస్తాడని వారు అనుకున్నారు.

మళ్లీ వాళ్లని జయంత్ ఓ దిగ్భ్రమకి గురిచేసాడు.

"నేను ఉద్యోగం చేయాలనుకుంటున్నాను" అన్నాడు.

"ఇప్పుడే ఉద్యోగం అవసరం లేదు జయా. ముందు ఎం.ఎ. పూర్తి చెయ్యి. తర్వాత నువ్వు పిహెచ్.డి. చెయ్యి" అన్నాడు తిలక్.

"అమ్మ నాకు ఇరవైఒక్క సంవత్సరాల వరకు మాత్రమే అవకాశం ఇచ్చింది నాన్నా. నేను పీజీలో చేరితే ఇంకో సంవత్సరం ఎక్కువగా నా బాధ్యతలను మీరు భరించాల్సి ఉంటుంది. అది నాకిష్టం లేదు" అన్నాడు.

అప్పుడు అనంత ఓ కుదుపుకి లోనయింది.

జయంత్ తన మాటల్ని ఇంత సీరియస్‌గా తీసుకుంటాడని ఆమె ఊహించలేదు.

"అంటే నిన్ను ఏమీ అనకూడదా? నువ్వు అమ్మతో మాట్లాడిన సందర్భం ఏంటి? ఆ మాటలు అమ్మ ఎందుకు అనాల్సి వచ్చింది. సైకాలజీ చదివావు కదా! ఆ మాత్రం అర్థం చేసుకోలేకపోయావా? నిన్ను కన్నవాళ్లమీద నీకు ఇంత పట్టుదలా? నువ్వు చెప్పినట్లు మేం ఉద్యోగాలు చేసి, లంచాలు తీసుకుని నీకు కావలసినంత డబ్బులిస్తుంటే నువ్వీమాట అనేవాడివా? " అన్నాడు తిలక్ కాస్త ఉద్వేగంగా.

అనంత జయంత్‌కేసి చూస్తోంది.

"అదే చెబుతున్నాను నాన్నా. అమ్మగాని- మీరుగాని నా జీవితం నేను నిర్మించుకోవాలని ఆ మాట అన్నారు. నేను అందుకు ప్రయత్నం చేస్తున్నాను. ఇది మీమీద పంతమో, పట్టుదలో కాదు. నా మీద నాకు పట్టుదల" అన్నాడు.

"మంచిది జయంత్. నీ ఇష్టాన్ని మేం కాదనం" అన్నాడు తిలక్.

★ ★ ★

జయంత్ కాకినాడలో ఉద్యోగం చూసుకోలేదు.

అతను విశాఖపట్టణం వెళ్లాడు.

అక్కడ ఓ ప్రైవేట్ స్కూల్లో టీచర్‌గా చేరాడు. అలాగే ప్రైవేట్‌గానే ఎం.ఏ. పరీక్షలు రాయాలనుకున్నాడు.

ఇంటర్‌లో తనతో చదివిన ఓ మిత్రుడు ఆంధ్రా యూనివర్సిటీలో పీజీ చేస్తున్నాడు. రామకృష్ణ బీచ్ దగ్గర కలిసాడు. మాటల మధ్యలో ఆరావళి ఇంటర్ తర్వాత ఆ ఊరి నుంచి వెళ్లిపోయిందని చెప్పాడు.

అలాగే సూర్య కూడా వెళ్లిపోయాడన్నాడు.

మూడు సంవత్సరాల్లో ఆ ఊర్లో కొత్త కుర్రాళ్లు వచ్చారని, ఇపుడు వారి సమస్యలు భిన్నంగా ఉన్నాయన్నాడు. నువ్వు పీజీ చేస్తే బాగుండేది అంటే 'చేస్తున్నాను కదా? ' అన్నాడు.

"యూనివర్సిటీ లైఫ్ వేరు కదా!" అన్నాడతను.

"మన జూనియర్ కాలేజ్ మాత్రం మినీ యూనివర్సిటీ కాదా? " అన్నాడు జయంత్ నవ్వుతూ.

అతను కొంచెంసేపు ఆలోచించి "అవున

**కొత్తగాలి...**

**మానవాత్మను మనోవేగంతో**
**స్వప్నలోకాలు తిప్పగల**
**రెక్కల గుర్రం**
**పుస్తకం**

– ఎం.కె. మూర్తి,
సూర్యాపేట

వును. మన ఊర్లో లేనిది ఇక్కడేం లేదు. కాకపోతే ఎక్స్‌పోజర్ వేరే ఉంటుంది. మొహమాటాలు ఉండవు. లార్జర్ దేన్ లైఫ్ అంటారు కదా... ఆ సైజ్‌ని చూడ వచ్చు" అన్నాడు.

ఎప్పుడన్నా అతనే కలుస్తుంటాడు.

జయంత్‌కి స్కూల్ అయిపోయాకా బోల్డంత తీరిక. రకరకాల పుస్తకాలు చదువుతున్నాడు. ఏ మాత్రం రెండు రోజులు సెలవు దొరికినా భీమిలి వెళ్తాడు. అరకు వెళ్తాడు. అక్కడ గిరిజనుల్ని చూస్తాడు. ముఖ్యంగా పిల్లలకి పాఠాలు చెబుతున్నప్పుడు వారిని గమనించటం అపురూపంగా ఉంది.

చిన్నప్పటి నుంచి తను మొదలుపెట్టి ఆపేసిన వాటిలో తనకు ఇష్టమైన వాటిని ఇప్పుడు నేర్చుకోవాలని ఉంది. అందుకే ఓ గిటార్ తీసుకున్నాడు.

తనకు వచ్చే జీతం చాలా తక్కువ. అయినా ఇంటి నుంచి డబ్బులు తెప్పించుకోడు. వాటితోనే గడుపుతున్నాడు. అప్పుడప్పుడు పత్రికలకి ఆర్టికల్స్ రాస్తున్నాడు. ముఖ్యంగా పిల్లలకి పాఠాలు చెప్పటం, ప్రతిరోజు కొత్తగా చెప్పటానికి ప్రయత్నం చేయటం వల్ల కమ్యూనికేషన్ స్కిల్స్ పెంచుకున్నాడు.

ఒకరిద్దరికి ట్యూషన్ చెబుతున్నాడు.

ఇన్ని పనులు చేయగలిగినందుకు అతనికి ఆనందం కలుగుతోంది. అలా మూడు సంవత్సరాలు గడిచిపోయాయి.

★ ★ ★

ఎం.ఏ. పూర్తి చేసాడు.

ఇప్పుడు ఇంగ్లిష్ భాషలో సైతం మంచి పట్టు సాధించాడు.

ఓ ప్రైవేట్ కళాశాలలో జూనియర్ లెక్చరర్ అయ్యాడు.

ఈ రెండు సంవత్సరాల్లోనూ అతను చేసింది- ఆరావళి పర్వతాల్ని దర్శించిరావటం. ఆ అందాలకు ముగ్ధుడయిపోయాడు.

అవి చూస్తున్నంతసేపు ఆరావళి తన పక్కన ఉన్నట్టు అనిపించింది.

ఆ పర్వతాల సముదాయంలో దొంతర్లుగా పేర్చిన పుస్తకాలు - వాటి మీద టిఫిన్ బాక్స్ కనిపిస్తే నవ్వు వచ్చింది.

ఇప్పుడు ఆరావళికి పెళ్లయి ఉంటుంది. ఆమె గురించి ఓ స్నేహితుడిగా ఆలోచించాలి. మదన్ అన్నట్టు 'ఆరా' ఓ అందమైన జ్ఞాపకం.

కొన్ని వందల రోజులు ఆమె చెంతన ఉన్నా ఏ ఒక్కరోజూ ఒక్కమాట మాట్లాడలేదు.

ఆమె ఇల్లు తెలుసుకోలేనంత మహానగరంలో తను ఉండలేదు.

ఒకటి రెండుసార్లు చేసిన ప్రయత్నాలు విఫలం అయ్యాయి.

తమ కాలేజ్‌లో ఆరాని మించిన అందగత్తెలు చాలా మందున్నారు. ఏ రోజూ దృష్టి అటు వెళ్లలేదు.

అదేంటో తను ఇష్టపడిన అమ్మాయి చుట్టూనే వివాదాలు చుట్టుముట్టాయి. ఆమెను ఇష్టపడిన వారందరూ తనకంటే ఏ రకంగా చూసినా ఆయా రంగాల్లో అధికులు.

అయినా తనలానే అందరూ 'ఆరా'ని వదిలి వెళ్లిపోయారు.

నిజానికి 'ఆరా' అనే ఆడపిల్లని తను ఆరాధించి ఉండకపోతే తన జీవితం వేరేగా ఉండేది.

అయితే అది సంపూర్ణ జీవితం అయి ఉండేది కాదు.

ఇప్పుడు మాత్రం సంపూర్ణ జీవితమా? కాదని అతనికి తెలుసు. ఇన్ని రకాల భావ ప్రకంపనలకు దూరం అయి ఉండేవాడు. అది లోటే అనుకుంటాడు.

అప్పుడు ఇంటి నుంచి పిలుపు వచ్చింది

"నువ్వోసారి వస్తే మాట్లాడాలి" అంటూ.

జయంత్ కాకినాడ వెళ్లాడు.

★ ★ ★

అనంత - తిలక్ - జయంత్ కూర్చున్నారు, ఆరు బయట.

"మీ తాతయ్య నీ పెళ్లి చూడాలి అంటున్నాడు జయా. ఒకప్పుడయితే నేనూ, అమ్మా నీ పెళ్లి గురించి నిర్ణయం తీసుకునే వాళ్లమేమో. నీకు ఏం కావాలో మాకు తెలుసు అనుకునేవాళ్లం. ఇప్పుడు నీ బతుకు నువ్వు బతుకుతున్నావు. ఇది మేం స్నేహితులుగా మాత్రమే చెబుతున్నాం. మీ తాత చేసుకోమన్నాడని నిన్ను ఎవరూ బలవంతం చేయరు. నీకు పెళ్లి చేసుకునే వయసు వచ్చింది. నీ అభిప్రాయం చెప్పు" అన్నాడు తిలక్.

జయంత్ మాట్లాడలేదు.

"నువ్వు ఎవర్ని పెళ్లి చేసుకున్నా మాకు అభ్యంతరం లేదు. ప్రేమించి పెళ్లి చేసుకుంటావో, నీ స్నేహితులు చూపిన సంబంధం చేసుకుంటావో నీ ఇష్టం. అంతే కాదు. నాకూ, మీ నాన్నగారికి కులం, మతం, ప్రాంతం పట్టింపులు కూడా లేవు. నువ్వు సంతోషంగా ఉండటమే మాకు కావాలి" అంది అనంత.

"నేను సంతోషంగా ఉంటే చాలా? మీరు సంతోషంగా ఉండనవసరం లేదా?'

"మేం ఎల్లకాలం నీతో ఉండం. చివరిదాకా నువ్వు, నీ భార్య కలిసి ఉండాలి"

"ఇరవై ఒక్క సంవత్సరాలు మీ కొడుకు పట్ల బాధ్యతలు పూర్తి చేసారు. మీకు హక్కులు ఉండవా? "

"నువ్వు కోరినట్లు మేం ఉండనప్పుడు మేం కోరినట్లు నిన్ను ఉండమనే హక్కు మాకు లేదనుకుంటున్నాం"

"నేను అసలు పెళ్లి చేసుకోకుండా ఉంటానంటే మీకు బాధ కలుగుతుందా? "

కొద్ది క్షణాల నిశ్శబ్దం. ముందుగా తిలక్ తేరుకున్నాడు దిగ్భ్రమ నుండి.

"అందుకు కారణం ఉండాలి కదా? "

"పెళ్లి చేసుకోకపోవటం వల్ల సంతోషంగా ఉంటాను అని నేను అనుకోవచ్చు" అన్నాడు జయంత్.

"నాకు తెలిసి రెండు కారణాలుంటాయి జయా. ఒకటి ఎవర్నన్నా ప్రేమించి విఫలం కావటం. రెండోది పెళ్లికి భయపడటం. పెళ్లి చేసుకున్నాక పిల్లలు పుడతారు. నువ్వు అడిగిన ప్రశ్నలకంటే ఎక్కువ ప్రశ్నలు అడుగుతారు. వాటికి సమాధానం చెప్పటానికి నువ్వు భయపడుతున్నావేమో!" అంది అనంత.

జయంత్ మాట్లాడలేదు.

"అంతేకాదు. నాకు పెళ్లిళ్లు చేసుకోని వారు తెలుసు. పెళ్లి చేసుకున్నా పిల్లలు వద్దనుకున్నవారు తెలుసు. వారు కొన్ని ఆశయాల కోసం అలా చేసారు. వ్యక్తిగత ఆనందం కోసమో, వ్యక్తిగత భయాల కోసమో కాదు. మరికొంత మంది మోక్ష సాధన కోసం బ్రహ్మచర్యం పాటించారు. ఇందులో నువ్వు ఏ కోవకి చెందినవాడివో మాకు తెలియదు."

### కొత్తగాలి...

**కరెంటు కోత**
**ఫీజుల మోత**
**అవినీతి రోత**
**సర్కారు ఘనత**

*– నండూరి నాగేశ్వరరావు,*
*బేగం పేట, హైదరాబాద్*

"నేను ముందే చెప్పాను. ఇప్పుడు నా వ్యక్తిగత అభిప్రాయం చెబుతున్నాను. జీవిత పరమార్థం కూడా ఆనందంగా జీవించటం. నీకు పెళ్లి - తోడు లేకుండా ఆనందం కలుగుతుందనుకుంటే అలానే చెయ్యి" అంది అనంత.

తిలక్, జయంత్ కేసి ఉత్సుకతతో చూస్తున్నాడు.

"నాకు కొంచెం సమయం కావాలి" అన్నాడు జయంత్.

★ ★ ★

విశాఖపట్టణం వచ్చాడు.

అమ్మా-నాన్నల మాటల మధ్య చాలా అర్థాలున్నాయి. ముఖ్యంగా వారు ఎలాంటి ఒత్తిడి చేయలేదు. కానీ ఆ మాటల్లో ఎన్నెన్నో ప్రశ్నలున్నాయి. సహజమైన వాటికి దూరంగా పారిపోవటం కాదు, వాటిని ఎదుర్కోవాలి అంటున్నారు.

'ఆరావళి' ప్రేమకు దూరంగా వచ్చాడు.

విఫలం అవుతానని భయం. ఇప్పుడు పెళ్లికి దూరం కావాలనుకుంటున్నాడు. ఇప్పుడిప్పుడే 'పెళ్లి రద్దు కావాలి' అనే వాదనలు మొదలవుతున్నాయి.

దేన్ని రద్దు చేయాలన్నా మహా పోరాటం జరగాలి.

ఈ మధ్య సూర్య పెళ్లి చేసుకున్నాడని ఎవరో చెప్పారు. ఆ అమ్మాయి కూడా ఉద్యమాల్లో పనిచేస్తోందంట.

మదన్ అమెరికాలో వేరే దేశానికి చెందిన అమ్మాయిని చేసుకున్నట్లు తెలిసింది. చివరికి మధు కూడా పెళ్లి చేసుకున్నాడు. ఒకర్ని కాదు ఇద్దర్ని! నరసింహం మర్డర్ కేసుని సాక్ష్యాధారాలు లేక కొట్టేసారంట. అందులో ముద్దాయిలుగా ఉన్న వారూ పెళ్లిళ్లు చేసుకున్నారు.

వారి మీద ఎప్పుడు ఎలాంటి దాడులు

జరుగుతాయో తెలియదు. అయినా కూడా చేసుకున్నారు. వారు చేసుకోవటం విశేషం కాదు. మధుని, ఆ ముద్దాయిల్ని చేసుకున్న ఆడపిల్లలు ధైర్యవంతులు. వారికి అవసరా లుండొచ్చు అయినా క్షణమో గండంలా ఉండే బతుకుని ఎందుకు కోరుకున్నారు?

ఇంతమంది అన్నీ వదులుకోగా 'ఆరా'ని ఆరాధించిన కారణంగా పెళ్లికి తను దూరంగా పారిపోవటం ఏంటి?

అవును. మనిషికి తోడు కావాలి.

'నేను పెళ్లి చేసుకుంటాను' అనుకు న్నాడు జయంత్.

★ ★ ★

పెళ్లి చూపులు ఏర్పాటు చేసారు.

జయంత్ తలదించుకుని కూర్చున్నాడు.

మందాకిని నడిచి వచ్చింది. ఎదురుగా కూర్చోబెట్టారు.

"ఓసారి అమ్మాయిని చూడు బాబు" అన్నారెవరో.

మెల్లగా తలెత్తాడు. అతని చూపులు మెల్లగా మందాకిని ముఖం మీద నుండి గొంతు దగ్గర ఆగిపోయాయి.

ముందు జయంత్‌కి 'మందాకిని' పేరు నచ్చింది.

తన ప్రేమ పర్వతమంత గంభీరమ యితే- పెళ్లి మాత్రం సజీవ నదీప్రవాహం.

'ఆరావళి' పర్వత సముదాయం ప్రపం చంలోనే అత్యంత పురాతనమైనది కావచ్చు ప్రేమ- తోడూ పుట్టుకతోనే మొదలయ్యాయి అనుకున్నాడు. మందా కిని అతనిలో అటు వ్యతిరేకతని గాని ఇటు ఇష్టాన్ని, తన్మయత్వాన్ని గాని కలిగిం చలేదు.

పెళ్లి చూపుల కార్యక్రమం కూడా ముందు వద్దని చెప్పాడు. అనంత, తిల క్‌లు ఒప్పుకోలేదు. 'నిన్ను ఆ అమ్మాయి చూడాలనుకోవచ్చు కదా? 'అన్నారు. అందుకు రాక తప్పలేదు.

"అమ్మాయి నీకు నచ్చిందా? " అని అడ గగానే- "ముందు ఆ అమ్మాయికి నేను నచ్చానో లేదో చెప్పండి" అన్నాడు జయంత్.

"మందాకినికి నువ్వు నచ్చావు" అన్నారు.

"అయితే మీఇష్టం" అన్నాడు జయంత్.

"కావలసింది మా ఇష్టం కాదు, నీ ఇష్టం. ఆ అమ్మాయితో ఉద్యోగం చేయిం చాలనుకుంటున్నావో, నీకు ఇంకేమైనా ప్రత్యేక అభిప్రాయాలుంటే ఇప్పుడే చెప్పు" అంది అనంత.

"అంటే పెళ్లి అయ్యాక నేను గొడవ పెట్టుకుంటానా మీతో? "

"అలా అని కాదు. అన్నీ కాకపోయినా ముఖ్యమైన విషయాలు ముందుగా మాట్లాడుకోవటం మంచిదంటున్నాను"

"నాన్న, నువ్వు ముందుగా మాట్లాడుకు న్నారా? "

"మా కాలం వేరు. మేం మా పెద్దలు చెప్పినట్లు చేసాం. వాళ్లు మాకు మంచి చేస్తారనే నమ్మకం ఉండేది. ఈ కాలం వేరు. ఇప్పటివారు తమ జీవితాలకు చెందిన నిర్ణయాలు తామే తీసుకుంటు న్నారు. మా అదృష్టం ఏంటంటే మా ఇద్దరి భావాలు కలిసాయి" అన్నాడు తిలక్.

"మందాకిని విషయంలో నేను పూర్తి స్వేచ్ఛనిస్తున్నాను. ఆమెని ఇలా చెయ్యి, అలా చెయ్యమని నేను బలవంతం చేయను. తనేం చేయాలనుకుంటే అది చేయవచ్చు నాకు కావాల్సింది తోడు" అన్నాడు జయంత్.

ఇద్దరి పెళ్లి జరిగిపోయింది.

జయంత్ పనిచేస్తున్న కాలేజ్ నుండి కొంతమంది పెళ్లికి వచ్చారు. బాల్య స్నేహితులు ఎవరూ రాలేదు. జయంత్‌కి తను ఇంటర్ వరకు చదువుకున్న ఊరు వెళ్లాలనిపించలేదు.

బంధువులు, నాన్న తరపున కొందరు ఉద్యోగులు వచ్చారు. అమ్మకి చెందిన స్నేహితులు వచ్చారు.

మొదటి రాత్రి...

మందాకిని పాల గ్లాసుతో గదిలోకి నడుచుకుంటూ వచ్చింది. అప్పుడు మొదటిసారి ఆమెను ఆసాంతం చూసాడు. ఆ గదిలో పుస్తకాలున్నాయి. వాటన్నింటిని దొంతర్లుగా పేర్చి మందాకినికి అందించాడు.

ఆశ్చర్యంగా చూస్తోంది.

"వాటిని ఇలా పట్టుకుని ఓసారి నడవగలవా? " అన్నాడు చూపిస్తూ.

తనింకా అలానే చూస్తోంది.

"నువ్వెప్పుడూ బడికి పుస్తకాలు అలా తీసుకువెళ్లలేదా? " అన్నాడు.

"లేదు. బ్యాగ్‌లోనే తీసుకువెళ్లేదాన్ని"

"అందుకేనా నడుం వంగిపోయింది" అన్నాడు అప్రయత్నంగా.

మందాకిని కళ్లు విశాలమయ్యాయి కొద్ది క్షణాలు. ఆ తర్వాత హాయిగా నవ్వింది.

"ఎందుకు నవ్వుతున్నావు? " అన్నాడు.

"నా నడుం వంగిపోయిందని ఇప్పుడు తెలుసుకున్నాను కాబట్టి. అయినా విల్లులా వంగిందా? పాతకాలపు ముసలివారి నడుములా వంగిందా? " అంది చిరునవ్వుతో.

జయంత్ సిగ్గుపడ్డాడు.

"సిగ్గుపడాల్సింది ఆడవారనుకుంటాను"

ఆమె దగ్గర పుస్తకాలు అందుకుని "నేను ఇలా తీసుకువెళ్లేవాడిని. పుస్తకాల మీద టిఫిన్ బాక్స్ ఉండేది" అని చూపించాడు.

అప్పుడు మందాకిని తన తలలోని పూలదండను పుస్తకాల మీద ఉంచింది. తర్వాత వాటిని అందుకుని గదిలో అటూ ఇటూ నడుస్తోంది.

పరిమళం- పరిమళం- ఎప్పటిదో పరిమళం. తొలి యవ్వనపు జ్ఞాపకం- గదంతా పరుచుకుంటోంది.

"నీకు పాటలు పాడటం వచ్చా? "

"రాదు మంచి పాటలంటే ఇష్టంగా వింటాను"

"మంచి పాటలంటే? "

"భావం ఉండేవి, భావాలు వినిపించేవి"

మందాకినిని చూస్తుంటే అమ్మ మాట్లాడినట్లు ఉంది.

"మీకు పాడటం వచ్చా? "

"నేను గిటార్ నేర్చుకున్నాను" అన్నాడు జయంత్.

"ఓ వెన్నెలరాత్రి మీ సంగీతం వింటాను" అంది మందాకిని.

★ ★ ★

నాలుగేళ్లు గడిచిపోయాయి.

జయంత్ వాళ్లకి అబ్బాయి పుట్టాడు.

మరో రెండేళ్లకి అమ్మాయి పుట్టింది.

"మనకి ఇద్దరు పిల్లలు చాలు అనుకుంటున్నాను" అంది మందాకిని.

జయంత్ తలూపాడు.

అనంత- తిలక్‌లు విడిగా ఉంటున్నారు. అప్పుడప్పుడు వచ్చి వెళ్తుంటారు. జయంత్- మందాకినుల కొడుక్కి నాయనమ్మ, తాతయ్యలంటే ఇష్టం. మధ్యలో తీసుకువెళ్తుంటారు. మందాకిని కూడా పీజీ చేసింది. మధ్యలో ఓ రెండు సంవత్సరాలు ఉద్యోగం చేసింది. బాబు పుట్టాక ఉద్యోగం మానేసింది.

జయంత్ డబుల్ ఎమ్.ఎ. చేసాడు. ఆ తర్వాత పి.హెచ్.డి చేసాడు. తర్వాత కాలంలో ప్రొఫెసర్ అయ్యాడు. ఎప్పుడూ ఏదొక పని సృష్టించుకునేవాడు.

సంగీతం- సాహిత్యం- మానవ మనస్తత్వ పరిశీలన- ముఖ్యంగా టెండర్ ఏజ్ తాలూకు ప్రతిస్పందనలు. వాటిమీద ఎప్పటికప్పుడు పేపర్స్ సబ్‌మిట్ చేస్తున్నాడు.

ఒకటిన్నర దశాబ్దంలో పెనుమార్పులు వచ్చాయి. ప్రేమించటం సాధారణం అయిపోయింది. ప్రేమను ఎక్స్‌ప్రెస్ చేయ

టంలో విధానాలు మారిపోయాయి. మడ్డుకత్తులూ- ఏసిడ్ బాటిల్స్ రంగప్ర వేశం చేసాయి. ఓ వర్గం విద్యార్థులు 'కెరీర్'లోకి జారిపోయారు. వారికి పుస్తకాలు అవసరం లేదు. పొయిట్రీ- సంగీతం- లలితకళలు ఏవీ అవసరం లేదు.

విదేశాలు వెళ్లాక అమ్మా- నాన్నల సంపాదన అవసరం లేదు.

చివరికి అమ్మానాన్నలే అవసరం లేదు!

అందం నిర్వచనం మారిపోయింది.

జీవితంలోని ప్రతిఅంశం పెనుమార్పులకి లోనైంది. ఇప్పుడు 'సూర్య'లు తక్కువయ్యారు. కులాల సంగ్రామం మొదలైంది. 'కళ'లోకి కులాలు ప్రవేశించాయి.

దేన్నయినా కొనవచ్చు!

అందం నుండి కీర్తిదాకా. అందులో ఆనందం అనుభూతి చెందుతున్నారు. ఏదొక రూపంలో డబ్బు సంపాదిస్తే చాలు. అదే విలువగా మారిపోయింది.

ఇప్పుడు తమ పిల్లల గురించి జయంత్‌కి భయం పట్టుకుంది. వీళ్లు ఎప్పుడు ఎలాంటి టెంప్టేషన్స్‌కి గురవుతారో అనే ఆందోళన మొదలయింది.

అమ్మా- నాన్నలు తన గురించి ఆరాటపడ్డారేమోగాని- ఇంతగా భయపడలేదు. తన దారికి తనను వదిలేసారు. తనని అనుభవం ద్వారా నేర్చుకొమ్మన్నారు.

ఇప్పుడు అలాంటి పరిస్థితి కనిపించటం లేదు.

మందాకిని, అమ్మా- నాన్న, ఇంకా చుట్టుపక్కలవారి అనుభవాలు ఇన్నున్నా- ఎంత నిరంతర పర్యవేక్షణ ఉన్నా- అరాచకంలోకి చేరిపోతారని భయపడుతున్నాడు.

అలాంటి సమయంలో...

ఆరోజు జయంత్ సెల్‌ఫోన్ మోగింది. పరిచయం లేని నెంబర్

"హలో" అన్నాడు

"జయంత్ గారా? " ఓ స్త్రీ కంఠం.

"అవును. మీరూ...? " అన్నాడు సందేహంగా

"ఆరావళిని"

ఓ క్షణం ఏం వింటున్నాడో అర్థం కాలేదు.

"నేను మీకు గుర్తున్నానా? "

'అయ్యో! ఎలా మరచిపోతాను. మనం రేపు ఉండకపోవచ్చు. ఆరావళి పర్వతాలు ఉంటాయి' అనాలనుకున్నాడు. 'ఆరా' ముందు ఎప్పుడూ నోరు పెగలదు.

"జూనియర్ కాలేజ్‌లో మనందరం ఇంటర్ చదువుకున్నాం"

"అవునవును. మీరు గుర్తున్నారు. అవును నా నెంబర్ మీకు ఎలా తెలిసింది? "

"తెలుసుకున్నాను. అప్పటి మిత్రుల్ని కలవాలనిపించింది"

"మీరిప్పుడు ఎక్కడ ఉంటున్నారు"

"హైదరాబాద్‌లో"

జయంత్ ఎగ్జయిటవుతున్నాడు.

"ఇంకొంతమంది ఫ్రెండ్స్‌ని పిలుస్తున్నాను. మనందరం అరకు వ్యాలీలో కలుసుకుంటున్నాము"

"నేను విశాఖలోనే ఉంటున్నాను. ఆ ఏర్పాట్లు నేను చూస్తాను"

"అవసరం లేదు జయంత్. అన్ని ఏర్పాట్లూ జరిగిపోయాయి"

"ఆదివారంనాడు మనందరం కలుసుకుంటున్నాం. మీరు వస్తున్నారా? "

"తప్పకుండా వస్తాను" అన్నాడు ఉద్విగ్నంగా.

★ ★ ★

మందాకినిని- పిల్లల్ని కూర్చోబెట్టాడు జయంత్.

"మా చిన్ననాటి స్నేహితులం అరకులో కలుసుకోబోతున్నాం" అన్నాడు.

"మేం కూడా రావచ్చా? " అంది జయంత్ కూతురు.

"ఇది కేవలం మా మిత్రుల సమావేశం. అయినా మా తరం వేరు. మీ తరం వేరు. మా జ్ఞాపకాలూ, మా మాటలూ మీకు ఉత్సాహాన్నివ్వవు"

"అమ్మని తీసుకువెళ్తున్నారా? " అంది.

"లేదు. లేదు. నన్ను మాత్రమే రమ్మని పిలిచారు"

"అక్కడ అందరూ కలిసి 'మందు' తాగు తారేమో. అమ్మ వద్దులే" అన్నాడు జయంత్ కొడుకు.

ఒక్కసారిగా జయంత్ ముఖం వివర్ణం అయిపోయింది.

అతను మందు తాగడు కానీ, తన కొడుక్కి అలాంటి ఆలోచన ఎందుకు వచ్చింది? అంటే వాడు...

"ఎందుకలా అనుకుంటున్నావు. చిన్న నాటి స్నేహితుల మధ్య ఇంకెవరూ ఉండ కూడదనుకున్నారేమో- ఏమంటావ్ జయంత్? " అంది మందాకిని.

"అంతే అయుంటుంది" అన్నాడు అదోలా కొడుకుని చూస్తూ.

'అసలు ఈ విషయం వీళ్లకి చెప్పకుండా ఉండాల్సింది' అనుకున్నాడు

★ ★ ★

అరకులోయ...

అక్కడ లావణ్యా- మదన్, సతీష్- రజని, ఆరావళి- ఆమెభర్త ఉన్నారు.

మదన్ స్టేట్స్ నుండి ఎప్పుడు వచ్చాడో తెలియదు. అదే అడిగాడు.

"ఆరావళి ఫోన్ చేసింది. మిగతా కార్యక్రమాలన్నీ రద్దు చేసుకుని వచ్చేసా" అన్నాడు.

"తెలుగు బాగానే మాట్లాడుతున్నావు!" అన్నాడు జయంత్ ఆశ్చర్యంగా.

"తెలుగువాడినే కదా? " నవ్వాడు మదన్.

అందరిలోనూ మార్పు వచ్చింది. కొంత మంది లావయ్యారు. మదన్‌కి బట్టతల వచ్చింది. ఇంకొందరు రంగులు వేసినా బయటకు కనిపిస్తున్న తెల్లటి జుత్తుతో ఉన్నారు.

ఆరావళిలో పెద్ద మార్పు లేదు.

ఆమె భర్త గలగలా మాట్లాడుతున్నాడు.

'నాకంటే అందంగానే ఉన్నాడు' అనుకున్నాడు జయంత్. ముందు 'అతను అదృష్టవంతుడు అనిపించింది. ఇప్పుడు ఆరావళి అదృష్టవంతురాలు' అనుకున్నాడు.

అందరూ భోజనాలకు కూర్చున్నారు.

ఆరావళి స్వయంగా కొన్ని వంటకాలు చేసింది. వాటిని కొసరి కొసరి వడ్డిస్తూ జయంత్ కళ్లలోకి చూసింది. "చాలు చాలు" అన్నాడు జయంత్.

ఎంత నిగ్రహించుకుందామన్నా ఆమె గుండెల్ని కొద్దిక్షణాలు కళ్లు వెతుక్కున్నాయి.

అందరూ కాసేపు విశ్రమించారు. క్రమంగా చీకట్లు అలముకున్నాయి. దాంతోపాటు చంద్రుడు ప్రకాశవంతంగా వెలిగిపోతున్నాడు. మాటలు- మాటలు- జ్ఞాపకాల దొంతరలు కదులుతున్నాయి.

అప్పుడు మదన్ అన్నాడు.

"ఈ సమయంలో మాటలకంటే పాటలు బాగుంటాయేమో!"

"అయితే 'ఆరా'నే పాడుతుంది"

## కొత్తగాలి...

**ఆత్మస్తుతి**
**వినాశనం**
**ఆత్మవిమర్శ**
**వికాసం**

– అంబటి వెంకట శివారెడ్డి,
యర్రగుంట్ల, కడప జిల్లా

"ఆరావళి గారికి పాటలు వచ్చా?" అన్నాడు జయంత్.

"ఒక్క పాటలేంటి- అమ్మాయిగారిలో చాలా కళలున్నాయి. ఏదీ ఎవరికీ తెలియకుండా దాచుకుంది"

జయంత్‌కి తన నోట్ బుక్ గుర్తొచ్చింది. ఇన్ని సంవత్సరాలుగా ఆ పుస్తకం గురించి ఎవరికీ తెలియదు.

అలానే 'ఆరా హృదయంలో చాలా రహస్యాలున్నాయన్న మాట!' అనుకున్నాడు.

అందరూ 'ఆరా'ని బలవంతం చేసారు పాట పాడమని. అప్పుడు పాడింది.

"కొండగాలి వీచింది... గుండె ఊసులాడింది..."

జయంత్ ఇంక అరకులో లేడు. అలా పరుగులు తీసుకుంటూ ఆ వీధిలోని ఇంటి బయట ఆగాడు. ఇదేపాట.. అప్పుడూ ఇదే స్వరం! వయసు తీసుకొచ్చిన స్వల్ప మార్పు. రెండుసార్లు ఆ ఇంటిదాకా వెళ్లాడు. అక్కడ ఆరావళి ఉంటుందని తెలియదు. ఎంత దురదృష్టం- ఎంత అన్యాయం...

"ఇంక్కొక్కపాట..." ఎవరో బతిమాలుతున్నారు.

"ఇంకెవరన్నా పాడండి" అంటున్నాడు ఆరా భర్త.

"ఇంకొక్కటి మాత్రం పాడుతున్నాను. తర్వాత బలవంతం చేయవద్దు" అంది.

అందరూ తలలూపారు.

"ప్యార్‌కియాతో డర్నాక్యా- జబ్ ప్యార్‌కియాతో డర్నాక్యా" లోయంతా ప్రతిధ్వనిస్తోంది. మదన్ కళ్లు చిన్నబోయాయి. ఆ పాట ద్వారా తననే ప్రశ్నిస్తోందా? అని జయంత్ అనుకున్నాడు. అక్కడున్న వారందరూ- ఎవరికివారు తమ యవ్వనంలోకి జారిపోయారు.

ప్రతి మనిషికీ ఓ ప్రేమకథ ఉంటుంది. కాలం వాటిని మెదడు పొరల్లో కప్పేసినా ఇలాంటి సందర్భాలు వెలికి తీస్తాయి.

ఆ రాత్రి ఆరావళి మాట్లాడింది.

"మీ అందరూ గుర్తొచ్చేవారు. మన తొలి కళాశాల గుర్తొచ్చేది. పాత మిత్రులందరినీ కలుసుకునే కార్యక్రమం ఎవరైనా తీసుకుంటారనిపించేది. కొంతకాలం ఎదురు చూసాను. ఆ పని నేనే ఎందుకు చేయకూడదనిపించింది. కనీసం కొందరినైనా కలుసుకోవాలనుకున్నాను. లావణ్యని అడిగాను. ఆ ప్రయత్నంలో మీరు కనిపించారు. జీవితంలో నేను ఈ రోజుని మరిచిపోలేను" అంది ఉద్వేగంగా

"వచ్చే సంవత్సరం నేను న్యూయార్క్‌లో మన సమావేశం ఏర్పాటు చేస్తాను. మీ అందరూ నా అతిథులూ-స్నేహితులు. ఇంకొంత మందిని కూడా మీరు పోగుచేయండి. మొత్తం కార్యక్రమాన్ని నేను స్పాన్సర్ చేస్తున్నాను" అన్నాడు మదన్.

జయంత్ ఆరావళిని చూసాడు. ఆ కళ్లలో ఎక్కడో తడి. అది ఆనందం నుంచి ఆవిర్భవించినదై వుంటుందనుకున్నాడు.

★ ★ ★

'ఆరావళి' అందరికీ తను చిత్రించిన 'ఆరావళి' పర్వతాలను, మరికొన్ని ప్రకృతి దృశ్యాలను కానుకగా అందించింది. జయంత్‌కి మాత్రం 'గురుశిఖర'ని చిత్రించిన కానుక అందించింది. అందరూ వీడ్కోలు తీసుకున్నారు.

లావణ్య మాత్రం 'విశాఖ'లో బంధువులని కలవటానికి ఆగిపోయింది. జయంత్- లావణ్య మిగిలారు.

"మధు గురించి మీకేమన్నా తెలుసా లావణ్యగారు? " అన్నాడు జయంత్.

"మీకు తెలియదా? నాలుగు సంవత్సరాల క్రితం అతన్ని చంపేసారు"

జయంత్ మనసు అదోలా అయిపోయింది.

లావణ్య ముఖం మరింత కాంతిహీనంగా మారటం గమనించి "ఏమైంది లావణ్యా? " అన్నాడు అప్రయత్నంగా.

"ఈ విషయం మీకు చెప్పవద్దు అంది. అయినా నేను చెప్పకుండా ఉండలేకపోతున్నాను. ఆరాకి బ్రెస్ట్ క్యాన్సర్"

పర్వతాలు కూలుతున్న భావన. సముద్రాలు పొంగుతున్నాయి.

"రేపే ఆపరేషన్" అంది గాద్గదికంగా.

"నాకే చెప్పవద్దందా? "

"ఎవరికీ చెప్పవద్దని అంది. ముఖ్యంగా మీకు!"

అప్పుడు ఏడుస్తున్నాడు జయంత్. లావణ్య కంగారు పడిపోయింది.

"ఊరుకోండి.. షీకెన్ సర్వైవ్... మనందరం న్యూయార్క్‌లో స్వేచ్ఛా ప్రతిమ దగ్గర కలుసుకుంటాం" అంటూ ఓదార్చుతోంది.

జయంత్‌కి దుఃఖం ఆగటం లేదు

"లావణ్యా! క్యాన్సర్ ఆరాకి కాదు, ప్రకృతికి. ఈ సమాజానికి పట్టింది" అంటూ ఏడుస్తున్నాడు చిన్న పిల్లవాడిలా!

★ ★ ★

ఆ రాత్రి జయంత్ చాలా అసహనంగా ఉన్నాడు. లావణ్య రేపు ఉదయం ఫోన్ చేస్తాను అని చెప్పింది.

ఎంతకూ నిద్ర రావటం లేదు. ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా అని చూస్తున్నాడు. తమగది బయటకు వచ్చాడు.

కూతురుగదిలో లైట్ కనిపించింది. మెల్లగా వెళ్లాడు.

తను సీరియస్‌గా చదువుతోంది.

జయంత్ ఆ పుస్తకంకేసి చూడగానే బిగిసిపోయాడు. అది తన నోట్ బుక్!

జయంత్ కూతురి పేరు ఆరావళి! ©

# పరిఢవిల్లిన సంస్కృత సాహితీ సౌరభం



సత్యవ్రత శాస్త్రి

**సంస్కృతాధ్యాపనంలో అంతర్జాతీయ ఖ్యాతి గడించిన సత్యవ్రత శాస్త్రి వివిధ విశ్వవిద్యాలయాలలో ఆచార్యునిగా, ఉపకులపతిగానే కాకుండా మహాకవిగా, అసాధారణ విమర్శకునిగా అందించిన సేవలు అగణ్యాలు. సంస్కృత భాషకు ప్రప్రథమంగా జ్ఞానపీఠ పురస్కారం సముపార్జించిన ఘనత ఆయనదే. 2006 సంవత్సరానికి ఈ విశిష్ట పురస్కారాన్ని కొంకణి భాషకు జ్ఞానపీఠ పురస్కారాన్ని మొదటిసారి సమకూర్చిన రవీంద్రకేల్కర్‌తో సంయుక్తంగా స్వీకరించడం విశేషం.**

సత్యవ్రతశాస్త్రి 1929 సెప్టెంబరు 29న జన్మించారు. స్వస్థలం పంజాబు రాష్ట్రం. మాతృభాష హిందీ. తండ్రి సుప్రసిద్ధ పండితులు చారుదేవ శాస్త్రి. ఆనువంశికంగా సత్యవ్రత శాస్త్రికి పాండితీ ప్రకర్ష సంక్రమించింది. ప్రాథమిక దశలో విద్యాభ్యాసం తండ్రి వద్దనే. శాస్త్రికి బాల్యంలోనే సంస్కృత భాషా పాటవం, సాహిత్యాభిరుచి అబ్బాయి. తండ్రి తన కుమారుణ్ని ఉన్నత సంస్కృతాధ్యయనం కోసం వారణాసికి పంపారు. అక్కడ మహాపండితులు పండిత సుఖదేవ్ వద్ద, పిమ్మట డా. సిద్దేశ్వర్ వర్మ వద్ద దీక్షతో శాస్త్రి సంస్కృతం అభ్యసించారు. అనంతరం పంజాబీ విశ్వవిద్యాలయం నుంచి సంస్కృతంలో బి.ఏ. (ఆనర్స్), ఎం.ఏ. పట్టాలు స్వీకరించారు. సంస్కృతంలో విస్తృత పరిశోధనలు జరిపి బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం నుంచి పిహెచ్.డి. పట్టా అందుకున్నారు. వెంటనే ఢిల్లీ విశ్వవిద్యాలయం నుంచి పిలుపు వచ్చింది. అక్కడ సంస్కృత శాఖలో అధ్యాపక పదవి స్వీకరించారు. ఈ అధ్యాపనం అకుంఠితంగా నాలుగు దశాబ్దాల పాటు ఆ విశ్వవిద్యాలయంలోనూ, ఇతర చోట్లా కొనసాగింది. ఢిల్లీ విశ్వవిద్యాలయంలో ఆచార్యునిగా, సంస్కృత శాఖాధ్యక్షునిగా, ఆర్ట్స్ ఫ్యాకల్టీ డీన్‌గా పనిచేశారు. గొప్ప విద్యావేత్తగా పరిఢవిల్లిన సత్యవ్రత శాస్త్రిని ఎన్నెన్నో ఉన్నత పదవులు వరించాయి. ఒడిశా రాష్ట్రం పూరిలోని శ్రీ జగన్నాథ సంస్కృత విశ్వవిద్యాలయం ఉపకులపతిగా అనన్య సామాన్య కృషి చేశారు. ఆయన ప్రతిభా వ్యుత్పత్తులు పలుదేశాల విశ్వ విద్యాలయాధికారుల దృష్టిని ఆకర్షించాయి. సంస్కృత భాషాభిమానం కారణంగా ఎన్నో విశ్వవిద్యాలయాల్లో సందర్శక ఆచార్యునిగా విశిష్ట సేవలందించారు. బ్యాంకాక్‌లోని చులలాంగ్ కొరన్, శిల్పకొరన్ విశ్వవిద్యాలయాలు, థాయిలాండ్‌లో నాంగ్‌ఖాయ్‌లోని నార్త్ఈస్ట్ బుద్ధిష్ట్ విశ్వవిద్యాలయం, జర్మనీ దేశం తుబిన్‌జెన్ విశ్వవిద్యాలయం, బెల్జియం దేశం ల్యువెన్‌లో వున్న క్యాథలిక్ విశ్వవిద్యాలయం, కెనడాదేశం ఎడ్మంటన్‌లో వున్న ఆల్బర్టా విశ్వవిద్యాలయాలకు ఆయన సేవలందించారు. థాయిలాండ్ రాకుమారి మహాచక్రి సిరింధరన్, సత్యవ్రతశాస్త్రి శిష్యురాలిగా సంస్కృతంలో ఎం.ఏ. పట్టా అందుకోవడం విశేషం. ఆయన

యూరప్, ఉత్తర అమెరికా, ఆగ్నేయాసియాలోని అనేక విశ్వవిద్యాలయాలలో నూటికి పైగా ప్రత్యేక ప్రసంగాలు చేసి, తన పాండితీగరిమతో శ్రోతల్ని ముగ్ధులు గావించారు. ఎన్నో జాతీయ, అంతర్జాతీయ సాహితీ సమ్మేళనాలలో పాల్గొన్నారు. సంస్కృతంలో అపార పాండిత్యం సముపార్జించినా, ఆయన ఆ భాష పట్ల ఆధునిక భావాలు పెంచుకున్న అభ్యుదయవాది. ఒక సందర్భంలో ఆయన వ్యక్తపరచిన ఈ అభిప్రాయాలే ఇందుకు తార్కాణాలు- సంస్కృతం అమర భాష. అది సజీవ మహాస్రవంతి. దానిని మృతభాషగా కొందరు భావించడం దోషపూరితం. ఎందుచేతనంటే లక్షలాదిమంది ఇప్పటికీ సంస్కృతాన్ని నేర్చుకుంటున్నారు. ఎప్పటికప్పుడు ఆ భాష మారిన పరిస్థితులకు అనుగుణంగా తనలో కొత్తపదాలు చేర్చుకుంటున్నది. పూర్వమే పండితులు బందీ, కలమ్ వంటి పర్షియన్ పదాలు స్వీకరించారు. ఈనాడు వైజ్ఞానిక రంగంలోనూ తన ఆవిష్కరణలకు తగినట్లుగా 'స్టెతస్కోప్'ను 'ఉదశ్రవణ యంత్రం', 'కంప్యూటరును' 'సంగణక యంత్రం' అంటున్నారు.

సత్యవ్రత శాస్త్రి సాహితీ కృషి బహురూప విలసితం. పన్నెండో ఏటనే ఆయన తొలికవిత ప్రచురితమయింది. అప్పటినుంచి సాహితీ ప్రస్థానం నిరంతరంగా సాగింది. 'రామకీర్తి మహాకావ్యమ్' అనేది పేరే సూచిస్తున్నట్లు సాటిలేని మహాకావ్యం. పండితలోకం ప్రశంసలందుకున్న ఈ కృతి అనేక ముద్రణలు పొందడం, దీనిపట్ల పాఠకుల ఆదరణకు నిదర్శనం. 'బృహత్తరమ్ భారతమ్' ఆయన కావ్యనిర్మాణ దక్షతను నిరూపిస్తుంది. బృహత్తర భారతదేశ వైభవోన్నతికి ఇది మణి దర్పణం. గౌతమ బుద్ధుని చరిత్రలో 'శ్రీ బోధిసత్త్వ చరితమ్' సంస్కృత సాహిత్యంలో మైలురాయిగా భాసిస్తోంది. 'సర్మన్యాదేశః సుతరాం విభాతి' మరో విలక్షణ కావ్యం. జీవిత చరిత్రను మహాకావ్యాలుగా తీర్చిదిద్దడంలో సత్యవ్రతశాస్త్రి ప్రతిభ అసామాన్యం. 'ఇందిరాగాంధీ చరితమ్', 'శ్రీగురుగోవింద చరితమ్' ఇందుకు ప్రబల ఉదాహరణలు. అదేరీతిగా దేశ చరిత్రకు సహితం కావ్య గౌరవం సమకూర్చిన కవిశేఖరుడాయన. థాయిలాండ్ వైభవాన్ని చిత్రించే కావ్యం 'థాయ్‌దేశ విలాసమ్'. లేఖల రూపంలో కావ్య సృజనకు శ్రీకారం చుట్టిన కావ్యం 'పత్రకావ్యమ్'. సంస్కృత సాహిత్యం నుంచి ఏరి కూర్చిన వేయి ముత్యాలహారం 'సుభాషిత సహస్రమ్' సత్యవ్రత శాస్త్రి విమర్శన గ్రంథాలు అత్యంత ప్రామాణికాలు. 'కవి సృజనలో పదాలు అలవోకగా జాలువారుతాయి. వాటి ఔచిత్యాన్ని నిర్ధారించే పని విమర్శకుడిది' అని అంటారాయన. రామాయణాన్ని భాషాశాస్త్ర దృష్టితో అనుశీలించిన ఘనత ఆయనదే. అదే 'ది రామాయణ - ఎ లింగ్విస్టిక్ స్టడీ'. 'యోగవాసిష్ఠమ్' గ్రంథంలోని భాషను, కవితను విశ్లేషించారు. మరొక విమర్శన గ్రంథం 'కాళిదాసు' కృతిలో ఆధునిక సంస్కృత సాహిత్యంలో ఆ మహాకవి ప్రాభవాన్ని వింగడించి చూపారు. 'ఎస్సేస్ ఆన్ ఇండోలజీ' ఆయన విద్వత్ వైదుష్యాన్ని ప్రతిబింబిస్తుంది. మ్యాక్డొనాల్ ఆంగ్లకృతిని 'వైదిక వ్యాకరణమ్' పేరుతో సంస్కృతంలోకి అనువదించారు.

సత్యవ్రత శాస్త్రి విమర్శన, పరిశోధన కృషి ఇంకా సాగుతూనే వుంది. ఉదాహరణకు ప్రస్తుతం థాయిలాండ్‌లోని సంస్కృత శాసనాలు, హిందూ దేవాలయాలపై పరిశోధన జరుపుతున్నారు. ఆగ్నేయాసియాలోని సంస్కృత పదావళి, రామకథపై గ్రంథరచనలో నిమగ్నమయ్యారు. ఆయనిప్పుడు న్యూఢిల్లీలో నివసిస్తున్నారు.




ఇప్పటివరకు సత్యవ్రత శాస్త్రి దేశ, విదేశాలలో నలభై ఏడు పురస్కారాలు, సన్మానాలు స్వీకరించారు. వాటిలో కొన్ని- సాహిత్య అకాడమీ, భారతీయ భాషా పరిషత్తు, శిరోమణి సంస్కృత సాహిత్యకార్, పండిత జగన్నాథ్ పద్యరచన, కాళిదాసు, ఢిల్లీ సంస్కృత అకాడమీ, వేదాంగ పురస్కారాలు. మహామహోపాధ్యాయ, వాచస్పతి, శాస్త్ర చూడామణి, దేవవాణీరత్న వంటి బిరుదులందుకున్నారు. పెక్కు రాష్ట్ర ప్రభుత్వాల నుంచి సన్మానాలు పొందారు. చాలా విశ్వవిద్యాలయాలు గౌరవ డాక్టరేట్లు ఇచ్చాయి. భారత ప్రభుత్వం 'పద్మశ్రీ' ప్రదానం చేసింది. వీటి పరాకాష్టగా జ్ఞానపీఠ పురస్కారం లభించింది.

సంస్కృత జగతి గర్వించ తగిన గొప్ప సాహితీవతంసుడు సత్యవ్రతశాస్త్రి.

**– గోవిందరాజు రామకృష్ణారావు**

మారిషస్ పెద్దకథ

- మోహన్‌లాల్ బ్రిజమోహన్

# సిందూర కెరటాలు

స్వేచ్ఛానువాదం : శీతంరాజు పద్మావతి

"బాబా! మీరు ప్రతిరోజూ ఈ సముద్ర తీరానికి వచ్చి, ఉవ్వెత్తున ఎగసిపడే కడలి తరంగాలను చూస్తూ మౌనంగా కూర్చుని ఉండటాన్ని చాలా రోజులుగా గమనిస్తున్నాను"

మెత్తని ఇసుకలో నా పక్కన కూర్చుంటూ అన్నాడా అబ్బాయి.

"అవును బాబూ! వాటికీ నాకూ అవినాభావ సంబంధం ఉంది. హోరు హోరుమని హోరెత్తుతూ అవి చేసే రొదతో పాటు వినవచ్చే పిలుపుల కోసం అడుగులు తడబడుతున్నా సరే వడివడిగా ఇక్కడికి నడిచి వచ్చేస్తాను"

"అబ్బో! అబ్బో! ఈ వయసులో కూడా మిమ్మల్ని ఉన్నచోట ఉండనివ్వకుండా ఇక్కడికి రప్పించే వారికోసం చకచకా నడిచి వచ్చి, ఎంతో ఆతృతతో ఎదురు చూస్తూ కూర్చుంటారన్నమాట!"

"అన్నమాట కాదు. ఉన్నమాటే"

"అంతగా మీ ప్రేమాభిమానాలను చూరగొన్న ఆ అదృష్టవంతులెవరో నేను తెలుసుకోవచ్చా బాబా?"

"దాందేముందీ? తప్పకుండా తెలుసుకోవచ్చు. ఉవ్వెత్తున ఎగసిపడే అందమైన కడలి అలల ఒడిలో కూర్చునే ఈ రేవుకి వచ్చి, ఇక్కడ తనకోసం ఎదురు చూస్తున్న నన్ను కావలసినంత సేపూ తృప్తిగా చూసుకుని, మళ్ళీ అలలతోపాటే వెళ్ళిపోతూ ఉంటుందామె. తను ఉన్నంతసేపూ మేమిద్దరం చూపులతో ఎన్నో కబుర్లను కలబోసుకుంటాం"

"ఆమె ఎవరూ?"

ఆమె ఎవరో తెలుసుకోవాలనే ఉత్సాహంతో నాకు దగ్గరగా జరుగుతూ ఉత్కంఠతో అడిగాడు ఆ అబ్బాయి.

"ఆమె మీకేమవుతుందీ బాబా?"

"ఏమవుతుందీ అంటే.. నా సర్వస్వమూ ఆమే!" కళ్ళు మూసుకుని తన్మయత్వంతో ఆమెనే తలచుకుంటూ అన్నాను నేను.

ఆలోచనలలో మునిగిపోయి.. కదలకుండా మెదలకుండా కూర్చున్న నన్ను కుదుపుతూ "ఆమె గురించి నాకు చెప్పరూ?" అంటూ అభ్యర్థనాపూర్వకంగా అడిగాడు ఆ అబ్బాయి.

"చెప్పాలంటే చాలానే ఉంది. ఆమె నిరుపేద మహిళ. ఇక్కడ కష్టపడి రాళ్ళెత్తితే బంగారం దొరుకుతుందని ఈ దేశానికి వలస వచ్చింది. వచ్చి... ఈ నేలను పునీతం చెయ్యటానికి ఆత్మార్పణ చేసుకుంది"

ఇంతవరకూ ఉత్సాహంగా ప్రశ్నలు వేసిన ఆ కుర్రాడు, ఆ మాట వినడంతో నిశ్చేష్టుడైపోయాడు.

గంభీరమైన ఈ మాటలను ఆ అబ్బాయి అర్థం చేసుకోలేదని గ్రహించిన నేను, అతని భుజం మీద చెయ్యి వేస్తూ, "మొట్టమొదట్లో మారిషస్‌కు వలస వచ్చిన ప్రవాస భారతీయుల జీవితాలు చాలా దుర్భరంగా ఉండేవి. ఒక్కొక్కరిదీ ఒక్కో



దీనగాధ. అంతులేని ఆవేదనతో నిండిన ఆమె దయనీయ గాధను వింటావా? " అంటూ అనునయంగా అడిగాను.

"వింటాను బాబా! కథలంటే నాకూ ఇష్టమే" ఉత్సాహంగా అన్నాడు కుర్రాడు.

★ ★ ★

"ఇంతవరకూ మన సంభాషణలో ప్రస్తావించిన మహిళ కథతో నా జీవనగాధ కూడా ముడిపడి ఉంది. ఎందుకంటే... ఆమె మరెవరో కాదు నా ధర్మపత్ని. నేను ప్రతిరోజూ నిరీక్షించేది ఆమె కోసమే!"

"మరి ఆమె కెరటాలపై తేలి వస్తుందం టున్నారేంటీ? సజీవంగా ఉన్నట్లయితే.."

"నీ సందేహాన్ని తప్పు పట్టనులే. ఆమె చనిపోయిన మాట వాస్తవం"

"అయితే పత్నీ వియోగంతో ఒంటరి

గానే జీవితాన్ని వెళ్ళదీస్తున్నారన్నమాట"

"అవును బాబూ! ఎన్నో కలలు కంటూ ఆమె ఈ గడ్డమీద అడుగు పెట్టింది. మారిషస్ ద్వీపానికి వలసపోతే.. కాయ కష్టం కాస్త ఎక్కువే అయినా.. కలిమి దక్కుతుందనీ, ఆ సంపదతో తన ఆశల ఆకాశంలోని కోరికల తారలన్నింటినీ అందుకుని, చీర చెంగులో ముడి వేసుకోవచ్చనీ బొంబాయి రేవులో ఓడ ఎక్కింది.

అయితే ఆమె కన్నుల్లో నింపుకున్న కలలన్నీ.. ఒక్కొక్కటిగా ఇక్కడికి వచ్చాక విడిపోసాగాయి. ఆమె ఆశల సౌధాలన్నీ ఇసుక మేడల్లాగా కూలిపోసాగాయి" అలా అంటున్నప్పుడు నా కంఠం రుద్ధమైపోయింది. ఆ పైన మాటలు పెగలలేదు.

"అనవసరంగా ఇప్పుడు మీకు గతం గుర్తుకు వచ్చేట్లు చేసి, మీ మనోవేదనను తవ్వి తీసినట్లున్నాను"

"లేదు బాబూ! ఇవాళ నువ్వు ప్రత్యేకంగా గుర్తుకు తెప్పిస్తున్నదేం లేదు. నా స్మృతిపథంలో ఆమె జ్ఞాపకాలు సజీవంగానే ఉన్నాయి. వాటితోపాటు సదా సర్వదా ఆమె నా గుండెల్లో గూడు కట్టుకుని ఉంటుంది" ఈ మాటలంటూ ఉండగానే నా కళ్లలో అశ్రువులు కారసాగాయి.

మెల్లగా ఆ కుర్రాడి చెయ్యి పట్టుకుని లేచి, కొండగుట్ట పైకి వెళ్ళే కాలిబాట పట్టాం. ఆ కుర్రాడూ పక్కనే నడుస్తున్నాడు.

నాలుగు రోడ్ల కూడలి దగ్గరకు చేరుకోగానే.. ఇప్పుడు నేనుంటున్న కొండలోయ వేపుకు కాకుండా.. నా కాళ్ళు వ్యతిరేక దిశకు దారితీశాయి.

ఆ దారి నాకు కొట్టిన పిండే అయినా... నేను అటుగా వెళ్ళి చాలా ఏళ్ళే గడిచిపోయాయి. నడుస్తూ నడుస్తూ వీధి చివరి దాకా వెళ్ళి.. ఓ ఇంటి ముందు ఆగి "ఇదే నా కలలను సాకారం చేసుకున్న స్వర్గసీమ బాబూ! ఇప్పుడిది నిర్మానుష్యంగా పడి వుంది" అంటూ నా పాత ఇంటిని ఆ కుర్రాడికి చూపించాను.

"నా కనుసన్నలలో మసలుకొంటూ నా జీవితాన్ని నందనవనం చేసిన నా భార్యా, ముద్దు మురిపాలతో నన్నలరించిన నా పిల్లలూ.. వాళ్ళెవ్వరూ ఇప్పుడు లేరిక్కడ. అందుకనే ఇటుకేసి రావాలనిపించదు.

ఈ రోజున నా మనసెందుకో బాగుండలేదు. కాళ్ళు ఇటు ఈడ్చుకు వస్తే.. అసంకల్పితంగానే వచ్చేశాను.

అదిగో! ఆమె పిలుపు వినపడటం లేదూ!? కెరటాలపైన తేలివస్తూ.. వాటి హోరుతో తన స్వరం కలిపి ఎలుగెత్తి పిలుస్తోంది.

తనతోపాటు నేనూ రావటానికి ఈ రోజైనా ఒప్పుకుంటుందో లేదో మరి?

మళ్ళీ నన్ను సముద్రతీరానికే తీసుకెళ్ళు. ఇందాక కూర్చున్న చోటే కూర్చుందాం పద!" అన్నాను.

త్వరత్వరగా నడుస్తూ సముద్ర తీరానికి తిరిగి వచ్చి.. మెత్తని ఇసుకలో మళ్ళీ మేమిద్దరం కూర్చున్నాం.

నా కళ్ళ నుంచి అశ్రువులు రాలుతున్నాయి.

తన చొక్కాతో వాటిని తుడుస్తూ "మీరు ఏడుస్తున్నారా బాబా? " అన్నాడతను.

"లేదు బాబూ! ఇప్పుడు ప్రత్యేకంగా ఏడవటం లేదు గానీ.. ఏళ్ళ తరబడి నా అంతరంగంలో గూడుకట్టుకున్న దుఃఖం కట్టలు తెంచుకుని కన్నీళ్ళుగా ప్రవహిస్తోంది.

ఎంతో సాధన చేసి పొందిన ఆత్మశక్తిని వినియోగించి, ఎన్నో ఏళ్ళుగా ఆ దుఃఖాన్ని అణిచి పెట్టగలిగాను. ఇప్పుడు.. ఇప్పుడిక నావల్ల కావట్లేదు.

ఈ రోజుతో నాకు డెబ్బై సంవత్సరాలు నిండుతాయి.

నా దేశం భారతదేశం. నేను అక్కడే

పుట్టి పెరిగాను.

పవిత్రమైన నా మాతృదేశానికి సుదూరంగా.. హిందూ మహాసముద్రంలో ఉన్న ఈ మారిషస్ ద్వీపంలో.. నిస్సహాయమైన ఈ కన్నులు చూడనిదేముంది?

తెల్లవాళ్ళ పైశాచిక నిర్దయనూ, ఆంగ్లేయ అధికారుల పక్షపాత వైఖరినీ చూశాను. వాళ్ళు విజాతీయులపై చేసిన అత్యాచారాలను గురించి నాకు బాగా తెలుసు.

భారతీయ ప్రవాసులను మలబార్ కూలీలంటూ వారి మొహం మీద తుపుక్కున ఉమ్మేసేవారు. బానిసలు, బానిసలంటూ.. ప్రత్యేకంగా తయారు చేయించిన లాఠీలతో చితక బాదేవారు.

ఆఫ్రికా, మెడగాస్కర్.. తదితర దేశాలకు చెందిన బానిసలను ఖైదీలుగా బంధించి తెచ్చి, వారిని బతికుండగానే పాతి పెట్టేసేవారు.

ప్రవాస భారతీయ కూలీ మహిళలను, వాళ్ళు గర్భవతులుగా ఉన్నాసరే లెక్కచెయ్యకుండా బెత్తాలతో కొట్టి చంపేవారు.

ఇక్కడ ఇన్నిన్ని నేరాలూ ఘోరాలూ చూడాల్సి వస్తుందని తెలియక, ఇక్కడికొచ్చాం. నేటికి ఐదు దశాబ్దాల కిందట డబ్బు సంపాదించుకుందామనే ఆశతో ఈ దేశానికి రావటానికి నేను బొంబాయి రేవులో ఓడ ఎక్కాను. నా కష్టాల కథ అప్పుడే మొదలైంది" అని ఆ కుర్రాడితో చెబుతుంటే.. నా జీవితంలో జరిగిన సంఘటనలన్నీ సినిమా రీళ్ళలాగా వరుస క్రమంలో నా కళ్ళముందు కదిలాయి.

★ ★ ★

ఆ పెద్ద ఓడ.. భారతీయ ప్రవాసులను నిండా నింపుకుని, బొంబాయి నుంచి మారిషస్ ద్వీపానికి ప్రయాణిస్తోంది.

అందులో నేనొక ప్రయాణికుణ్ణి.

అప్పుడు నాకు ఇరవై ఏళ్ళు

ఇసుకవేస్తే రాలనంతగా.. జనంతో కిక్కిరిసి ఉంది ఓడ.

అప్పటికే ఈ ఓడ బయలుదేరి కొన్ని రోజులయ్యాయి.

'ఇంతమంది మనుషుల్ని గొర్రెల మందను కుక్కినట్లు తీసుకెడుతున్నారు' అని ప్రయాణికులంతా విసుక్కుంటున్నారు.

కొందరు వ్యాధులబారిన పడుతున్నారు.

నా చుట్టుపక్కల నలుగురైదుగురు వివిధ భారతీయ భాషల్లో మాట్లాడుకుంటున్న మాటలు చెవిన పడుతున్నయ్.

"ఈ ఓడలో వైద్యుడు లేడా? జబ్బుపడ్డ వాళ్లు నానా అవస్థలూ పడుతున్నారు"

"లేడనుకుంటా. ఇంతవరకూ కనపడలేదు"

"......................."

"మనని ఏ దేశానికి తీసుకెడుతున్నారూ?" అది కూడా తెలియని ఓ అమాయకుడి ప్రశ్న.

"మారిషస్‌కు. అక్కడ రాళ్ళు మోస్తే బంగారం దొరుకుతుందిట.. బంగారం! అలా అని చెబితేనే మా చుట్టుపక్కల ఊళ్ళనుండి చాలామందిమి బయల్దేరి వస్తున్నాం"

ఈ మాటలు వినగానే నాకు సమీపంలో ఉన్నవాళ్ళ కళ్ళు సంతోషంతో మెరవటం గమనించాను నేను. అవన్నీ జీవం లేనట్లు

## కొత్తగాలి...

**కోరి పుట్టలేదు**
**అయినా మనిషి**
**కోరికల పుట్ట!!**

– *కర్లపాలెం హనుమంతరావు,*
*మోతీనగర్, హైదరాబాద్*

లోతుకు పోయిన కళ్ళే!

వేషభాషలను బట్టి ఆ ఓడలో ఎక్కిన వాళ్ళందరూ నిరుపేదలేననీ, చదువు సంధ్యలు బొత్తిగా లేనివాళ్ళనీ అవగతమవుతోంది. ఏపూటకాపూట నాలుగు వేళ్ళూ నోట్లోకి పోవటం కష్టమైన కుటుంబాల నుంచి వచ్చినవాళ్ళే అందరూ.

★ ★ ★

కాస్త కొత్తదనం మరిచి, అప్పుడప్పుడే ఒకరి గురించి మరొకరు తెలుసుకుంటూ నలుగురూ కలిసి మాట్లాడుకోవటం మొదలుపెట్టారు.

"భాయీ! నువ్వు ఏ ఘాట్‌లో ఓడ ఎక్కావూ? "

"దిల్లీ!" (ఢిల్లీ)

"అచ్ఛా! నేను కలకత్తాలో ఎక్కాను. మాది బీహార్ మారుమూల ప్రాంతం. మా బీహారీలు చాలామంది ఈ ఓడలో ఉన్నారు. మేం భోజ్‌పురి మాట్లాడుతాం"

"నేనూ దిల్లీ నుంచే వస్తున్నాను" మరొకతను అన్నాడు.

అక్కడున్న వాళ్ళందరూ తమను తాము అలా పరిచయం చేసుకున్నారు.

"ఆ మూల కూర్చున్నతను నాతో మాట్లాడాలని ప్రయత్నిస్తున్నాడు పాపం! అతను మాట్లాడే భాష నాకు రాక.. అతను చెబుతున్నది అర్థం కాక మెదలకుండా ఊరుకుంటున్నాను"

"అతను మద్రాసీ. మద్రాసు నుంచి చాలామంది వస్తున్నారు. వాళ్ళలో కూడా వేర్వేరు భాషలు మాట్లాడేవాళ్ళున్నారు"

"అవును! తమిళం, తెలుగు, కన్నడం, మలయాళం అంటూ ఏవేవో భాషలు మాట్లాడుతున్నారు"

"వాళ్ళంతా దక్షిణ భారతదేశానికి చెందినవాళ్ళు"

"వాళ్ళేకాదు. బెంగాలీ, హిందీ, రాజస్థానీ, కాశ్మీరీ.. ఇలా ఎన్నో వేర్వేరు ఉత్తరాది భాషలు మాట్లాడేవాళ్ళు కూడా ఈ ఓడలో ఉన్నారు. భాషాభేదాలున్నా ఇతర దేశానికి ప్రవాసులుగా వెడుతున్న మనందర్నీ కలిపి భారతీయ ప్రవాసులనే అంటారు" కాస్తో కూస్తో చదువుకున్న ఓ యువకుడు వివరించి చెప్పాడు.

★ ★ ★

"మనదేశానికి చెడ్డరోజులు వచ్చాయి. రానురానూ ఇక్కడ పేదరికం పెరిగిపోతోంది. ఈ పేదరికంవల్ల వచ్చే పారిశుధ్య లోపంతో అంటువ్యాధులు ప్రబలుతున్నాయి"

"చేద్దామన్నా ఏ పనీ దొరకటం లేదు"

"అదేమరి! ఎలా బతకాలో తెలీని దౌర్భాగ్యపు స్థితి దాపురించింది. అంతా మన ఖర్మ"

"మనం వెడుతున్న మారిషస్‌లోనైనా శారీరక శ్రమతో మన స్థితిగతులు మెరుగవుతాయంటున్నారు"

"అక్కడ రాళ్ళు దొర్లిస్తే చాలు, బంగారం దొరుకుతుందని ఆశ పెడుతున్నారు"

"దొర్లిస్తే కాదు! రాళ్ళు మోస్తే దొరుకుతుందిట!"

"పోనీ.. ఏ పనిచేస్తే ఆ బంగారం దొరుకుతుందో అదే చేద్దాం. కొన్నేళ్ళు కష్టపడి పన్జేసి.. బంగారం మూటకట్టుకుని వెనక్కురావచ్చు. పోనీ అక్కడ మనకు అన్నీ బాగుంటే రాజాల్లాగ అక్కడే బతకొచ్చు. ఏం పోయిందీ? ఈ భూమ్మీద ఎక్కడైనా సరే.. సుఖంగా బతకగలిగితే అంతేచాలు. ఇంతకీ అక్కడికి ఎప్పుడు చేరతామో ఏమో!"

"ఓడ ఎక్కినవాళ్ళం రేపుకాకపోతే ఎల్లుండి... కాకపోతే మరో పదిరోజుల తరవాతైనా చేరకేం చేస్తాంగానీ.. తీరా చేరాక అక్కడ మన కష్టం ఫలించి మన దరిద్రం తీరుతుందనే మాట కాసేపు నిజమేననుకున్నా.. మన మత ధర్మాలనూ,

సామాజిక కట్టుబాట్లనూ నిలుపుకోగలమా అని ఆలోచిస్తున్నాను. ఆ సంగతి మన మందరం తెలుసుకోవాలి" అన్నాడో నడివయసు వ్యక్తి.

అందరూ మౌనంగా ఉన్నా.. 'ఎలా తెలుసుకుంటాం?' అని ఎవరికివాళ్ళు ప్రశ్నించుకుంటున్నారు.

★ ★ ★

కట్టుబొట్టును బట్టి బ్రాహ్మణునిలా ఉన్న ఓ మధ్య వయస్కుడు ఈ సంభాషణలో జోక్యం చేసుకుంటూ "మారిషస్ అంటే మారీచ దేశం. పూర్వం దాన్ని మారీచ ద్వీపం అనేవారు. రామాయణంలో సీతమ్మతల్లిని ఎత్తుకెళ్ళి, అష్టకష్టాలకూ గురి చేసిన రావణాసురునికి మారీచుడు మామయ్య అవుతాడు.

విశ్వామిత్రుని యాగ సంరక్షణార్థం, ఆయన వెంట తన తమ్ముడు లక్ష్మణునితో సహా వెళ్ళిన శ్రీరామచంద్రమూర్తి, ఆ యాగాన్ని భగ్నం చెయ్యాలని శతవిధాలా ప్రయత్నిస్తున్న మారీచ రాక్షసుడి మీద తన దివ్యబాణాల్ని ప్రయోగించాడు. వాటి మహిమ వల్ల ఆ రాక్షసుడు క్షతగాత్రుడయ్యాడుగానీ, చావలేదు. గాయాలతో నెత్తురోడుతున్న ఆ శరీరం యజ్ఞవేదిక చుట్టూ ఉన్న పవిత్రమైన యజ్ఞభూమి మీద పడితే అమంగళమని, ఆ రాక్షస శరీరాన్ని సుదూరంగా తరమటానికి శ్రీరాముడు మరో బాణాన్ని ప్రయోగించాడు.

దాని మహిమతో మారీచ రాక్షసుని శరీరం.. ఏడువందల యోజనాల క్రోసుల పొడవున్న సముద్రానికి అవతల ఉన్న ద్వీపంలో వెళ్ళి పడింది. అదే హిందూ మహాసముద్రంలో ఉన్న మారిషస్ ద్వీపం. అక్కడికే ఇప్పుడు మనం వెళ్ళబోతున్నాం.

ఆ తర్వాతి కాలంలో రాముడు సీతాలక్ష్మణులతో కలిసి అరణ్యవాసం చేస్తున్నప్పుడు.. ఆ మారీచ రాక్షసుడే వచ్చి బంగారు లేడిలాగా మాయవేషం వేసుకుని, పర్ణశాల చుట్టూ తిరుగుతూ.. పరమపావని సీతామాతను ఆకర్షించి మోసం చేశాడు. ఆ తరువాత సీతాదేవి పడిన కష్టాలు అన్నీ ఇన్నీ కావు. సీతమ్మ కష్టాలకు కారణం మాయలేడి మారీచుడే!

అటువంటి మారీచ రాక్షసుని పేరు మీదున్న మారీచ ద్వీపానికి.. డబ్బు సంపాదించుకుని సుఖపడదామని వెడుతున్న మన గతి ఏమవుతుందోనని నాకు భయంగా ఉంది" అంటూ ఓ చిన్నపాటి ఉపన్యాసం ఇచ్చాడు.

ఆయన ముఖంలో దిగులు స్పష్టంగా కనపడుతోంది.

**కొత్తగాలి...**

**మహాసముద్రాల**
**కంటే**
**లోతైంది**
**మనసు**

– డి. చందూవంశీ,
కర్నూలు

ఆ ఉపన్యాసాన్ని శ్రద్ధగా విన్నవాళ్ళందరూ ఎవరికి వారు లోలోపల భయపడుతూ.. పైకి మెదలకుండా ఊరుకున్నారు. మేం ఎక్కిన ఓడ మాత్రం తన ప్రయాణం కొనసాగిస్తూనే ఉంది.

★ ★ ★

అందులో నానా అవస్థలూ పడుతూ ప్రయాణిస్తున్న మేమందరం.. మాకు సమీపంలో ఉన్నవారితో పిచ్చాపాటీ మాట్లాడుతూ కాలక్షేపం చేస్తున్నాం.

శుభ్రమైన పాతబట్టలో చుట్టిన ఓ లావుపాటి గ్రంథాన్ని భక్తితో కళ్ళకద్దుకుంటున్న

ఆ బ్రాహ్మణున్ని చూసి "అదేం పుస్తకం బాపూజీ!" అడిగాడు, సమీపంలోని వ్యక్తి.

"ఇదే రామాయణం. ఈ పవిత్ర గ్రంథం మాత్రమే నాతోపాటు ఆ అపరిచిత ద్వీపానికి వస్తోంది.."

"రమణీయమైన ఆ రామాయణగాధను మాకూ చెప్పండి బాబా!" అడిగారు కొందరు.

"సరైన తిండీ తీర్థమూ లేక నీరసపడిపోయిన నేను, ఆ పవిత్ర గాధను వర్ణించే స్థితిలో లేను. మనం సహ ప్రయాణికులమే గదా? నేనెక్కడికి పోతాను? తర్వాత చెబుతానులే. చెప్పేవారికి శ్రద్ధా, వినేవారికి భక్తీ ఉంటేనే రామాయణ ప్రవచనం సాగుతుంది. అయినా ఆ రామాయణ మహాగ్రంథాన్ని గురించి ఒకనాడు చెబితే అయ్యేది కాదు" అన్నాడాయన.

రామాయణం వినలేని మేము.. లోకాభిరామాయణంతో ఆ రాత్రి గడిపేశాం.

★ ★ ★

ఓడలో సూర్యకిరణాలు వ్యాపించసాగాయి. ఆ ప్రత్యక్ష నారాయణుని దర్శనం చేసుకుని, కాసేపు తాజా గాలి పీల్చుకుని వద్దామని డెక్ మీదకు వెళ్ళాను.

ఓ అందమైన యువతి సూర్యస్తవం చదువుతూ కనిపించింది. పంజాబీ డ్రస్‌లో ఉన్న ఆమె చక్కగా, కుదురుగా ఉంది.

చూడగానే ఆకట్టుకునే అందం. నుదుట అలంకరించుకున్న చిన్నబొట్టుతో చూడముచ్చటగా ఉంది.

'ఏ ప్రాంతంలో నివసించే హిందువులైనా తరతరాలుగా వస్తున్న మన ఆచార వ్యవహారాలను పాటిస్తారన్నమాట!' శ్రద్ధతో సూర్యస్తవాన్ని చదువుతున్న ఆమెను చూసి ఆశ్చర్యంగా అనుకున్నాను.

సూర్యదేవుణ్ణి దర్శించుకుంటున్న ఆమె ముఖం ప్రశాంతంగా, ఆకర్షణీయంగా ఉంది. ఆమె ఏకాగ్రతకు భంగం వాటిల్లకుండా, నేనలా ఆమెను చూస్తూండగానే బ్రాహ్మణుడు పైకి రావటంతో నా చూపులను సముద్రం మీదకు మళ్ళించాను.

★ ★ ★

తన మెడలోనుంచి యజ్ఞోపవీతాన్ని బయటకు తీశాడాయన. కళ్ళల్లో ఆర్ద్రతను నింపుకుని దానివంక కాసేపు చూశాడు. ఎంతో ఆప్యాయంగా హృదయానికి తాకించినట్లే తాకించి, సముద్రంలో విసిరేశాడు.

"అయ్యో! ఎందుకలా చేశారు బాబుగారూ? " అప్పటి వరకూ ఆయన చేస్తున్న పనిని గమనిస్తున్న నేను, కుతూహలంతో అడిగాను.

"నేను బ్రాహ్మణుడిని. ఓడపై ప్రయాణిస్తూ సముద్రాన్ని దాటుతున్నాను. ఇది సద్బ్రాహ్మణులకు నిషిద్ధం. మాకు నిషిద్ధమైనది చేస్తున్నందున పవిత్రమైన యజ్ఞోపవీతాన్ని ధరించే అర్హతను కోల్పోయాను. అందుకనే.. అందుకనే..." అంటూ ఏడుపును ఆపుకోలేకపోయాడాయన.

ఆ కళ్ళనుండి కన్నీటి బొట్లు బొటబొటా రాలి సముద్రంలో కలిసిపోయాయి.

నీలిసముద్రం మీద మెల్లగా సాగుతూ.. ఉవ్వెత్తున ఎగసిపడుతున్న అలలతోపాటు పడిలేస్తున్న ఇతర ఓడలను చూస్తూ చాలాసేపు అక్కడే గడిపాం.

ఆ అనంత జలరాశిని విస్మయంగా చూస్తూ మేమున్న స్థితిని మరచి.. సంతోష తరంగాలలో తేలియాడాం.

ఎండ చురుక్ చురుక్కుమని సూదులతో పొడిచినట్లు పొడుస్తుండటంతో ఇక కిందకు దిగక తప్పలేదు మాకు.

★ ★ ★

"ఇక్కడ కాళ్ళు జాపుక్కూర్చునే వెసులుబాటు లేదు. అస్తమానం ముడుచుకునే కూర్చోవాలంటే అసౌకర్యంగా ఉంటోంది. కాళ్ళు నొప్పులు పుడుతున్నాయి. మనని మారిషస్ తీసుకెళ్ళటానికి ఇటువంటి

ఏర్పాట్లు చేశారేమిటీ? ” తన బాధను వ్యక్తం చేస్తూ అన్నాడు ఒకాయన.

“మారిషస్ తీసుకువెడతాం. అక్కడ కూలిపని చేసినా బాగా బతకొచ్చు. రండి రండి- అంటూ ఊరూరా దండోరా వేసి ప్రచారం చేశారు. వచ్చినవాళ్ళను తీసుకెళ్ళ టానికి ఈ తెల్లవాళ్ళు ఎటువంటి ఏర్పాట్లూ చెయ్యలేదు. సరుకులను రవాణా చేసినట్లు ఇక్కడ ఎక్కించి అక్కడ దింపుకుందామను కున్నట్లున్నారు” అన్నారు ఎవరో.

అందరూ ఇంచుమించు ఇదే అభిప్రా యాన్ని వ్యక్తం చేస్తూ బాధపడసాగారు.

భాషలు వేరైనా భావం ఒక్కటే... బాధా ఒక్కటే!

చాలాసేపు కూర్చునివున్న నేను కూడా ఇక కూర్చోలేనని గ్రహించి.. ఎలాగో వీలు చేసుకుని లేచి మెల్లమెల్లగా జనాలను తప్పించుకుంటూ నడవసాగాను.

కొంతదూరం వెళ్ళేసరికి.. అక్కడ ఓ నడి వయస్కుడు తీవ్రమైన జ్వరంతో మూలుగుతూ కనిపించాడు. ఆయన ము ఖం పాలిపోయి వుంది.

‘దాహం! దాహం!’ అనే మాటలు ఆయన నోట పొడిపొడిగా వినవస్తు న్నాయి. అవి ఎక్కడో నూతిలో నుంచి వినిపిస్తున్నట్లుగా ఉన్నాయి.

“పొయ్యిమీద పెట్టిన పెనం కాలిపోతు న్నట్లు కాలిపోతోంది ఒళ్ళు. అతని పక్కన కూర్చుని నుదుటిమీద చెయ్యివేసి చూస్తున్న ఒక యువతి అంటోంది.

అది నేను విన్న గొంతులాగా ఉండ టంతో ఆగి మరీ చూశాను.

ఆమె ఆమే! ఆ డెక్‌మీద సూర్యస్తవం చదివిన యువతి.

“వైద్యుడు ఎక్కడన్నా ఉన్నాడేమో వాకబు చేశారా? ” అడిగాను నేను.

“లేడు. ప్రథమచికిత్సకై కొన్ని మందులు తెచ్చారటగానీ, అవి కూడా అయిపోయా యట. కనీసం మంచి నీళ్ళయినా లేవు” అందామె.

“అవి కూడా అయిపోయాయట! తెప్పి స్తున్నామన్నారు” అన్నారెవరో.

‘ప్చ్! ఎటువంటి దయనీయస్థితిలో నడి సముద్రంలో పయనిస్తున్నాం మనం!’ అ నుకుంటూ వెంటనే నేను ఆంగ్లేయ ఓవర్‌సీర్ దగ్గరకు వెళ్ళి మా ఇబ్బందు లను వివరించాను.

“త్వరలోనే ద్వీపం చేరుకుంటాంగా! ఎలాగో సర్దుకోండి. ఇలా ఒకరి తర్వాత ఒకరువచ్చి నన్ను విసిగిస్తారెందుకూ? ” అంటూ కన్నెర్ర జేశాడతను.

నేను తిరిగివచ్చేసరికి ఆమె రోగిని

> **కొత్తగాలి...**
>
> **పతనం నుండి**
> **పైకెత్తే క్రేన్**
> **పుస్తకం**
>
> – వల్లభాపురం జనార్ధన,
> మహబూబ్‌నగర్

కూర్చోబెట్టటానికి ప్రయత్నిస్తోంది. నేను కూడా సాయం చేశాను.

ఇద్దరం కష్టపడి ఎలాగో కూర్చోబెట్టగ లిగాం. నేను కూడా అక్కడున్న జనం మధ్యన ఇరుక్కుని కూర్చుని, రోగికీ, ఆమెకూ మధ్య సంభాషణ వినసాగాను.

“బేటీ! ఇంకా మన గమ్యం ఎంత దూరం ఉందే? నేనక్కడికి చేరగలనం టావా? ”

“ఎంతదూరం ఉన్నా ఫరవాలేదు. మీరు తప్పక జేరతారు. అధైర్యపడకండి”

“సరైన మందూమాకూ వేసుకోకపోతే వచ్చిన వ్యాధి ఎలా నయమవుతుందే?

అందుకే నాకు భయంగా ఉంది"

"ఆ దేవుణ్ణి నమ్ముకోండి. తప్పక నయమవుతుంది"

"ఏం నయమవుతుందో ఏమో! భార్యాబిడ్డల్ని స్వదేశంలో విడిచి వస్తున్నాను. మారిషస్ ద్వీపానికి వెళ్ళి కష్టపడి పనిచేసి, పసిడి మూటలతో తిరిగి వస్తానని వాళ్ళకు నచ్చజెప్పి ఓడ ఎక్కాను. వాళ్ళ మీద మోహం సతాయిస్తోంది. వాళ్ళందరినీ మళ్ళీ చూడగలనో లేదో? " అంటుంటే ఆయన కంఠం రుద్ధమైంది.

"మీరు ఊరికే కంగారు పడకండి. మీకు తప్పక నయమవుతుంది" అంటూ ఆయన వెన్నుమీద చేత్తో రాస్తూ ధైర్యం చెప్పటానికి ప్రయత్నిస్తోందామె.

"గుండెలో గాబరాగా ఉంది. అక్కడకు చేరేదాకా నా ప్రాణాలు నిలువవనే అనిపిస్తోంది. మనసులోని కోరికలేవీ తీరేటట్లు లేవు. నా అభిలాషలన్నీ అణగారిపోతాయేమో!" అంటుంటే.. వెలుగును కోల్పోతున్న ఆ కన్నుల నుండి నీరు బొట్లు బొట్లుగా కారుతోంది.

చుట్టుపక్కల వాళ్ళంతా నిశ్శబ్దంగా కూర్చుని ఉన్నారు. నా మనసంతా దుఃఖంతో నిండిపోయింది.

అంతలో ఓడలో ఎక్కడ నుంచో భగవద్గీత శ్లోకం శ్రావ్యంగా వినవచ్చింది.

"ఆ పుణ్యాత్ముణ్ణి నా దగ్గరకు తీసుకు రండీ! త్వరగా తీసుకురండి బాబూ!" అన్నాడు రోగి.

నేను వెళ్ళి... ఓడంతా వెతికి ఆయన్ని వెంట బెట్టుకు వచ్చాను.

"ఎవర్నాయనా నువ్వు? " మాటలను కూడదీసుకుంటూ ఆప్యాయంగా అడిగాడు.

"నన్ను మహావీర్ అంటారు. నా దగ్గర భగవద్గీత ఉంది బాబా! ఈ పవిత్రగంథంతోనే నేను ఆ అపరిచిత ద్వీపానికి వెడుతున్నాను. కానీ.. నాకు దాన్ని స్పష్టంగా చదవటం రాదు.

నేను ప్రయాణానికి సిద్ధం కాగానే.. మా నాన్న దాన్ని నా చేతిలో పెట్టాడు. కొన్ని శ్లోకాలు మాత్రం కంఠతా వచ్చు రోజూ మా నాన్న చదువుతుంటే వినగా వచ్చినవి" అంటూ, తనకు వచ్చిన 'యదాయదాహి ధర్మస్య' అనే గీతాశ్లోకాన్ని చదవటం మొదలుపెట్టాడు మహావీర్.

"పోనీ ఎవరన్నా రామాయణం గానం చెయ్యండి. ఆ పావన గాధను ఆలపించినా, ఆలకించినా ఆనందం కలుగుతుందంటారు. ఆ గానం వింటుండగా నా ప్రాణం పోతే.. ఈ జన్మ ధన్యమవుతుంది" వ్యాధితో విపరీతంగా బాధపడుతూ అన్నాడు రోగి.

వెంటనే బ్రాహ్మణుడు తన రామాయణ గ్రంథాన్ని తీసి చదవబోయాడు.

'యదాయదాహి ధర్మస్య' శ్లోకం చెవిన పడగానే మేమందరం ఉన్నచోటికి వచ్చేశాడాయన.

అంతలోనే "నేను పెద్దగా చదువుకోలేదు గానీ, రామాయణంలోని చౌపాయీలు (నాలుగు చరణాల పద్యం) నాకు కంఠతా వచ్చు. నేను పాడతాను" అంటూ ముందుకు వచ్చాడు ఓ యువకుడు.

అప్పటికే రోగి చుట్టూ చాలామందే గుమిగూడారు.

"ముందు నువ్వు చౌపాయీని పాడితే... వెంటనే మేమందరం నీతో కలిసి పాడతాం. భజనగీతాలను పాడినట్లుగా, రామాయణంలోని చౌపాయీలను రాగయుక్తంగా ఆలపిద్దాం" అన్నారు కొందరు.

మిగతా వాళ్లమందరం కూడా సరేనంటే సరేనన్నాం.

"జీవన్ మరన్ ఫలు దశరథ్ పావా" అంటూ భక్తి పారవశ్యంతో పదిమంది పాడే రామాయణ గానం చెవుల పడుతుండగా, కళ్ళు చెమరుస్తుంటే.. ముఖంలో

## ఎస్సెమ్మెస్సుల పోటీ!

ఎల్జీ యుఎస్ నేషనల్ టెక్స్టింగ్ ఛాంపియన్‌షిప్ పోటీని 2010లో సెప్టెంబరు 21న న్యూయార్క్ సిటీలోని రోజ్‌లేండ్ బాల్ రూములో నిర్వహించారు. అది సెల్‌ఫోన్‌లో మెసేజీలు పంపే పోటీ. దీంట్లో యాభైవేల మంది పాల్గొన్నారు. అందులో పదమూడేళ్ల బ్రియన్నా హెన్రిక్సన్ గెలుపొంది, యాభై వేల డాలర్ల బహుమతిని సంపాదించింది. ఆమె నెలకు ఆరు వేల టెక్ట్స్(ఎస్సెమ్మెస్)లను పంపుతోందట. న్యూయార్క్‌లోని బ్రూక్లిన్‌లో నివసించే బ్రియన్నా 'ఓల్డ్ మెక్‌డొనాల్డ్' అనే రైమ్‌ని పంపింది. పదిహేను చరణాలు గల ఈ పద్యాన్ని అతి తక్కువ సమయంలో పంపడంతో ఆ పోటీలో విజేత అయింది. అందులో పాల్గొన్న వారి వయసు పదమూడు నుంచి ఇరవై ఆరు. ఆమె ఆ పోటీలో పాల్గొనడానికి రోజుకు ఐదు గంటలు ప్రాక్టీస్ చేసింది. కొరియన్ ఫోన్ కంపెనీ అయిన ఎల్జీ ఈ పోటీ నిర్వహించింది. మన దేశంలోలా కాక అమెరికాలో ఇన్‌కమింగ్ ఎస్సెమ్మెస్‌లకు కూడా ఛార్జ్ పడుతుంది. ఎస్సెమ్మెస్‌లను వారు టెక్స్టింగ్ అంటారు.



అదొక రకమైన వెలుగురేఖ వెల్లివిరిస్తుండగా, కొద్ది క్షణాల్లోనే 'హరే రామ్' అంటూ ప్రాణాలు వదిలేశాడు ఆ రోగి!

ఆ మృత శరీరం పక్కకి దొర్లిపోయింది.

చనిపోయిన వ్యక్తికి అయిన వాళ్ళెవరూ పక్కన లేరు. అయినా.. అక్కడున్న వాళ్ళ మందరం స్వంతమనిషిని కోల్పోయినట్లు బాధపడసాగాం.

సరైన వైద్యం మాట దేవుడెరుగు... అసలు వైద్యుణ్ణి పిలిచే పరిస్థితి లేక, ప్రాథమిక చికిత్స చేసే అవకాశం కూడా లేక, పోనీ ఏదో ఒక మందు వేద్దామంటే దానికీ గతి లేక, గొంతు తడపటానికి మంచితీర్థం కూడా కరువై.. తమతోపాటు వచ్చే ఒక ప్రయాణికుడు నిండు ప్రాణాలను తమ కళ్ల ఎదుటే కోల్పోవటం చూసి, కడుపులో దేవినట్లయింది అందరికీ.

దుఃఖం ఎగదన్నుకు వచ్చింది.

'ఛీ! ఛీ! మన బతుకులు ఎంత హీనమై పోయాయి' అని బాధపడటం తప్ప ఎవరూ ఏమీ చెయ్యలేని దయనీయమైన పరిస్థితి అది!

'ప్రాంతాలూ, భాషలూ, యాసలూ వేరైనా మనందరిదీ ఒకటే జాతి. మనలోమనం ఒకరికొకరం చేసుకోగల సహాయం ఏదన్నా ఉంటే చేసుకోవాలి. కష్టాలనే పడవలో, రేవు ఎక్కడుందో తెలియని సముద్రంలో ప్రయాణిస్తున్న సహయాత్రికులం మనం' అనే అర్థం వచ్చేట్లు వేర్వేరు భాషలలో ఒకరితో ఒకరు మాట్లాడుకుంటున్నారు అందరూ.

ఇవేమీ పట్టని ఓడ.. నడిసముద్రంలో తన ప్రయాణం కొనసాగిస్తూనే ఉంది!

సింహనాదం చేస్తూ.. ఉరికి వచ్చి ఆ ఓడను చుట్టు ముడుతున్న కెరటాలు... భయంకరంగా మామీదకు విరుచుకు పడుతున్నట్లనిపించింది. ఆడవాళ్ళు దుఃఖాన్ని ఆపుకోలేక బిగ్గరగా రోదించసాగారు. ఇక అక్కడ నిలబడలేక కాస్త ముందుకు వెళ్ళిన నాకు ఓ చెక్క మీద తల పెట్టుకుని పడుకున్న వ్యక్తి కనిపించాడు.

అతను గాఢ నిద్రలో ఉన్నట్లున్నాడు.

పరిస్థితి ఇంత గందరగోళంగా ఉంటే, అతనికి మంచి నిద్ర ఎలా పట్టిందా? అని ఆశ్చర్యపోతూ.. పోనీ అతన్ని లేపి, జరిగింది చెపుదామని వెళ్ళి, అతని భుజం పట్టుకుని కుదిపాను.

ఐసుగడ్డలా చల్లగా తగిలింది ఒళ్ళు. భయంతో గుండె జల్లుమంది. అది శవం!

ఆ జీవి ప్రాణాలు ఎప్పుడో అనంత వాయువుల్లో కలిసి పోయివుంటాయి. అంటే మాలో మరొకరిని మృత్యువు కబళించి వేసిందన్నమాట! అదిచూసి.. ఆవేదనను ఆపుకోలేక నేను కూడా బిగ్గరగా ఏడ్వ సాగాను. నా ఏడుపు విని అక్కడకు చేరినవాళ్ళందరూ నాతో పాటు గుండెలవిసేలా విలపించసాగారు.

ప్రయాణం ఇంత ఘోరంగా ఉంటుందనుకోలేదనీ, అన్ని సౌకర్యాలూ కల్పిస్తారనుకున్నామనీ చెప్పుకుంటూ.. ఈ కష్టాలకు కారకులైన ఆంగ్లేయులను కసితీరా తిట్టిపొయ్యసాగారు కొందరు ప్రయాణీకులు.

ఈ గొడవా.. గందరగోళం విని, అక్కడకు చేరుకున్న ఓడలోని ఓవర్‌సీర్.. నోటికి వచ్చిన ఇంగ్లీషు బూతులు వదరుతూ, గట్టిగా బెదిరిస్తూ.. మమ్మల్నిందరినీ ఎవరి స్థానాలకు వాళ్ళని పంపించేసి.. ఆ రెండు శవాలను సముద్రంలో పడేయించాడు.

అవి ఆ అనంత జలరాశిలోని జలచరాలకు ఆహారమైపోయాయి.

రానురానూ మాకు వేళకు తిండి కూడా లేకుండా పోయింది. రోజు మొత్తంలో ఏదో ఒక టైంలో ఏదో ఒక పదార్థం ఇచ్చి తినమనే వారు. దాన్నే భోజనం అనుకుంటూ మింగలేకా.. సయించక కక్కలేకా అవస్థలు పడేవాళ్ళం.

పోనీ కడుపునిండా నీళ్ళైనా తాగి బతుకుదామన్నా, మంచి నీటి సరఫరా కూడా బాగా తగ్గించేశారు.

అది సూర్యాస్తమయ వేళ..

'సముద్రతీరంలో కూర్చుని సూర్యాస్తమయ దృశ్యాన్ని చూస్తేనే మనసుకు అనిర్వచనీయమైన ఆనందానుభూతి కలుగుతుంది. అటువంటి.. నట్టనడి సంద్రంలో పయనిస్తున్న ఓడ డెక్‌మీద నిలబడి చూస్తేనో.. అబ్బో! ఆ సుందర దృశ్యాన్ని చూసే తీరాలి. అటువంటి ఆనందాన్ని ఆస్వాదిస్తే దుఃఖపడుతున్న మనసు కాస్త కుదుటపడుతుందేమో?' అనుకుంటూ పైకెళ్ళాను.

వెళ్ళి, ఆ దృశ్యాన్ని అలా చూస్తూ నిలబడిపోయాను.

చంద్రోదయమవుతుండగా ఆమె వచ్చింది.

"ఇలా వచ్చారేం?" మృదువుగా అడిగాను.

"చంద్రుణ్ణి చూడగానే సముద్రం ఉప్పొంగిపోతుంది కదా! అలా ఉప్పొంగి ఉరికే కడలిని కళ్ళారా చూద్దామనీ.."

"మీ పేరేమిటీ?"

"లాజవంతి"

"ఎవరెవరు వస్తున్నారూ?"

"నాకు ఎవరూ లేరు. ఒంటరిని"

"ఈ మధ్య చనిపోయినవారు..."

"అబ్బే! ఆయనతో ఎటువంటి బాంధవ్యమూ లేదు. ఓడ ఎక్కినప్పట్నుంచీ ఆయన పక్కనే కూర్చున్నాను. ఆయన చనువుగా 'బేటీ' అని పిలిచేవారు. అంతే!"

"ఒక్కరే ఓడ ప్రయాణం చేస్తూ మారిషస్‌కు...?"

"మనదేశంలో నేనొక నిరుపేదను. డబ్బులేక నానా అవస్థలూ పడుతున్నాను. అక్కడ కష్టపడి పనిచేస్తే బంగారం దొరుకుతుందంటేనూ.. కాయకష్టంచేసి నా ఆశల సౌధాన్ని నిర్మించుకుందామనీ.."

"......................"

"మరీ మీరూ?"

"మీలాంటివాడినే! ఒంటరిని. మీరు ఆశ

పడుతున్నట్లే.. నేనూ ఆశపడి వస్తున్నా"

"అయితే.. ఇద్దరం ఒకే బోటులో ప్రయాణిస్తున్నామన్న మాట!"

"బోటులో కాదు.. ఓడలో!..." నవ్వుతూ అన్నాను.

"అదేలెండి" అంటూ అందంగా నవ్విందామె. కాసేపు ఇద్దరి మధ్యా మౌనం నెలకొంది. అంతలో చంద్రోదయమైంది.

"అదిగో చంద్రోదయమైంది చూడండి! వినీలాకాశంలో ఉదయిస్తున్న చంద్రుడిని అందుకోవాలని సముద్రుడు ఎలా ఉరకలు వేస్తున్నాడో.." ఆకాశంలోని ఆ అద్భుత దృశ్యంపైన దృష్టి నిలిపిందామె.

చంద్రబింబంలా ఉన్న ఆమె ముఖారవిందంలోని అందాలను ఆస్వాదిస్తూ ఉండిపోయాను నేను.

చంద్రోదయమయ్యేవరకూ ఇద్దరం అక్కడే ఉండి అలా అప్పుడప్పుడూ సాయం సంధ్యలో డెక్ మీదకెళ్ళి.. ఆ అందాలతో మనసులను నింపుకునేవాళ్ళం.

కొన్నాళ్ళకి ఇద్దరి మధ్యా కాస్త సాన్నిహిత్యం ఏర్పడింది.

అంటే.. మేమిద్దరం ఒకరికి ఒకరం బాగా దగ్గరై.. ఏవేవో చిలిపి కబుర్లు చెప్పుకునేటంత సన్నిహితులయ్యామని కాదు.

చూపులతోనే ఒకరినొకరం పలకరించుకునే వాళ్ళం. ఆ చూపులతోనే ఒకరిపై మరొకరికి ఇష్టాన్ని వ్యక్తం చేసుకునేవాళ్లం. ఇష్టం అంటే.. అంటే.. ఇష్టమే! ఆ ఇష్టానికి ఇంకా స్పష్టత లేదు...

★ ★ ★

ఆ సాయంత్రం వేళ...

నేను మామూలుగా సంధ్యా సమయపు అందాలను ఆస్వాదిస్తుంటే ఆమె వచ్చింది.

వచ్చి.. నింగిలోని చంద్రుణ్ణి చూడకుండా నావంక చూస్తూ నిలబడింది.

"ఏం కావాలీ? ఏదన్నా చెప్పాలనో లేక అడగాలనో అనుకుంటున్నావా? "

"నాకు చాలా దాహంగా ఉంది. ఓడలోని గదులన్నీ వెతికి చూశాను. ఎక్కడా నీళ్ళు లేవు. కేబిన్‌లో ఉన్నయ్యంటున్నారు. వెళ్ళి అడగనా? " వెళ్ళటానికి తటపటాయిస్తున్నట్లుగా అంది.

"నీళ్ళు తాగాలంటే వెళ్ళాలిగా మరి? "

మారు మాట్లాడక వెళ్ళిపోయిందామె.

'కొంచెం కటువుగా మాట్లాడానా ఏం? ' నన్ను నేను ప్రశ్నించుకున్నాను.

అలా వెళ్ళిన ఆమె చాలా సేపటి వరకూ తిరిగి రాకపోవటంతో నేనూ వెళ్ళాను. భయవిహ్వలయై కేబిన్‌లో ఓ పక్కగా ముడుచుకుని కూర్చుని ఉందామె. అప్పటికే పూటుగా మద్యం తాగివున్న ఆంగ్లేయ

> ## కొత్తగాలి...
>
> **వెయ్యేళ్లకు**
> **మించి ఆశ!**
> **వందేళ్లకు**
> **మించని శ్వాస!!**
>
> – ఎ. జనార్దనం,
> విశాఖపట్నం

ఓవర్‌సీర్ ఇంకా మైకం పెంచుకోటానికా అన్నట్లు మరో బాటిల్ పట్టిస్తున్నాడు.

నన్ను చూడగానే ఆమె చటుక్కున లేచి వచ్చి నా వెనకాల నిలబడింది. అది చూసిన ఓవర్‌సీర్ కోపంతో ఊగిపోతూ హంటర్‌తో నా తలపై బలంగా కొట్టాడు.

నేను కింద పడిపోయాను.

దెబ్బ తగిలిన చోటు నుండి రక్తస్రావం మొదలైంది.

ఆమె తన శక్తినంతా కూడగట్టుకుని కష్టపడి నన్ను లేవదీసి.. ఆసరా ఇచ్చి కేబిన్ బయటకు నడిపించింది.

ఇద్దరం మెల్లగా నడుస్తూ.. ఓడలో నేను నివసించే చోటికి వచ్చాం.

తన చున్నీలోనుంచి కాస్త ముక్కను చించి.. ఆ తడిగుడ్డతో నా గాయానికి కట్టుకట్టిందామె.

అప్పుడప్పుడూ తడిగుడ్డతో గాయాన్ని శుభ్రంచేస్తూ.. తెల్లవార్లూ నా పక్కనే కూర్చుంది. ఎక్కడనుంచో కాస్త పసుపు తెచ్చి గాయానికి అద్దింది.

తెల్లవార్లూ మేం మౌనంగా ఉన్నా మా మనసులు మాట్లాడుకుంటూనే ఉన్నాయ్.

'ఒకరికోసం ఒకరం' అనుకున్నాయి.

మా ప్రేమకథ అలా మొదలైంది.

★ ★ ★

రెండు రోజుల వరకూ నీరసంగా పడి వున్న నేను, మూడోరోజు సాయంత్రం డెక్ మీదకు వెళ్లేసరికి.. ఆమె ఓ మూలగా నిల బడి నీలాకాశం వంక చూస్తోంది.

"ఎవరికోసం ఎదురు చూస్తున్నారు? " అన్నాను, ఆమె పక్కనే నిలబడుతూ.

"నాకు ఇష్టమైన వారికోసం"

"ఎప్పుడు వస్తారూ? "

"ఇదుగో! వచ్చేసారుగా!" అంటూ చూపుడు వేలితో నన్ను చూపిస్తూ సిగ్గుతో తలదించుకుంది.

"ఇంత తొందరగా మనసిచ్చేశావా? "

"మీరు.. ఆ రాక్షసుని బారిన పడకుండా నన్ను కాపాడి, నా మానమర్యాదలను నిల బెట్టారు. ఈ సుదీర్ఘయాత్రలో.. రకరకాల లూటీ కోరులతో కలిసి ప్రయాణించాల్సిన అబలను నేను. నాకు తోడుగా ఉండి నన్ను కాపాడే వ్యక్తే నాకు కావాలి. నా మనసు మిమ్మల్ని వరించింది. హృదయం తన సమ్మతిని తెలియజేసింది" అంటూ తలవంచుకుంది.

ఆమె బుగ్గలు సిగ్గుతో ఎర్రగా కెంపుల్లా మారటం నేను గమనించక పోలేదు!

అంతలో మహావీర్ అక్కడకు రావటంతో దీటుగా జవాబివ్వలేకపోయాను.

ముగ్గురం మరి కాసేపు నిలబడి సము ద్రాన్నీ.. ఆకాశాన్నీ చూస్తూ గడిపాం.

తనకు వచ్చిన గీతా శ్లోకాలను లయబ ద్ధంగా చదివి వినిపించాడు మహావీర్.

ఆ తరవాత అతను కూడా మాతోపాటు డెక్‌మీదకు వచ్చేవాడు. ముగ్గురం చాలా సేపు కూర్చుని.. మా కష్టసుఖాలను మాట్లాడుకునేవాళ్లం. ఒకరికొకరం చేతనైన సహాయం చేసుకుంటూ స్నేహితుల మయ్యాం.

ఒకసారి మహావీర్‌కు తీవ్రంగా జ్వరం వచ్చింది. కూర్చున్నచోటనే పడివున్నాడని తెలిసి, నేను వెళ్లి అతని తలను నా ఒళ్లో పెట్టుకు కూర్చుని.. ధైర్యం చెప్పసాగాను.

అక్కడికి వచ్చి పరిస్థితిని గమనించిన లాజవంతి, ఓ పల్చటి తెల్లటి బట్టను తడ వ తడవకూ తడిపి.. అతని నుదుటి మీద వేస్తూ.. తెల్లవార్లూ మేలుకునే ఉంది.

అతను దాహం అన్నప్పుడల్లా కొంచెం మంచి నీళ్లు తాగించింది.

మరుసటి రోజు మధ్యాహ్నానికి అతను కాస్త కోలుకున్నాడు.

"దోస్త్! నువ్వు మహత్తరమైన సేవచేసి నా ప్రాణాలు నిలబెట్టావు. ఇప్పుడున్న పరి స్థితులలో బదులుగా నీకేం ఇవ్వగలనూ? నీకు నేను దాసుణ్ణయిపోతున్నాను. అవస రమైనప్పుడు నీ కోసం ప్రాణాలివ్వటాని కైనా సిద్ధమే" అంటూ, లాజవంతి వేపుకు తిరిగి "అమ్మాయీ! నీక్కూడా రుణపడి ఉన్నాను. ఇది తీర్చుకోలేనిది" అన్నాడు.

ఈ మాటలు అంటుంటే అతని కంఠ స్వరం గద్గదమైపోయింది. కన్నీళ్లు జల జలా రాలిపడ్డాయి.

★ ★ ★

గమ్యం తెలిసినా, దాన్ని చేరుకోవాలంటే ఇంకా ఎన్నిరోజులు పడుతుందో తెలియని మా సుదీర్ఘమైన ఓడ ప్రయాణం అలా



అలా కొనసాగుతూనే ఉంది.

ఆ ప్రయాణంలో మేం పడిన బాధలు అన్నీ ఇన్నీ కావు.

ఎంతోమంది సహ ప్రయాణికులు ప్రాణాలు కోల్పోయారు. అన్నానికీ నీళ్లకీ అల్లాడిపోయి నానా అవస్థలూ పడ్డాం.

ఓవర్‌సీర్‌ని ఎప్పుడడిగినా.. ఏదడిగినా, "రెండూమూడు రోజుల్లో ద్వీపం చేరిపోతాంగదా.. సర్దుకుపోండి. చీటికిమాటికి నన్ను చిరాకు పెడితే ఖబడ్దార్" అంటూ కళ్లెర్ర జేసేవాడు. మళ్లీ మాట్లాడితే హంటర్ తీసి చావబాదేవాడు.

అసలు మేం అడగటమే అపరాధమన్నట్లుగా బండబూతులు తిట్టేవాడు. దారీ తెన్నూ తెలీక... మాగోడు వినే దిక్కు లేక... ఓడలోని ప్రయాణికులమైన మా అందరి హృదయాలూ చేసిన ఘోష ఆ సాగర ఘోషలో కలిసి పోయింది.

★ ★ ★

ఆ ఓడ అలా ఆ సముద్రమార్గంలో ముందుకు సాగుతూ ఉండగా... మేమందరం నిస్సహాయులమై అందులో కిక్కురుమనకుండా ప్రయాణిస్తూ ఉండగా.. ఓ ఉదయం వేళ... బాలభానుని లేలేత కిరణాలు సముద్రమంతటా పరుచుకుంటున్నాయి. ఆ అరుణకాంతి కలిసి సముద్ర

సలిలాలు మిలమిలా మెరుస్తున్నాయి. రమ్యమైన ఆ రమణీయ దృశ్యాన్ని ఆస్వాదిస్తూ.. ఆనందించ యత్నిస్తున్న నేను...

"అదిగో మారిషస్!"

అల్లదిగో బంగారుద్వీపం.

అవిగో అడవులు... ఇవిగో కొండలు!

అవిగో అవిగో పర్వతాల బారులు... ఇవిగో ఇవిగో మహావృక్షాల వరుసలు" అంటూ ఓడలోని ప్రయాణికులు కొందరు ఉద్విగ్నితతో... ఉల్లాసభరితమైన కంఠస్వరాలతో... కేకలు వెయ్యటం విని ఉలిక్కిపడ్డాను.

మిగిలిన ప్రయాణికులందరిలో కూడా కలకలం బయల్దేరింది.

అందరం ఎక్కడ కూర్చున్నవాళ్లం అక్కడే నిలబడి, మెడలు సారించి... రెండు కళ్లూ విప్పార్చుకుని మరీ చూడసాగాం.

క్షణక్షణానికీ దగ్గరవుతున్న దృశ్యాలను చూసి "వచ్చేశాం మారిషస్‌కి. బంగారు భూమికి" అంటూ ఓడలోని ప్రవాసులందరూ పెద్దపెట్టున అరిచారు.

ఆ ద్వీపం చాలా అందంగా కనపడుతోంది. దానికి నలువైపులా దట్టమైన అడవులు ఉన్నాయి. ఆ అరణ్యాలలోని ఆకుపచ్చని చెట్ల గుబురులలో నుంచి పక్షుల కుహూకుహూ రావాలు వినిపిస్తున్నాయి.

ఆ మహావృక్షాల చాటు నుంచి, నీలినీలి కొండలు... చెయ్యి తిరిగిన ఓ గొప్ప చిత్రకారుడు గీసిన చిత్రంలాగా... మన్మోహనంగా దర్శనమిస్తున్నాయి.

ఆ పర్వతాలపైన.. వినీలాకాశంలో నల్లని మబ్బులు గుంపులు గుంపులుగా పరుగులు తీస్తున్నాయి. ఆకుపచ్చని ఆ అడవులలోని ఎత్తైన చెట్ల మీద నుంచి, రకరకాల పక్షులు... రంగు రంగుల పక్షులు... బారులు బారులుగా సముద్రం వేపుకు తరలి వస్తున్నాయి.

తళతళమెరిసే ఇసుకతో ఆ ద్వీపం నలువైపులా ఉన్న సముద్రతీరం... అద్భుత సౌందర్యంతో అలరారుతూ... మహత్తరమైన ప్రకృతి దృశ్యాలను ఆవిష్కరింపజేస్తోంది.

ఆ అందమైన అద్భుత దృశ్యాలను తిలకిస్తున్న మా అందరి హృదయాలూ ఉల్లాస తరంగాలతో ఉప్పొంగసాగాయి.

'ఆహా! ఈ బంగారు ద్వీపం ఎంత వైభవంగా కనపడుతోంది! ఈ వైభవాన్ని చూడటానికి నోచుకున్న కన్నులే కన్నులంటారు. అటువంటిది.. ఏకంగా ఇక్కడ నివసించటానికి వస్తున్న మనమెంత అదృష్టవంతులం! ఈ ద్వీపంలో రాళ్ళు దొర్లిస్తే చాలు.. బంగారం దొరుకుతుందిట బంగారం!' అనే భావనా తరంగాలు.. ఆడా మగా తేడా లేకుండా అందరి మనసులలో ఉవ్వెత్తున ఎగసిపడసాగాయి.

'స్వర్ణద్వీపం! స్వర్ణద్వీపం!' అనే కేకలతో ఓడంతా దద్దరిల్లిపోయింది. ఎట్టకేలకు మా ఓడకు పోర్ట్ లూయిస్ ఓడరేవులో లంగరు వేశారు.

★ ★ ★

సముద్ర తీరమంతటా ఒత్తుగా పరుచుకుని ఉన్న ఎండిపోయిన ఇసుకా... భయం కలిగించే భీకర అరణ్యాలూ.. మమ్మల్ని స్వాగతించాయి.

నేను ఆ ఇసుకలో కుడికాలు పెడుతూండగానే.. ఆ ఓవర్‌సీర్.. అతనే ఓడలోని కేబిన్లో లాజవంతిని బెదిరించి కూర్చోబెట్టినవాడు, నన్ను చూస్తూనే గబగబావచ్చి ముఖాన తుపుక్కున ఉమ్మేస్తూ.. కాలితో బలంగా ఒక్కతాపు తన్నాడు.

సంబాళించుకోలేని నేను సముద్రంలో పడి కొట్టుకుపోసాగాను. గబుక్కున సముద్రంలోకి దూకి, ఈదుతూ వచ్చిన మహావీర్ నన్ను రక్షించకపోయివుంటే.. ఈత రాని నేను మునిగిపోయేవాణ్ణే.

ఈ మారిషస్‌లో నా జీవనయాత్ర తొలి

రోజు, అలా ప్రాణాపాయంతో మొదలైంది.

"అపాయం నుంచి కాపాడి, ప్రాణాలు నిలిపి బతుకంతా నీకు రుణపడేట్లు చేసుకున్నావు. నీ కోసం ఏం చెయ్యమంటావో చెప్పు దోస్త్!" అంటూ అతని రెండు చేతులూ పట్టుకున్నాను నేను.

"ఈ స్నేహాన్ని చిరకాలం నిలుపుకుందాం. ఇక్కడ ఎటువంటి పరిస్థితుల్లో బతకాల్సివస్తుందో తెలీటంలేదు" అన్నాడతను. మారిషస్ తీరంలో మేం అడుగుపెట్టగానే జరిగినదాన్ని జీర్ణించుకోలేక బెంబేలుపడిపోయాడు.

మళ్లీ "నన్ను ఎప్పటికీ గుర్తుంచుకో" అంటూ సస్నేహంగా నా భుజం తట్టాడు.

కన్నీరు కార్చింది లాజవంతి.

మా ఉత్సాహం.. ఉల్లాసం.. సంతోషం.. అన్నీ ఆవిరైపోయాయి.

మా ముగ్గురి ముఖాలపైనా అదోరకమైన ఉదాసీనత ఆవరించుకుంది.

★ ★ ★

"మోసం! దగా!

ఈ ఆంగ్లేయులు మనల్ని ముంచేశారు. ఇక్కడ రాళ్ళెత్తితే బంగారం దొరుకుతుందని అబద్ధపు ప్రచారం చేసి.. ప్రలోభపెట్టి.. బాండ్‌మీద సంతకాలు చేయించుకుని, వేలిముద్రలు వేయించుకునీ.. తప్పించుకునేందుకు వీల్లేకుండా మనందర్నీ బంధించేశారు. మనం తెల్లవాళ్ళకు బానిసలుగా మారిపోయాం. ఇప్పుడు మనకు సహాయం చేసేవారెవరూ లేరు. చాలా చవకగా అమ్ముడుపోయాం" అనుకుంటూ, ఓడ దిగిన కాసేపటికే అసలు నిజం తెలుసుకున్న భారతీయ ప్రవాసులందరూ భోరున విలపించసాగారు.

మాకు తగిలిన ఎదురు దెబ్బనుంచి కాస్త తేరుకున్నాక మేం ముగ్గురం కూడా వచ్చి, వాళ్ళతో కలిసాం.

"సముద్రతీరంలో చాలాచోట్ల రాళ్ళను దొర్లించి చూశాం. బంగారం లేదు, పాడూ లేదు. ఎక్కడపడితే అక్కడ బండరాళ్ళే ఉన్నాయి" అన్నారు కొందరు.

'నిర్బల్ కే బల్ రామ్ గోసాయీ' అంటూ అందరి మాటలూ వింటున్న బ్రాహ్మణుడు రామాయణాన్ని కళ్ళకి అద్దుకుంటూ ఎలుగెత్తిచాటాడు.

"అంటే ఏమిటి బాపూజీ? " అని అడిగారు కొందరు.

"ఇది సూర్యచంద్రులు ఉన్నంతవరకూ చిరస్థాయిగా నిలిచే రామాయణంలోని పద్యపాదం. 'నిర్బల్ కే బల్ రాంగోసాయీ' అంటే.. దిక్కులేనివారికీ, బలహీనులకీ ఆ రాముడే దిక్కు, ఆయనే బలం అని అర్థం" వివరించాడు బ్రాహ్మణుడు.

> **కొత్తగాలి...**
>
> **సూర్యచంద్రులు**
> **అందాలు చూసుకునే**
> **అద్దం - సముద్రం!**
>
> – రఘుశ్రీ

"రాముడంటే దేవుడు. ఎవరు నమ్ముకున్న దేవుడు వాళ్ళకు దిక్కు అవుతాడు, పేరేదయినా కానీ" అని కూడా వ్యాఖ్యానించాడు.

"అలాగా! ఇప్పుడు మనం మూకుమ్మడిగా దిక్కులేనివాళ్ళమయ్యాం గదా! మనకందరికీ కూడా ఆ దేవుడే దిక్కు" అనుకుంటూ మేమందరం కలిసి 'నిర్బల్ కే బల్ రాంగోసాయి' అని దిక్కులు పిక్కటిల్లేటట్లుగా అరుస్తూ రోదించసాగాం.

ఆర్తితో నిండిన మా రోదనలు ఆ నిశ్శబ్ద సముద్ర తీరమంతటా వ్యాపించసాగాయి.

★ ★ ★

అందరూ దిగారో లేదోనని ఓడలో చెక్ చేసుకున్న తర్వాత.. అందరినీ వరుసలలో నిలబెట్టి నెంబర్లు కేటాయించారు. ఇకమీదట ఆ నెంబర్లతోనే పిలుస్తారట.

నా నెంబరు 340. నా పక్కనే ఉన్న లాజవంతి నెంబరు 341.

ఆ తతంగం పూర్తయ్యాక ప్రవాసులందరినీ 'ఇమిగ్రేషన్ స్క్వేర్'కు తీసుకువెళ్ళారు. రెండు రోజులు అక్కడే గడిపాం. ఓడలోని పరిస్థితులే అక్కడా ఉన్నాయి. కాళ్ళు జాపుకోవటానికి కూడా చోటులేదు. సరైన తిండి లేదు. అక్కడ కూడా ఒకతను మృత్యువాతన పడ్డాడు.

అతను తనతో తెచ్చుకున్న బాణలిని నేను జాగ్రత్తగా నా దగ్గర ఉంచి.. ఓ ఆంగ్లేయ ఓవర్‌సీర్‌కు ఇచ్చేశాను.

తర్వాతి రోజున...

కూలీల విభజన కోసం మమ్మల్నందరినీ వరుసలలో నిలబెట్టారు. కన్నుల్లో నీరు నింపుకుని నా వెనకాలే నిలబడింది లాజవంతి. "ఈ మారిషస్‌లోని ఎత్తైన పర్వత శిఖరాలనెక్కి.. నా కనుచూపు మేరకూ... కనిపించిన ప్రపంచాన్నంతటినీ చూడాలని కలలు గన్నాను నేను. ఇక్కడ నచ్చకపోతే నచ్చినచోటికి వెళ్ళిపోవాలనుకున్నాను. అయితే కూలిన భవన శిథిలాల మధ్య ఇరుక్కున్నట్లయింది నాపని. ఈ చకోరి ఇప్పుడు తన చంద్రుణ్ణి అందుకోగలదా?" నాకు మాత్రమే విన్పించేలా చెబుతున్న ఆమెకంఠం రుద్ధమైపోయింది.

"నువ్వేం చింత పెట్టుకోకు. నువ్వు ఎక్కడికీ వెళ్ళలేకపోయినా.. నీకోసం నేను వెతుక్కుంటూ వస్తాను. మన జీవన ఆకాశంలో చంద్రోదయమైన రోజున.. చకోరం, చకోరిలమైన నేనూ, నువ్వూ ఒకటవుదాం. ఆపైన జీవితాంతం కలిసే ఉందాం! నీకే కష్టం రాకుండా చూసుకుంటాను" నేను కూడా ఆమెకు మాత్రమే వినపడేటట్లుగా మెల్లగానే చెప్పాను.

"చాలు. మీ మాట చాలు! మీరున్నారనే భరోసాతోనే నేను ఈ కొత్త ప్రదేశంలో ప్రాణాలు నిలుపుకుంటాను" నా చెయ్యి గట్టిగా పట్టుకుంటూ అందామె.

★ ★ ★

'బంబూ!'

ప్రవాసకూలీలు నివసించటానికి బ్రిటిషు వారు కట్టించిన ఆవాస ప్రాంతం పేరది.

వరుసకు ఇరవై చొప్పున ఇరవై వరసల్లో తాటాకు గుడిసెలు వేయించారు. వెదురు బద్దలతో చేసిన తడికలను, ఇరువైపులా పేడతో అలికించి గోడలుగా నిలబెట్టారు.

తలుపులు కూడా అటువంటివే.

ఒకే ఒక్క గది!

వండుకున్నా.. తిన్నా, పడుకున్నా.. పిల్లలు ఆడుకున్నా, ఇంటికి ఎవరన్నా వచ్చినా.. ఏం చేసినా.. అన్నీ అక్కడే!

వరుస నెంబర్ల ప్రకారం మమ్మల్ని వెళ్ళి ఆ తడికల గదుల్లో ఉండమని ఆదేశించారు. ఇక అవే మాకు శాశ్వత నివాస గృహాలని తెలియజేశారు. కింద మట్టి నేల మీద పరుచుకు పడుకోవటానికి గోనె సంచులను సిద్ధం చేశారు.

నెంబర్ల ప్రకారం నాకూ, లాజవంతికీ పక్కపక్క గదులే వచ్చాయి.

★ ★ ★

పొద్దున్నే మగవాళ్ళమందరం అడవుల్లోకి వెళ్ళి పెద్దపెద్ద చెట్లను కొడుతూ సూర్యాస్తమయం వరకూ పన్జేసేవాళ్ళం.

ఆడవాళ్ళు చెరుకు తోటల్లో నీళ్ళు పెట్టటం, ఎరువులు వెయ్యటం, కలుపు తియ్యటం, ఓవర్‌సీర్లు.. ఆపై అధికారులకు మంచినీళ్ళు అందించటం లాంటి పనులు చేసేవారు.

ఎవరెవరు ఏయే పనులు చెయ్యాలో తెల్లదొరలు నిర్ణయించేవారు. ఎప్పటికప్పుడే ఆర్డర్లు ఇచ్చేవారు. వారంలో ఆరు

## అంతరిక్షంలో అపురూప అనుభవం

మానవుడికి విశ్వం కాలనీగా మారుతుందని విజ్ఞులు చెబుతుంటారు. అది నిజమే అనిపిస్తుంది. ఒకనాడు భార రహిత అనుభవం కేవలం ఏస్ట్రొనాట్స్‌కి, శాస్త్రజ్ఞులకి మాత్రమే అనుభవంలోకి వచ్చేది. నేడది సామాన్యులకి కూడా అనుభవంలోకి తెచ్చేందుకు ఫ్రాన్స్‌కి చెందిన 'నోవ్‌స్పేస్' అనే కంపెనీ వ్యాపారాన్ని ఆరంభించింది.



ఇటీవల కొందరు బ్రిటిష్ పర్యాటకులు మాస్కో మీద జీరో గ్రావిటీలో భూమి ఉపరితలంపై ఓ వాహనంలో భార రహితంగా ఎగిరారు. ఇంతకు మునుపు కొందరు ఫ్రెంచ్ పార్లమెంట్ సభ్యులు, జర్నలిస్టులు కూడా ఈ అనుభవాన్ని పొందారు. నేషనల్ సెంటర్ ఫర్ స్పేస్ స్టడీస్ అనే ఫ్రెంచ్ సంస్థ నడిపే 'నోవ్‌స్పేస్' అనే కంపెనీ ఇందుకోసం ఏర్‌బస్ ఏ-300ని ఉపయోగిస్తోంది. ఈ కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్, మాజీ ఆస్ట్రోనాట్ జీన్ ఫ్రాంకోయిస్ ఇందుకోసం నాలుగువేల యూరోలని వసూలు చేస్తున్నారు. 2012 జులై దాకా నలభై మంది ప్రయాణీకులు ఈ సౌకర్యాన్ని వినియోగించుకున్నారు. అయితే ఇలాంటి కంపెనీ ప్రపంచంలో ఇది మూడోది. ఇప్పటికే అమెరికా, రష్యాలలో ఇలాంటి వ్యాపార సంస్థలు ఉన్నాయి. 'రోలర్ కోస్టర్‌ని ప్రజలు, అందులోని థ్రిల్‌ను అనుభవించడానికి ఎలా ఎక్కుతారో, అలాగే ఈ విమానాన్ని ఎక్కుతున్నారు' అని ఫ్రాంకోయిస్ చెప్పాడు. అర నిమిషంపాటు ప్రయాణీకులు భార రహిత స్థితిని అనుభవిస్తారు. అకస్మాత్తుగా విమానంలోని వత్తిడిని అర నిమిషం పాటు తొలగించడంతో వీరు ఈ స్థితిని అనుభవిస్తారు.

రోజులు అలా సూర్యోదయం.. సూర్యాస్తమయం ఎప్పుడయ్యాయో తెలీకుండా కష్టపడి పని చేశాక, ఏడో రోజైన ఆదివారం సెలవు దొరికేది. ఆ రోజున నది దగ్గరకు వెళ్ళి అందరం బట్టలు ఉతుక్కునేవాళ్ళం. తలారా స్నానాలు చేసేవాళ్ళం.

ఇతర కూలీలందరిలాగానే.. నా వంట నేను చేసుకుని, నా బట్టలు నేను ఉతుక్కునేవాణ్ణి. ఇది లాజవంతికి సుతరామూ ఇష్టం ఉండేది కాదు. నా పనులు తను చెయ్యాలని ఉబలాటపడేది.

"ప్రస్తుతం మన మధ్య ఇదీ అని చెప్పుకోదగిన సంబంధం ఏమీ లేదు. ఉన్నది మానసిక అనుబంధం మాత్రమే. అది నలుగురుకీ తెలీనిది. చనువుగా నా పనులు నువ్వు చేస్తే ఇద్దరం అపవాదుల పాలవుతాం. మన చుట్టూ ఉన్నది భారతీయ సమాజమే కదా! మనకు కొన్ని కట్టుబాట్లు ఉన్నయ్ కదూ!" అంటే, అవునని తల ఊపి... నా పనులు నేను చేసుకుంటుంటే బాధపడకుండా మామూలుగా ఉండటానికి ప్రయత్నించేది. రాత్రి చీకటి వేళ.. ఎవరికంటా పడకుండా వచ్చి, నా తడిక తలుపు తట్టి, రొట్టెలు, కూర అక్కడ పెట్టి మెదలకుండా వెళ్ళిపోయేది.

మా 'బంబూ' బస్తీలో హిందువుల సంఖ్య గణనీయంగానే ఉంది. వారిలో హిందీ, తమిళం, మరాఠీ వగైరా రకరకాల భారతీయ భాషలు మాట్లాడేవారున్నారు. ఎక్కువ మందికి అరకొరగా వచ్చిన హిందీ అందరికీ అనుసంధాన భాషగా ఉండేది.

హిందీ బాగా వచ్చిన బ్రాహ్మణుని

ఇంట్లో.. ఓ ఆదివారంనాడు బస్తీవాసులం అందరం కలుసుకున్నాం.

మా అందరికీ సరైన హిందీ నేర్పమని ఆ పండితుణ్ణి అడిగాం. ఆయన సంతోషంగా అంగీకరించి, సముద్రతీరంలోని ఇసుకలో హిందీ వర్ణమాలను రాసి దిద్దిస్తూ.. నేర్పించటం మొదలుపెట్టాడు. ఈ హిందీ శిక్షణ కార్యక్రమం రోజూ సాయంత్రం వేళ జరిగేది. ప్రతి ఆదివారం నాడూ అందరూ అందరితో కలవటంతో.. మా బస్తీ ప్రవాసులందరి మధ్యా చక్కటి అనుబంధం ఏర్పడసాగింది.

"ఇక్కడ ఇంత గొడ్డు చాకిరీతో.. ఆరురోజులూ తలెత్తి చూడటానికి కూడా వీలులేకుండా గడిచిపోతున్నాయి. ఇలా అయితే మన ఆయుష్షు తగ్గిపోదూ? " అన్నారు కొందరు.

"నిజమేకానీ.. అది తప్పనప్పుడు.. తప్పించుకునే మార్గం లేనప్పుడు, మనం దాన్ని గురించే ఆలోచించకుండా, వేరే విషయాల మీదకు మనసులను మళ్ళించి, మంచి ఆహ్లాదకరమైన వాతావరణాన్ని కల్పించుకోవాలి. నేను రామాయణ ప్రవచనం చేస్తాను. ఏ నాటికైనా ఆ దేవుడే మనందరికీ దారి చూపించి, మనని కాపాడతాడనే నమ్మకంతో ముందుకుపోవాలి" ధైర్యం చెప్పాడు బ్రాహ్మణుడు.

"ఈ రాత్రి నుంచే ప్రవచనాలు ప్రారంభిస్తాను" అన్నాడాయన వెనువెంటనే.

"నేను చౌపాయిలు నేర్పుతా" అన్నాడు ఒడలో వాటిని పాడిన యువకుడు.

ఆ రాత్రి ప్రవచనం అయ్యాక, పాడి వినిపించాడు కూడా. లాజవంతి తనకు నచ్చిన స్తోత్రాలనూ, స్తవాలనూ పాడి వినిపించి, "వీటిని నేను నేర్పించగలను" అంది.

నేనూ, ఆమె.. ఆ యువకుని దగ్గర చౌపాయిలను నేర్చుకుని పాడసాగాం.

త్వరలోనే.. మేమందరం ఒకరితో

ఒకరం అభిప్రాయాలను వ్యక్తం చేసుకో గల స్థాయిలో హిందీ భాషను నేర్చుకుని మాట్లాడుకోసాగాం. కాలం గడుస్తున్నకొద్దీ మా బస్తీవాసులందరి మధ్యా స్నేహం చిక్కపడసాగింది.

★ ★ ★

"వీళ్ళిద్దరూ కూడా అవివాహితులే! జోడీ బాగుంది. మళ్ళీ ఆదివారంనాడు వీళ్ళ పెళ్ళి జరిపిస్తే బాగుంటుంది. ఏమం టారూ? " ఓ సమావేశంలో నన్నూ లాజ వంతినీ నలుగురికీ చూపిస్తూ అన్నాడు బ్రాహ్మణుడు.

అందరూ సంతోషంగా చప్పట్లు కొడు తూ ఆమోదం తెలియజేశారు. పట్టరాని సంతోషంతో ఉక్కిరిబిక్కిరయ్యాను నేను.

మనసు పరవశించిపోతుంటే.. సిగ్గుల మొగ్గే అయింది లాజవంతి. మా పెళ్ళి ఏర్పాట్ల విషయంలో తర్జనభర్జనలు జరు గుతున్నప్పుడే.. కొందారు బెంగాలీవారు మరొక ప్రస్తావనను ముందుకు తెచ్చారు. మా బస్తీలో అన్ని లైన్ల వారికీ అనువుగా ఉండే ఒక సందు చివర కాళీ మాతను ప్రతిష్ఠించుకుందామన్నారు.

ఆరోజు ఉదయమే అమ్మవారి విగ్రహ ప్రతిష్ఠాపన జరపాలనీ, మధ్యాహ్నం మా వివాహం జరిపించి.. నూతన దంపతు లను ఊరేగింపుగా తీసుకువెళ్ళి, అమ్మవారి చరణస్పర్శ చేయించాలనీ నిశ్చయించారు.

★ ★ ★

అనుకున్న ప్రకారమే అందరూ కలిసి మా వివాహాన్ని ఉన్నంతలో ఘనంగానే జరిపించారు. చాలామంది ఊరేగింపులో పాల్గొని, మమ్మల్ని అమ్మవారి వద్దకు తీసు కెళ్లి ఆ మాత చరణస్పర్శ చేయించారు.

ముత్తైదువలు మాతకు అద్దిన సిం ధూరాన్ని తీసి కొత్తపెళ్ళి కూతురైన లాజ వంతి పాపిట్లో అలంకరిస్తూ "ఈ జగజ్జ నని నిన్ను సదారక్షించు గాక! మీ జంటకు శుభం కలగాలి" అని ఆశీర్వదించారు.

ఆ మధ్యాహ్నం అందరం కలిసి అక్కడే భోజనాలు చేశాం.

ఆ రాత్రి సంప్రదాయబద్ధమైన వేడుక లన్నీ జరిపాక, ముత్తైదువలు లాజవంతిని నా గదిలోకి పంపిస్తూ "ఈ అమ్మవారి సింధూరం నీ నుదుట ఉన్నంతకాలం మిమ్మల్నెవరూ వేరు చేయలేరు. అలాగే మీరిద్దరూ ఈ సిందూరం పవిత్రతను కాపా డుతామని ప్రతిజ్ఞ చెయ్యాలి" అన్నారు.

"నా పాపిట్లోని సిందూరపు పవిత్రతకు భంగం వాటిల్లిన రోజున నేను ప్రాణాలతో ఉండను" ప్రతిజ్ఞ చేసింది లాజవంతి.

"అటువంటి పరిస్థితి నేనెన్నడూ రాని వ్వను" మనస్ఫూర్తిగా మాటిచ్చాను నేను.

★ ★ ★

"నేను మిమ్మల్ని నా ప్రాణం కన్నా మిన్నగా ప్రేమిస్తున్నాను. అయితే... ఆ ప్రేమను వ్యక్తీకరించటం నాకు చేతకాదు. అంతమాత్రాన మీ మీద నాకు ప్రేమలేద నుకోకండి. నేనొక మట్టి ముద్దను. నన్ను మీకు కావలసిన తీరులో మలచుకోండి" ఆ తొలిరేయిన నా బాహువుల్లో ఇమిడి పోతూ అంది లాజవంతి.

"ఓసి పిచ్చిదానా! ప్రేమంటే నేర్చుకుంటే వచ్చే ఒకానొక విద్యలాంటిది కాదు... దాన్ని నేర్పటానిక్కూడా కుదరదు. ఇరు హృదయాలలోనూ సహజంగా ఉప్పొం గుతూ రావలసిన మధుర భావం అది. నువ్వు నన్ను ప్రేమిస్తున్నావో లేదో నాకు తెలుసులే" అంటూ ఆమెను మరింత దగ్గ రకు తీసుకున్నాను.

తొలిరేయి మాకిద్దరికీ కొత్తకొత్త అనుభ వాల్ని అందించి, అలరింపజేసింది.

★ ★ ★

ఆ రోజుల్లో మా బస్తీలో ఎన్నో వివా హాలు జరిగాయి. యుక్త వయస్కులైన తమ పిల్లలకు తగిన సంబంధాలను పెద్ద

వాళ్ళే చూసి ముడి పెట్టేసేవారు.

పెళ్ళికి ముందే ఒకరికొకరం పరిచయమై.. ఒకరినొకరం కోరుకున్న తరువాత, దైవానుగ్రహంతో పెళ్ళి జరిగిన జంట మాది మాత్రమే!

★ ★ ★

"మన మనస్సులు గ్రహించి, ఈ మంచి పని చేసిన బ్రాహ్మణుని రుణం ఏమిచ్చి తీర్చుకోగలం? " అనేది లాజవంతి.

"ఏ మంచి పనీ? " అంటూ ఆమెను దగ్గరకు తీసుకుని ముద్దులాడేవాణ్ని నేను.

"ఇదే.. ఇదే.." అంటూ ఆమె సిగ్గుపడుతూ నా ఛాతీలో ముఖం దాచుకునేది.

## కొత్తగాలి...

**అక్షర సమూహం**
**కవిత్వం కాదు**
**కదలికే కవిత్వం**

*- జి.జి.కె. రావు,*
శ్రీకాకుళం

"అసలు ఆ పెద్దమనిషి పూనుకోకపోతే... మనకు పెళ్ళెలా అయ్యేదీ? " అనేది.

అలా మా కొత్త జీవితం ప్రారంభమైంది.

★ ★ ★

మామూలు జీవితం బానిసత్వపు తిరగలి రాళ్ళమధ్య నలిగిపోతూనే ఉంది. సంసార జీవితంలో మేం అనుభవిస్తున్న కొండంత సౌఖ్యాన్నీ, మా ప్రేమలనూ మరీ మరీ తలుచుకుంటూ.. దైనందిన జీవితంలోని కష్టాన్నీ, దుఃఖాన్నీ అధిగమించటానికి ప్రయత్నించసాగాం.

రోజురోజూకూ ఇనుమడిస్తున్న లాజవంతి సౌందర్యం, యవ్వనం.. నన్ను మురిపిస్తుంటే.. ఆ మురిపాల సాగరంలో మా సంసారనౌక సాఫీగా సాగిపోయింది.

★ ★ ★

ఒకరోజు అడవిలో నేనొక పెద్ద చెట్టును కొడుతూ ఉండగా, నాకు సాయానికి పంపబడ్డ మరోకూలీ "అశోక్! ఆ తెల్ల సైతాన్ల చెడుచూపులు నీ భార్యపైన పడినట్లున్నాయి. కాస్త జాగ్రత్తగా ఉండు" అంటూ నాకు మాత్రమే వినిపించేలా చెప్పాడు.

"ఏమిటా పిచ్చివాగుడూ? " అంటూ అతని మీద అంతెత్తున ఎగిరాను.

"నిజమే చెబుతున్నాను భాయీ! నిన్న చెరుకు తోటల్లోకి మంచి నీళ్ళు తీసుకువెళ్ళాను. అక్కడ ఆ సైతాన్! ఆ ఓవర్‌సీర్ ఉన్నాడు. ఓడరేవులో నిన్ను తన్నాడు చూడూ.. వాడే!

బాబీ వంక చూసి ఏవేవో సైగలు చేస్తూ.. ఏవేవో చెడ్డమాటలు అంటున్నాడు. అయితే నువ్వు చాలా అదృష్టవంతుడివి భాయీ! నీ భార్య లాజవంతి ఉత్తమ ఇల్లాలు. మంచి నడతగలది. ఆమె ఎవరి వంకా కన్నెత్తి చూడకుండా తన పని తను చేసుకుపోయే మనిషి గనుక సరిపోయింది" అన్నాడు.

సహ కూలీ చెప్పిన మాటలు విన్నప్పటి నుంచీ నాకు భయం పట్టుకుంది.

ఇక్కడ శ్వేతజాతి పెత్తందార్లు ప్రవాసీ మహిళా కూలీలపై చేస్తున్న అత్యాచారాలు నాకు తెలియనివి కావు.

ఓ తెల్లవాడి కన్ను ఏ ఆడదాని మీదన్నా పడిందంటే ఇక ఆమె కథ ముగిసినట్లే!

ఆమెను బతకనివ్వరు. మానం మంటగలిపేదాకా ఊరుకోరు. చక్కని అవయవసౌష్ఠవంతో.. విచ్చిన ముద్ద మందారంలా ఉన్న లాజవంతి సౌందర్యం అందరి కళ్ళలో పడుతున్న మాట నిజమే. ఎవరి కళ్ళా పడకుండా ఉంచటానికి ఆమె అసూర్యం పస్యయే, అంతఃపురాలలో మాత్రమే మసలే మహారాణి కాదుగా? భీకరారణ్యా

లలో, దట్టమైన చెరుకు తోటలలో, నీతీ జాతీలేని తెల్లవాళ్ళ అజమాయిషీలో పని చెయ్యవలసిన అతి సాధారణమైన ఓ ఆడకూలీ!

ఈ సంగతిని తలుచుకుంటూ నా మన సంతా వ్యాకులతతో నిండిపోయింది.

'నా అర్ధాంగికి ఏ ఆపద రానివ్వకు దేవుడా!' అని ఆ దేవుడినే ప్రార్థిస్తూ, ఈ విషయం గురించి చర్చించటానికి నేను ఆ సాయంత్రం బ్రాహ్మణుడి ఇంటికి వెళ్ళాను.

ఆయన కాసేపు మాట్లాడి "మహిళల విషయంలో మనమేం చెయ్యగలం? అలా అని చూస్తూ ఊరుకోనూలేం. నేనూ అదే ఆలోచిస్తున్నాను. మన ఆడవాళ్ళ మాన మర్యాదలను ఎలా రక్షించాలా అని! నాకేమీ పాలు పోవటం లేదు. లాజవంతి జాగ్రత్త! పాపం అభం శుభం తెలీని పిల్ల! ఎలా కాపాడుకుంటావేమో? " అన్నాడు.

ఆమెను గురించి మా బస్తీలో అందరూ అలాగే అనుకుంటారు. పైకి అదే అంటా రు. మా అందాల జంట అందరికీ కను విందు గొలిపితే, ఆమె సుగుణాలు అంద రికీ ముచ్చట గొలుపుతాయి. సుగుణాల రాశిగా అందరి మన్ననలూ పొందిన మహిళ లాజవంతి!

తనకు చేతనైన సహాయం అందరికీ చేసే మనస్తత్వం ఆమెది. జాలి గుండె కలది. అందరికీ కావలసిన మనిషామె.

★ ★ ★

నేను ఇంటికి తిరిగి వచ్చేసరికి లాజ వంతి ఉదాసీనంగా కనిపించింది. కించిత్ కోపంగా కూడా ఉంది.

సంగతేమిటని అడగ్గా అడగ్గా మహావీర్ వచ్చి వెళ్ళాడని చెప్పింది.

"వస్తేమటుకూ అంతకోపమెందుకూ? అతనేమన్నా ఎక్కువ తక్కువలుగా మాట్లా డాడా? " అని కాస్త గట్టిగానే అడిగాను.

"అబ్బే, అలాంటిదేం లేదు. 'బాబీ! బాబీ' అంటూ బాగా మర్యాదగానే మాట్లాడాడు"

"మరి? "

"ఆ మూర్ఖుడు ఇప్పుడు పెద్ద దొరకు చెంచాగా మారిపోయాడు. బంగళాలోనే ఔట్ హౌస్‌లో ఉంటున్నాడుట. తన యజ మాని సద్గుణ సంపదను గురించి బడాయి కబుర్లు చెబుతున్నాడు.

ఆయన చాలా మంచి మనిషట! ఎవ రిని పడితే వాళ్ళని చేరదియ్యడట! ఎంత గానో నచ్చిన వాళ్ళకే ఆశ్రయమిస్తాడట!

'ఇవన్నీ నాకెందుకు చెబుతున్నావ్? ' అని అడిగాను.

'ఊరికేనే! తెలుసుకుంటావనీ' అన్నాడు" అంటూ వివరంగా చెప్పింది లాజవంతి.

"నాకెందుకో భయంగా ఉంది" అని కూడా అంది.

"నీకేం కాదులే. ఏమిటీ అధైర్యం? " అంటూ ఆమె వెన్నుమీద మెల్లిగా నిము రుతూ ధైర్యం చెప్పాను.

ఏదో తెలీని భయం కొన్నిరోజుల పాటు ఇద్దర్నీ వెంటాడింది. అతను మళ్ళీ రాకపో వటంతో తర్వాత మామూలుగా అయ్యాం.

★ ★ ★

"మన వీధిలోని మధ్య ఇంట్లో స్త్రీకి ఈ మధ్యనే ప్రసవమైంది. మగపిల్లాడు పుట్టాడు. వాళ్లకు ఎస్టేట్ యజమాని, గోధుమలూ ఇతర రేషన్ సరుకూలూ కొంచెం ఎక్కువగా ఇస్తున్నాడు" ఓ రోజున మాటల సందర్భంగా అంది లాజవంతి.

"అంటే.. పెద్దదొర తన పొలం దున్న టానికి మరో ఎద్దును తయారు చేసుకుం టున్నాడన్నమాట" అన్నాను.

వెంటనే "వాళ్ళ సంగతి వదిలేయ్. మనకి మాత్రం పిల్లలు వద్దు" అన్నాను.

"ఎందుకనీ? మీకు పిల్లలంటే ఇష్టం లేదా? సూటిగా నా కళ్ళల్లోకి చూసి చెప్పండి" అంది.

"అలా అని కాదు. ఏడుమల్లెల ఎత్తు

సుకుమారివి నువ్వు. నిన్ను నేను కష్టపెట్ట దలుచుకోలేదు" అంటూనే, "పిల్లలను కని పెంచటమంటే మాటలు కాదు" అన్నాను.

"ఈ దేశానికి వచ్చేటప్పుడు నేను ఎండు కొమ్మలా ఉన్నమాట నిజమే. అయితే మీతో వివాహమయ్యాక ఆ కొమ్మకు నేవళం వచ్చింది మీ ప్రేమతో. దానికి పూలు పూసి కాయలుకాసే శక్తి వచ్చింది" సిగ్గుపడుతూ అంది.

మళ్లీ ఆమెనే "అయినా పిల్లలు వద్దను కునే మీ కోరిక నెరవేరదు. ఎందుకంటే ఇప్పటికే.." అంటూ తలొంచుకుంది.

ఆమెవంక సంభ్రమాశ్చర్యాలతో చూశాను. ఆ మాట నాకెంతో ఆనందం కలిగించింది కూడా నిజమే!

అయిదారునెలల తర్వాత మాకు మగపి ల్లాడు పుట్టాడు. మేం బాధ్యతగల తల్లిదం డ్రులమయ్యాం. బాబుకు రాజేష్ అని పేరుపెట్టి మురిపెంగా చూసుకోసాగాం.

ప్రసవమైన కొన్నినెలల తరువాత.. ఎంతో ప్రయత్నించి, నేను పనిచేసే చోటే లాజవంతి కూడా పని చేసేటట్లుగా ఏర్పాటు చేసుకున్నాను.

బాబును ఓ చెట్టుకు కట్టిన ఉయ్యాలలో వేసి, మా పనులు మేం చేసుకునేవాళ్ళం. మధ్యమధ్యలో వాడి అవసరాలు చూసే వాళ్ళం. లాజవంతి విషయంలో అందరూ జాగ్రత్తలు తీసుకునేవాళ్ళు.

ఆమె అందరికీ ఆప్తురాలైంది. ముద్దులొ లికే మా బాబును కూడా అందరూ మురి పెంగా చూసుకునేవారు. ఎవరికి ఏ కష్టం వచ్చినా ఆదుకుంటూ.. అందరికీ తలలో నాలుకలా ఉండేది.

★ ★ ★

రాజేష్ రెండేళ్ళవాడయ్యాక మాకు మరో అబ్బాయి పుట్టాడు.

వాడికి కూడా ఏడాది నిండాక, ఒకరో జున... నేను మా ఇంటిముందు చెట్టుకిం దున్న ఓ బండరాయి మీద కూర్చుని ఉన్నాను.

ఎస్టేట్ యజమాని పెద్దదొర మోటార్ బైక్ డుక్ డుక్ డుక్ డుక్ మని చప్పుడు చేసుకుంటూ అటుగా వచ్చింది.

వెనక సీట్లోంచి దిగిన మహావీర్ మా ఇంటికే వచ్చాడు. నన్ను యథాలాపంగా పలకరించి 'బాబీని కూడా ఓసారి కలిసి వె ళతా' అంటూ లోపలికి వెళ్ళాడు.

అతనెళ్ళిపోయాక లాజవంతి ముఖంలో వ్యాకులత స్పష్టంగా కనిపించింది.

"ఎందుకలా ఉన్నావు? ఏమంటాడ తనూ?" ఆ రాత్రి అడిగాను.

"ఏముందీ? ఎప్పుడూ కొట్టే డబ్బానే. పెద్దదొర మంచివాడైనందుననే ఇంత పెద్ద ఎస్టేట్‌కు యజమాని అయ్యాడుట! మంచి వాడు కనుకనే ఇంత సంపద ఆయనకు సమకూరిందట! ఆయన మంచితనం వల్లే.. తను మనందరిలాగా తాటాకు గుడి సెలో కాకుండా పక్కా ఇంట్లో ఉంటున్నా డట. మహావీర్ పిల్లలు పౌష్టికాహారం తింటున్నారుట! వాళ్ళకి మంచి మంచి దుస్తులు ఇస్తున్నాడట దొర! తనకూ తన కుటుంబానికీ ఏలోటూ లేదట. ఆ సంగ తులే చెప్పుకొచ్చాడు. ఎంతసేపూ పెద్ద దొరను పొగడటమే" అంది.

"అంతేనా?" అంటే, "అంతకన్నా ఏముంటుంది?" అంది ముభావంగా.

ఆ రాత్రి నా కౌగిలిలో ఇమిడిపోయి.. నన్ను హత్తుకుని పడుకుంది లాజవంతి. ఆమె అణువణువునా ఏదో భయం.. అది నాకు తెలుస్తూనే ఉంది. ఆమెను ఇంకా ప్రశ్నించటం ఇష్టంలేక ఊరుకున్నాను. మళ్ళీ మళ్ళీ అడిగితే వేధిస్తున్నాననుకుం టుందేమో? అనుకోదూ!?

ఓ అర్ధరాత్రివేళ లాజవంతి లేచి కూర్చుని "మనం స్వదేశానికి తిరిగిపోదా మండీ" అంటూ నా గుండెలకు హత్తుకు

పోయి బావురుమంది.

"ఎలా వెడతాం? తెల్లవాళ్ళు వెళ్ళని వ్వరు. బాండ్ పీరియడ్ పూర్తికాలేదుగా! మనం వాళ్ళ బానిసలమే ఇంకా"

"పారిపోదాం"

"ఎలా? చుట్టూ సముద్రం. ముందు ఓడ ఎక్కటమే కష్టం. ఒకవేళ ఎక్కినా పట్టుకుని పిట్టల్ని కాల్చినట్టు కాల్చిపారే స్తారు. లేదా సముద్రంలోకి తోసేస్తారు"

మారు మాట్లాడకున్నా ఆమె ఎంతో మానసిక వేదనను అనుభవిస్తున్నట్లు, ఆమె చెక్కిళ్ళ మీదకు ధారాపాతంగా కారు తున్న కన్నీళ్ళే చెప్పాయి.

మహావీర్ మా ఇంటికి తరచుగా వస్తూనే ఉన్నాడు. అతను వెళ్ళగానే లాజ వంతి ముఖంలో కలవరం కనపడేది.

అప్పటినుంచీ పగలూ రాత్రీ నన్ను వ దిలి ఉండేదికాదు. తనను ఒంటరిగా వదిలి ఎక్కడికీ వెళ్ళవద్దని బతిమాలేది.

పనిచేసే చోటకూడా ఆడామగా అంద రితో మాట్లాడుకుని, వాళ్ళందరూ తనను కనిపెట్టి ఉండేటట్లు ఏర్పాటు చేసుకుంది.

ఓడలో మేము తన ప్రాణాలు నిలబెట్టి నప్పుడు మహావీర్ ఏమన్నాడో ఓసారి గుర్తుకు తెచ్చుకున్నాను.

నేను రామభక్తుణ్ణి... తను కృష్ణభ క్తుడు! లాజవంతి విష్ణు భక్తురాలు... బ్రాహ్మణుడు శివభక్తుడు!

ఈ దేవుళ్ళందరూ ఒకర్నొకరు ఇష్టపడ తారు. అందుకని మేం నలుగురం కూడా ఎంతో ఆత్మీయంగా ఉండాలనీ, ఆ ఆత్మీ యత కలకాలం నిలవాలనీ, కష్టకాలంలో ఒకరినొకరం ఆదుకోవాలనీ అన్నాడు.

అటువంటి స్నేహితుడైన మహావీర్‌ను అనుమానించటమా?

ఇక లాజవంతిని అనుమానించటమంటే నన్ను నేను అనుమానించుకోవటమే.

పిల్లలు పుట్టిన తర్వాత ఆమెకు నాపట్ల గల ప్రేమ పదింతలైంది.

తన చిన్నారి కొడుకులిద్దర్నీ నా ఒళ్ళో కూర్చోబెట్టి.. ప్రేమ, అనురాగం నిండిన కళ్ళతో నన్ను చూసుకుంటే ఆమె మనసు నిండిపోయేది. నేనే సర్వస్వం అన్నట్లుగా బతుకుతున్న ఆ అనురాగ రాశిని అనుమా నించనా? అంతకన్నా పాపం ఉంటుందా?

ఆమెకు నాపైగల ప్రేమ ఈ నాటిదా? ఆనాడే ఆమె నాకు మనసిచ్చుకోలేదా?

ఇలా తర్జన భర్జనలు పడుతున్న నన్నలా వదిలేసి, కాలం ముందుకు సాగి పోతూనే ఉంది.

మా భయాలను నిజంచేసే రోజురానే వచ్చింది. మేం వినకూడదనుకుంటున్న ఆ

---

**కొత్తగాలి...**

**రణం తర్వాతే మరణం!**
**బహుశా**
**రుణం తీరడమంటే**
**అదేనేమో!!**

– జి.వి.ఎస్. ప్రియంవద,
శ్రీకాకుళం

---

కబురును తెచ్చింది.

ఆ కబురును మోసుకు వచ్చింది మరెవ రోకాదు.. మహావీర్!

అతడినోట ఆమాట వింటూనే చేష్టలు డిగి స్థాణువైపోయింది లాజవంతి.

బేలగా నావంక చూడసాగింది.

ఒప్పుకోనని చెప్పమని చూపులతోనే నన్ను వేడుకుంటోంది.

ఎస్టేట్ యజమాని పెద్దదొర ఆమెను బంగళాకు రమ్మని కబురుచేశాడు.

"ఎందుకూ? " మహావీర్ వంక సూటిగా చూస్తూ అడిగాను.

"బంగళాలోని గదులన్నీ ఊడ్చి గచ్చును

తడిబట్టతో శుభ్రంచేసి రావాలి" అంటూ సణుగుతున్నట్లు నంగి నంగిగా చెప్పాడు.

"ఆ పనికి వేరే వాళ్లెవరూ దొరకరా? మీ వదినకు మళ్ళీ నెల తప్పిందనీ, నీరసంగా ఉందనీ... రాలేదనీ చెప్పు మహావీర్. దొరదగ్గర నీకు ఆమాత్రం చనువు ఉండకపోదు"

"చనువా? నాకా? అంత పెద్దవాడి ముందు నేనెంత అశోక్? ఆయన ఆజ్ఞను పాటించకపోతే జరిగే పరిణామాలు నీకు తెలియనివి కావు. ఆయన నాకు చెప్పి కూడా చాలాసేపే అయింది" అంటూ, "పద బాబీ!" అన్నాడు లాజవంతి వంకచూస్తూ.

భీతహరిణిలా నావంక చూస్తూ మహావీర్‌ను అనుసరించిందామె.

సమయం గడిచిపోతున్నా ఆమె తిరిగి రాలేదు.

నాకు ఆలోచనలతో పిచ్చెక్కిపోతోంది.

ఈమెను నిజంగా ఇల్లుశుభ్రం చెయ్యటానికే పిలిచాడా?

ఒకవేళ అందుకే పిలిచినా తీరా ఈమె ఇంట్లోకి వెళ్ళి పని చేసుకుంటున్నప్పుడు, ఆ దొరకు దుర్బుద్ధి పుట్టదనే గ్యారంటీ ఏమిటీ? గతంలో బంగళాకి వెళ్ళిన స్త్రీలు కొందరు తిరిగి రాలేదని చెప్పుకుంటారు.

ఆయన చాలా క్రూరుడు.

తమ ఆడవాళ్ళని గురించి వాకబు చెయ్యటానికి బంగళాకు వెళ్ళిన మగవాళ్ళని కూడా పిట్టల్ని కాల్చినట్టు తుపాకితో కాల్చి పారేశాడని వినికిడి.

'అయినా సరే, అక్కడ పరిస్థితేమిటో చూసి రావాలి' అనుకుని బయల్దేరబోతుంటే.. పిల్లలిద్దరూ, "నాన్నా! అమ్మేదీ? " అని ఏడుస్తూ నా కాళ్ళని చుట్టేశారు.

వాళ్ళని సముదాయిస్తూ... అటూఇటూ కాలుగాలిన పిల్లిలా తిరగసాగాను.

'నేను వెడితే పిల్లలు ఊరుకుంటారా? వెంటపడరూ?

ఈ దేశంలో తెల్లవాళ్ళు దొరలు. వాళ్ళే ప్రభువులు. మేం బానిసలం! అధికారం వాళ్ళ చేతుల్లో ఉంది.

తీరా పిల్లల్ని తీసుకువెడితే- బంగాళాలో నీకేం పనిరా మలబార్ కూలీ? - అని లారీ ఝుళిపిస్తే..? అంతటితో ఆగుతాడో? ఇంకేమన్నా చేస్తాడో?

నా చేతిలో పిల్లలున్నారనే జాలీ, దయా ఆయనకెందుకుంటాయ్?

ఇప్పుడు సహాయం కోసం ఎవరిని ఆశ్రయించాలి? ' ఇలా పరిపరి విధాల ఆలోచిస్తూ ఉండగా వీధిలో అలికిడి అయింది.

చూద్దామని గబగబా వెళ్ళాను.

మహావీర్ వచ్చాడు.

వచ్చి.. ఏదో ఆలోచిస్తూ.. నేరేడుచెట్టు కింద బండరాయి మీద కూర్చున్నాడు.

అయితే.. అతని మౌనం ఏదో జరిగిందని చెప్పకనే చెబుతోంది.

"మహావీర్! సంగతేమిటో చెప్పుబాబూ! నా ప్రాణాలు పైనే పోతున్నయ్!" ఆదుర్దాగా అడిగాను.

"................"

"నువ్వు నా ప్రాణ స్నేహితుడివి కాదా? ఈ గడ్డపై కాలు మోపినరోజున మనం చేసుకున్న ప్రమాణాలు మరిచావా? "

నానోట ఈమాట వినగానే మహావీర్‌కు దుఃఖం ఆగలేదు.

మౌనంగా రోదించటమే తప్ప అతనేమీ జవాబివ్వకపోవటంతో "ఇప్పుడు నా భార్య ఎక్కడుంది? ఆమె ప్రస్తుత పరిస్థితి ఏమిటీ? " అని నిలదీశాను.

"ఏం చెప్పమంటావ్ దోస్త్! లాజవంతిని అనుభవించాలనే పెద్దదొర చిరకాల వాంఛ. ఇప్పుడు దాన్ని తీర్చుకోబోతున్నాడు" అని అసలు సంగతి చెప్పాడు.

"మహావీర్! నువ్వు మమ్మల్నెందుకు మోసం చేశావూ? వంచనతో నా భర్యను



తీసుకెళ్ళి ఆ పులిబోనులోకి ఎందుకు తోశావూ?"

"మనం ఇక్కడ బతుకుతున్న పరిస్థితులలో.. రోజువారీ స్థితిగతులను మెరుగుపరుచుకోవటానికి, ఎవరైనా ఏదైనా చేస్తారనుకుంటుంటాను. అందుకనే నేనూ అడ్డమైన పనులూ చెయ్యాల్సివచ్చింది. చేశాను కూడా! మీ బంబూ బస్తీలోని కన్నెపిల్లలనూ, ఇంటి కోడళ్ళనూ.. చివరకు మంచి మంచి ఇల్లాళ్ళను సైతం నా మాయమాటలతో బంగళాకు తీసుకువెళ్ళి దొరకు అప్పజెప్పాను.

ఇక్కడ నీకో సంగతి చెప్పాలి.

నీ భార్యమీద పెద్దదొర కన్నుపడిందని తెలుసుకుని, ఓవర్‌సీర్లు ఆమెవంక కన్నెత్తి చూడటం మానుకున్నారు. లేకపోతే ఈ అడవుల్లో, తోటల్లో వాళ్ళు ఆమెపై ఎన్నోసార్లు అత్యాచారాలు చేసేవారు.

నిజానికామె అందమే ఆమెకు శత్రువు. ఆమెను తీసుకురమ్మని పెద్దదొర నన్ను మీ ఇంటికి చాలాసార్లు పంపించాడు.

నేను వచ్చి, ఏవేవో కబుర్లు చెప్పి

ఆమెను పెడదారి పట్టించాలని చూశాను. ఆమెను ప్రలోభ పెట్టాను. ఆమెకు ఎన్నో ఆశలు కల్పించాను.

అయితే ఆమె రావటానికి ఒప్పుకోక పోగా ఇక్కడున్న భారతీయ మహిళలంతా నాకు అక్కాచెల్లెళ్ళలాంటి వాళ్ళేననీ.. వాళ్ళను పెద్దదొరకు తార్చటం అన్యాయ మనీ ఆక్రోశించింది. తన దగ్గర ఆ పాపిష్టి రాక్షసుని ప్రస్తావన తేవద్దని నెత్తీనోరూ బాదుకుని మరీ చెప్పింది.

'ఏ మగాడైనా.. తల్లితో సమానమైన వదిన మానమర్యాదలను పరపురుషునితో కొల్లగొట్టించే దుశ్చర్యకు పూనుకుంటాడా?' అని నిలదీసింది.

ఆమె మాటలన్నీ చెవిటివాడి ముందు శంఖం ఊదినట్లే అయ్యాయి.

ఉత్తమ ఇల్లాలు.. మహా పతివ్రత అయిన లాజవంతిని, అబద్ధాలు చెప్పి దొర దగ్గరకు తీసుకువెళ్ళిన పాషండుణ్ణి నేను.

నీకు కష్టం వచ్చినా నాకు వచ్చినట్లే!

ఇప్పుడు ఈ మారిషస్‌లోని హైందవ స్త్రీల శీలానికి రక్షణ లేకుండా పోయింది. దీన్ని గురించి మనం తీవ్రంగా ఆలోచించాలి" అంటుంటే అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"దోస్త్ దోస్త్ అంటూనే... నువ్వెందుకింత మిత్ర ద్రోహానికి ఒడికట్టావు?" నా కోపాన్నంతటినీ వెళ్ళగక్కుతూ అడిగాను.

"జరిగిందంతా పూసగుచ్చినట్టు చెబుతున్నాను. గుండె రాయి చేసుకుని విను...

తాగితాగి నిషా తలకెక్కి ఉన్నాడు పెద్ద దొర. 'బంగళాలో ఆడవాళ్ళెవరూ లేరు. పక్కలో ఆడది లేనిదే నాకు తోచదు. పోయి ఎవర్నన్నా తీసుకురా!' అంటూ నన్ను ఆజ్ఞాపించాడు.

'ఎవర్ని తీసుకురానూ?'

'అశోక్‌గాడి పెళ్ళాన్ని తీసుకురా! వాడి గుడిసె ఇక్కడికి దగ్గరేగా! వాడి భార్య బాడీలోని ప్రతిపార్ట్లూ అందంతో చిందు లేస్తూ ఉంటుంది. లా జవాబ్.

ఆ యవ్వనాన్ని జుర్రుకోవాలని నేను చాలా కాలంగా తపన పడుతున్నాను. నువ్వు లుచ్చావి. పంపిన ప్రతిసారీ ఊరికే తిరిగి వచ్చావు!

రాస్కెల్! ఈ సారి అలా ఊరికే తిరిగి వచ్చావో... ఖబడ్దార్!' అంటూ పెద్ద గొంతుకతో అరవటం మొదలుపెట్టాడు.

'సాబ్! అశోక్ భార్య మహా పతివ్రత. ఆమె ఇటువంటి చోటికి రాదు. పైగా ఆమెకు ఆరోగ్యం బాగుండటం లేదు. తను ఇప్పుడు గర్భవతి కూడానూ' ఎలాగో ధైర్యం కూడగట్టుకుంటూ చెప్పాను.

'డోంట్ టాక్ నాన్సెన్స్! మీ ఇండియన్ లేడీస్ ఒంటి రుచే రుచిరా! వాళ్ళు అంత బాగుంటారు ఎందుకనిరా? లాజవాబ్!

నీ ఇంటి ఆడది కూడా చాలా బాగుంటుంది. ఒకరోజు దాన్ని కూడా ఇక్కడికి తీసుకురా. బాగా డబ్బిస్తాను.

ముందిప్పుడు ఆ అశోక్‌గాడి భార్యను వెంట బెట్టుకురా! వెళ్ళరా మలబార్ కూలీ!

దాన్ని తీసుకురాకపోతే అడవి పందిని కాల్చినట్టు కాల్చేస్తాను' అంటూ సేఫ్ లోనుంచి తుపాకిని తీసి, తూటాలతో నింపటం మొదలుపెట్టాడు.

అందుకని... విధిలేక..."

"ఇప్పుడు బంగళాలో ఏం జరుగుతోందీ?" అని అడుగుతుంటే నా గుండెలు దడదడా కొట్టుకోసాగాయి.

"నేను లాజవంతిని బంగళాలో దింపి వస్తుండగా 'నేను ఈ దేశానికి కాయ కష్టం చేసుకుని పొట్టపోసుకోవటం కోసం వచ్చాను గానీ... సిగ్గూలజ్జా విడిచి అడ్డమైన వెధవల్నీ నా వంటి మీద చెయ్యి వెయ్యనివ్వటానికి కాదు.

నువ్వు దొరవైతే కావచ్చు. అంతమాత్రాన నేను నా ఆత్మను అమ్ముకోను.

నన్నెవ్వడూ ముట్టుకోటానికి వీల్లేదు.

నా దగ్గరకు వచ్చావంటే నీ ప్రాణాలు దక్కవు జాగ్రత్త!' అని బిగ్గరగా బెదిరిస్తున్నట్లుగా మాట్లాడే మాటలు విని పించాయి" అంటూ చెప్పడం కొనసాగిం చాడు మహావీర్.

"నేను మరి కాసేపు ఆగి విన్నాను.

'అదితప్ప వేరే ధ్యాసలేదా? నీకు నచ్చిన ప్రతి ఆడదీ నీ పక్కలోకి రావాలా? పెద్ద దొరట పెద్దదొర! పేరుకి పెద్దదొర... బుద్ధులు కొద్దివి!

ఇక్కడి అడవుల్లోని క్రూరమృగాలన్నిటి కన్నా.. క్రూరాతిక్రూరమైన మృగానివి నువ్వు' అని గొంతు చించుకు అరుస్తోంది బాబీ..." ఇంకా ఏదో చెబుతున్న మహా వీర్ మాటలు పూర్తికాక మునుపే, చేతికి అందిన లాఠీ తీసుకుని బంగళా వేపుకు పరుగెత్తాను నేను.

★ ★ ★

పెద్దదొర పూటుగా తాగి మత్తులో తూలుతున్నాడు. అతని చేతిలో మరో మద్యం సీసా ఉంది. ఆ గదిలో సామా న్లన్నీ చిందర వందరగా పడి ఉన్నాయి.

లాజవంతి చున్నీ అక్కడే ఉన్న ఓ మంచం పట్టెకు వేళ్ళాడుతోంది.

'ఆ రాక్షసుడు ఆమెను బలాత్కరించ బోయి ఉంటాడు. అసలే చేతకాకుండా ఉన్న గర్భవతి, తన సతీత్వాన్ని రక్షించుకో వటానికి ఓపిక కూడగట్టుకుని ఎదురు తిరిగి పోరాడి ఉంటుంది.

ఆ ఘర్షణలో ఆమె చున్నీ... మంచం పట్టెకు చిక్కుకుపోయి ఉంటుంది. మరి ఆమె ఏదీ?'

★ ★ ★

బంగళా చుట్టూ పరుగెత్తుతూ... ఆమె కోసం వెతుకుతుండగా... సమీపంలో కాస్త ఎత్తుగా ఉన్న గుట్టమీద, సముద్రం వేపుకు వేగంగా అడుగులు వేస్తున్న ఓ స్త్రీ ఆకారం కనిపించింది.

'ఆమె నా లాజ్ కాదుగదా!' అను కుంటూ.. ఉన్న చోటనే ఆగిపోయి పరిశీ లనగా చూశాను.

సందేహం లేదు! ఆమె... ఆమే! ఆమె నా లాజవంతి!

ఎగుడు దిగుడులుగా ఉన్న ఆ గుట్టను కష్టపడి ఎక్కుతూ, ఆమెను పేరు పెట్టి గట్టిగా పిలుస్తూ "ఆగు లాజ్! ఆగు! జరి గిందంతా నేను తెలుసుకున్నానులే! ఇందులో నీ తప్పేముంది? లేదు గదా! నీ వల్ల ఏ తప్పూ జరగలేదంటున్నాను గదా!

> ## కొత్తగాలి...
>
> **మని-షిలో**
> **రెండు**
> **మనసుని**
> **ఆకర్షించు మెండు**
>
> – ఎ. జనార్ధనం,
> విశాఖపట్నం

అసలేం జరగలేదనుకుందాం! ఏమీ కాలేద నటానికి, పోనీ.. నువ్వు ఒప్పుకోకపో యినా... అంతా ఒక పీడకల అనుకుని మరిచిపోదాం!" అంటూ బిగ్గరగా అరవసా గాను. ఆ కేకలు గాలిలో తేలివెళ్ళి... ఆమెకు వినిపించాయో లేదో!

★ ★ ★

ఎంతో భీతిని గొలిపే ప్రదేశం అది.

ఈ ద్వీపాన్నంతటినీ మింగెయ్యాలను కుంటున్న మహా రాక్షసునిలా, సముద్రుడు తన నోరంతా తెరుచుకుని, భయంకరమైన శబ్దాలు చేసుకుంటూ.. ఉరికి ఉరికి వచ్చి ఆ గుట్టను తాకుతున్నాడు.

తెల్లవాళ్ళు తమపై జరుపుతున్న అత్యా

చారాలకు తట్టుకోలేకపోయిన అనేక మంది ఆఫ్రికన్ బానిసలు, ఇక్కడనే సము ద్రంలో దూకి తమ ప్రాణాలను వదిలే శారు. వాళ్ళ శవాలు ఏమయ్యాయో కూడా ఆచూకీ చిక్కలేదు.

ఈ క్షణంలో లాజవంతి ఏమాత్రం తొందరపడినా.. పొరపాటుగా ఆలోచిం చినా... ఇక నాకు ఆమె దక్కదు.

భార్య అలా చావుకీ బతుకికీ మధ్య గల సన్నని గీత మీద నడుస్తూ ఉండటం చూస్తున్న నాకు మనోధైర్యం సడలిపోసా గింది.

గుండెదడ కూడా పెరిగిపోసాగింది.

"ఆగు లాజ్, ఆగు! రెండు చేతులూ జోడించి ప్రార్థిస్తున్నాను. ఇక ముందుకు ఒక్క అడుగు కూడా వెయ్యొద్దు నువ్వు!" వేడికోలుగా అంటున్నట్లే ఉన్నా.. నా కంఠ స్వరంలో ఆజ్ఞను కూడా మిళితం చేశాను.

ఏమనుకుందో ఏమో... ఆమె ఉన్న చోటనే ఆగిపోయింది!

గబగబా వెళ్ళిన నేను... ఆమెను చేరు కోగానే నా హృదయానికి హత్తుకుంటూ, ఓదార్పుగా ఆమె వీపుమీద తడుతూ, వెన్ను నిమరసాగాను.

"ఈ అదృష్టాన్ని శాశ్వతంగా కోల్పోతున్న దురదృష్టవంతురాలిని నేను" అంటూ వెక్కివెక్కి ఏడవసాగిందామె.

అలా ఏడుస్తూనే "ఇప్పుడు ఇక నేను జీవించి ఉండకూడదు. ఇంత జరిగిన తరువాత కూడా నిస్సిగ్గుగా నేను బతి కితే.. ఈ తెల్లవాళ్ళు తమ దుర్మార్గాలనూ, అత్యాచారాలనూ అలా కొనసాగిస్తూనే ఉంటారు. వాళ్ళ విచ్చలవిడి కామవాంఛల కొనసాగింపునకు మన సమ్మతిని తెలియ జేసినట్లవుతుంది.

భారతీయ స్త్రీలమందరం ఇలా వాళ్ళకు లొంగిపోయి మానమర్యాదలను కోల్పోయి బతికితే.. మన కుటుంబాలలోని స్త్రీలు ఎప్పటికీ ఇలాగే.. నీతి నియమాలను మంట గలుపుకుంటూ, పైకి ఏమీ జరగ నట్లు నటిస్తూ.. ఏమీ జరగలేదని మనకి మనం సర్ది చెప్పుకుంటూ.. ఆత్మవంచన చేసుకుంటూ బతకాల్సి వస్తుంది.

ఇలా అయితే వాళ్ళ ఆత్మలు చచ్చిపో తాయి.

ఇక్కడ మన స్త్రీల జీవితాల్లో సహ జత్వం, నిజాయితీ ఉండవు" అందామె.

మనం ఎలాంటి దేశం నుంచి వచ్చాం!

అక్కడ మర్యాదస్తుల కుటుంబాలలోని స్త్రీలు ఎంత నిబ్బరంగా బతుకుతున్నారు? 'హమారా భారత్ మహాన్' అంటూ మనమందరం గర్వించదగిన సంస్కృతి మనది!

స్త్రీ పురుష సంబంధాల విషయంలో అక్కడ ఉన్నటువంటి కుటుంబ వ్యవ స్థనూ, విలువలనూ, నైతికతనూ, సదాచా రాలనూ ఇక్కడా స్థాపించుకోవాలి మనం. నైతిక విలువల విషయంలో తెల్లదొరల ఒత్తిళ్ళకు లొంగకూడదు మనం.

పాపిట్లో సింధూరం ధరించిన నేను... అపర కాళిలా తిరగబడినా లెక్కచెయ్య కుండా, ఆ పెద్దదొర నాపై అఘాయిత్యా నికి ప్రయత్నించాడంటే వాడికి ఎంత ధైర్యం? ఆ ధైర్యం మనమిచ్చింది కాదా?

ఈ పాపాలను ఆపటానికి ఈ నేల తల్లి బలి కోరుతుంది. నా మరణమే ఆ బలి!

నా మరణంతో ఈ ద్వీపం పునీతమ వ్వాలి. భయంకరమైన బలిదానంతో తెల్ల వాళ్ళ ఆత్మలు కంపించాలి.

నా ఆత్మహత్యకు కారణం తెలుసుకున్న తరవాతైనా.. ఇక్కడి భారతీయ స్త్రీలలో ఆత్మసన్మానం, ఆత్మగౌరవం చిగురించి, అవి దినదినాభివృద్ధి చెందాలి" అలసిన సొలసిన ఆమె చెప్పటం ఆపి, ఆయాస ప డుతూ అక్కడే ఉన్న ఓ బండరాయి మీద చతికిలపడింది.

# నగ్నత్వం యూనిఫామా?



స్పెయిన్ రాజధాని మాడ్రిడ్‌లోని పోలీస్ శాఖలో పనిచేసే మేరియానో ఉద్యోగంలో చేరిన మర్నాడే ఓ వ్యభిచార గృహంమీద దాడి చేసాడు. ఎందుకంటే నగరంలో వ్యభిచారం నిర్మూలనే ధ్యేయంగా అతను ఆ ఉద్యోగంలో చేరాడు. అర్ధనగ్నంగా లేదా పూర్తిగా నగ్నంగా ఉన్న కొందరు వేశ్యలని అతను అరెస్ట్ చేసాడు. అయితే విటులు దొరక్కపోవడంతో మేరియానో వారిని 'ఇండీసెంట్ ఎక్స్‌పోజర్ ఇన్ ఏ పబ్లిక్ హౌస్' అనే నేరం మీద కోర్టులో ప్రవేశ పెట్టాడు. వారి తరపున హాజరైన లాయర్ ఫెర్నాండో వారిది నేరం కాదని, ఎందుకంటే అర్ధనగ్నత్వం లేదా నగ్నత్వం వేశ్య యొక్క యూనిఫాం అని, పనివాళ్ళు తమ యూనిఫారాలని ధరించడం మాడ్రిడ్‌లో నేరం కాదని వాదించాడు.

పబ్లిక్ ప్రాసిక్యూటర్, డిఫెన్స్ లాయర్ల వాదనలు విన్నాక ఆ వాదనతో జడ్డి అంగీకరిస్తూ, ఆ కేసుని కొట్టేసాడు.

అయితే దానిపై పై కోర్టుకు అప్పీలు పోయింది. అప్పుడు మాత్రం కింది కోర్టు తీర్పుని కొట్టేస్తూ ఆ జడ్జి ఇలా చెప్పాడు- "ఈ తీర్పు కనక అమలులో ఉంటే మాడ్రిడ్‌లో వ్యభిచారం పెరగడమే కాక, ఈ తీర్పుని వేశ్యలు విటులని ఆకర్షించడానికి రోడ్డు మీదకి రావడానికి కూడా ఉపయోగించవచ్చు అని భయంగా ఉంది"

---

"నువ్వు శరీర త్యాగం చేసి మరణించటానికే నిశ్చయించుకుంటే.. నన్నూ నీతో పాటు తీసుకువెళ్ళు లాజ్!" అంటూ ఆమె పక్కనే కూర్చున్నాను నేను.

★ ★ ★

"నేనొక స్వాప్నికురాలిని. నా స్వప్నానికి సాకారం చెయ్యవలసిన బాధ్యతను మీమీద పెడతాను. దాన్ని పూర్తి చేసిన రోజున నేనే వచ్చి, మిమ్మల్ని పేరుతో పిలిచి మరీ తీసుకువెడతాను"

"ఎలా వస్తావ్? "

"అలల ఒడిలో కూర్చుని.. మిమ్మల్ని చూడటానికి రోజూ రేవుకు వస్తూనే ఉంటాను. నా కల నిజమైందని నేను భావించిన రోజున మిమ్మల్ని నాతో తీసుకువెడతాను"

"ఇంతకీ నీ స్వప్నం ఏమిటీ? కాస్త వివరంగా చెప్పు"

"చెబుతున్నాను. శ్రద్ధగా వినండి మరి! ఇక్కడ ఉంటున్న ప్రతి భారతీయ స్త్రీ, తన కుటుంబ సాంప్రదాయం ప్రకారం... నుదుట కుంకుమ బొట్టుగానీ, పాపిట్లో సింధూరంగానీ విధిగా ధరించాలి. భారతీయ మహిళకు ప్రాణంకన్నా శీలమే మిన్న అనీ, వాళ్ళను ముట్టుకుంటే పాపమనీ.. అది ఘోరాతిఘోరమైన నేరమనీ.. శ్వేత జాతి పురుష పుంగవులందరికీ మన వాళ్ళు.. అంటే మన మగవాళ్ళు దండోరా వేసి మరీ చెప్పాలి.

ఇక్కడి మన మగవాళ్ళందరూ కూడా.. 'బానిసలం.. బానిసలం' అనుకుంటూ, భయపడుతూ ఏం జరిగినా చూస్తూ స్తబ్దుగా పడి వుండకుండా, మన స్త్రీలమీద పర పురుషులెవరైనా అత్యాచారాలు చేస్తే

వాళ్ళు దొరలైనా సరే, మరొకరైనా సరే తగిన శాస్తి చెయ్యాలి.

మా స్త్రీల జోలికి వస్తే ప్రాణాలు తీస్తామని శ్వేతజాతీయులను హెచ్చరించాలి.

ఇక్కడున్న భారతీయ ప్రవాసులందరినీ జాగృతం చేసి, వాళ్ళలో స్థైర్యాన్ని నింపి, అందరూ ఆ దిశగా కార్యాచరణకు దిగేట్లు చెయ్యాలి.

ఇదే నా బంగారుకల. దీన్ని సాకారం చెయ్యాలి మీరు.

మిమ్మల్ని ప్రేమించినంతగా నా జీవిత కాలంలో మరెవర్నీ ప్రేమించలేదు నేను. పరపురుషుణ్ణి కన్నెత్తి ఏనాడూ చూడలేదు. నాకు నా శీలం ప్రాణం. ఆ తెల్ల జాతి రాక్షసుడు నన్ను ముట్టుకున్నాడనే అవమానాగ్ని సముద్రంలో దూకితేగానీ చల్లారదు.

> **కొత్తగాలి...**
>
> **చెలమే చాలు**
> **దాహార్తికి**
> **సముద్రమెందుకు?!!**
>
> – వెల్మల రాంరెడ్డి,
> పూడూరు, కరీంగర్ జిల్లా

నూరు జన్మలకు సరిపడా ప్రేమను మీకు అందించాను. నేను మిమ్మల్ని వదిలి ఎక్కడికీ వెళ్ళను. నా పిల్లల రూపంలో మీతోపాటు జీవించేవుంటాను" అంటూ అనూహ్యంగా చటుక్కున సముద్రంలో దూకేసిందామె.

ఉలిక్కి పడ్డాను నేను. బ్రహ్మాండం బద్ద లయ్యేట్లుగా శబ్దం చేస్తూ వచ్చిన కెరటాలలో ఆమె కొట్టుకుపోవటాన్ని.. ఆ బండ మీద బెల్లం కొట్టిన రాయిలా కూర్చున్న నేను కళ్ళప్పగించి చూస్తూనే ఉన్నాను!

అవే కెరటాలు మళ్ళీ వచ్చాయి.

అప్పుడు వాటి మీదున్న తెలుపురంగు నురుగు.. ఇప్పుడు సిందూరం రంగులోకి మారిపోయింది.

సందేహం లేదు.. ఆ రంగు, లాజవంతి... తన పాపిట్లో అద్దుకున్న సిందూరమే!

ఆ సిందూర కెరటాలను చూడగానే నా రక్తం సలసలా మరిగిపోసాగింది.

'బద్మాష్! నీచుడా! నా అర్ధాంగి ఆత్మహత్యకు కారకుడవైన నిన్ను ప్రాణాలతో వదలను. ఇవాల్టితో నీకు ఈ భూమ్మీద నూకలు చెల్లిపోయాయి' అని అరుచుకుంటూ వెళ్ళి, బంగళాలో చొరబడి... పైనాకిందా, వెనకాముందూ, ఇక్కడా అక్కడా అని చూడకుండా, లాఠీతో పెద్ద దొరను చావబాదాను.

నాకు బేడీలు తగిలించి జైలుకు తీసుకు వెళ్ళారు. లాజవంతి సముద్రంలో దూకి ఆత్మహత్య చేసుకున్న వార్త ఏ పేపర్లోనూ రాలేదు.

దానిమీద ఎటువంటి చర్చా జరగలేదు.

ఆ సంఘటనను గురించి వాకబు చెయ్యటానికి పోలీసులన్నా రాలేదు. పెద్ద దొరను లాఠీతో కొట్టి హత్య చెయ్యాలనుకుని అందుకు తీవ్రంగా ప్రయత్నించానని నేరంమోపి, నాకు మాత్రం దీర్ఘకాలపు జైలు శిక్ష విధించారు.

జైల్లో ఉన్న నన్ను చూడటానికి వచ్చేవాడు మహావీర్.

అతనే అన్ని సంగతులనూ పూసగుచ్చినట్లు తెలియజేసేవాడు. నా పిల్లలిద్దరినీ వాళ్ళింటికి తీసుకు వెళ్ళానని చెప్పాడు.

లాజవంతిని గురించి మా 'బంబూ' బస్తీ వాళ్ళు ఆరా తియ్యటంతో.. మెల్లమెల్లగా అసలు సంగతి బయట పడిందట!

దాన్ని గురించి గుంపులు గుంపులుగా

గుమిగూడి అందరూ చర్చించుకోవటంతో.. సంగతి మెల్లమెల్లగా దేశంలోని అన్ని ప్రాంతాలవారికీ తెలిసింది. ప్రవాసులందరూ తెల్లదొరలపట్ల ఏహ్యాభావం పెంచుకోవటం మొదలుపెట్టారు.

తమ మహిళలపై వారు చేస్తున్న అత్యాచారాల పట్ల నిరసన తెలియజెయ్యసాగారు. ఈ పరిణామం తెల్లవాళ్ళలో ప్రకంపనలు సృష్టించింది.

ప్లేవిట్జ్ అనే పేరుగల ఒక శ్వేత జాతి మహిళ ఈ సంఘటనను గురించి వివరాలు తెలుసుకోవటానికి మా 'బంబూ' బస్తీకి వచ్చిందిట!

ఆమె పేరు ప్రఖ్యాతులున్న మంచి మహిళ.

ఆమె కుమారుడు మా కూలీ కుటుంబాల వారందరినీ పిలిపించి, ఒక మీటింగ్ ఏర్పాటు చేసి, మాకు జరుగుతున్న అన్యాయాలకు సానుభూతిని తెలియజేశాడు.

మాకందరికీ అద్భుతంగా తోచి, ఆశ్చర్యాన్నీ.. ఆనందాన్నీ కూడా కలిగించింది. ఆయన మమ్మల్నందర్నీ సంఘంగా ఏర్పడమనీ, ఐకమత్యంతో మెలుగుతూ, అత్యాచారాలను వ్యతిరేకించమనీ ఆదేశించాడు.

మేమందరం ఆయన ఆదేశాలను తు.చ. తప్పకుండా పాటిస్తూ, మా మహిళలపై జరగబోయే అత్యాచారాలను పసిగట్టి, సంఘటితంగా ఎదుర్కొనటంతో తెల్లవారికి వణుకుపుట్టింది.

ఐదేళ్ళు గడిచాక, మహవీర్ ఒక భయంకరమైన కబురు తెచ్చాడు.

నా పెద్ద కొడుకు రాజేష్, తన తల్లిమీద అత్యాచారం జరిపినందుకు ప్రతీకారంగా పెద్ద దొరను హత్యచేసి, ఆ ఇంటికి నిప్పుపెట్టి పారిపోతుంటే, దొరతమ్ముడు వాడిని తుపాకితో కాల్చి చంపాడుట!

నేనూ, లాజవంతీ ఎంతో అపురూపంగా పెంచుకున్న పెద్దకొడుకును ఆ విధంగా కోల్పోయినందుకు.. కన్నీరు మున్నీరుగా జైల్లోనే విలపించాను నేను.

శిక్ష పూర్తయి జైలునుంచి బయటకు వచ్చాక వెదురు బస్తీలోని ఆ ఇంటికి మళ్ళీ వెళ్ళలేదు నేను.

కొండ లోయల్లోని పల్లపు బీడులో ఓ గుడిసె వేసుకుని నివసించసాగాను.

తెల్లవాళ్ళ దగ్గర మళ్ళీ ఎటువంటి నౌకరీ చెయ్యలేదు.

అడవి నుండి జామపళ్ళు కోసితెచ్చి.. అమ్ముకుని బతికాను.

కొద్ది రోజుల్లోనే కొంతసొమ్ము కూడబెట్టుకుని, లోయలోని ఓ ఖాళీస్థలం కొని, అందులో చెరుకుతోట వేసుకున్నాను.

దాన్ని కష్టపడి సాగు చేసుకుని, దాని మీద వచ్చిన రాబడితో మరికొన్ని స్థలాల్ని కొని, నా చెరుకుతోట విస్తీర్ణాన్ని పెంచుకున్నాను.

అలా ఆర్థికంగా స్థిరపడిన తరువాత, ప్రవాస కూలీ కుటుంబాలతోనూ, ఇతర ఊళ్ళల్లో ఉన్న 'బంబూ' బస్తీలాంటి బస్తీల్లోనూ, నాకు మంచిపేరు వచ్చింది. పలుకుబడి పెరిగింది.

అప్పుడు రోజుకొక బస్తీలో సభను ఏర్పాటుచేసి.. ఆత్మహత్య చేసుకోవటానికి ముందు లాజవంతి చెప్పిన విషయాలను గురించి విస్తృతంగా ప్రచారం చేశాను.

దాంతో అప్పటివరకూ- ఎవరికి వారే యమునా తీరే- అన్నట్లు బతుకుతున్న ప్రవాసులందరూ ఏకమై ఐకమత్యంతో బతకసాగారు.

ఇప్పుడు ఇక్కడ మన భారతీయ కుటుంబాలలోని స్త్రీలందరూ నుదుట కుంకుమనూ, పాపిట్లో సిందూరాన్నీ.. వారి వారి సాంప్రదాయాలను బట్టి తప్పకుండా ధరిస్తున్నారు. సగర్వంగా ధరిస్తున్నారు.

అటువంటి వాళ్ళజోలికి పోవటానికి శ్వేతజాతి పురుషులు భయపడుతున్నారు.

# అత్యంత దీర్ఘకాలం నిల్వ చేసిన ఆహారం!

చతుర ప్రపంచం

ప్రపంచంలో డోకొచ్చే ఆహారం మాంసంతో చేసిన 'కిలియాక్'. ఎంత ఆకలి మీద ఉన్నప్పటికీ కేవలం దాన్ని వాసన తగిలినా, కంటితో చూసినా మిగతావాళ్లక ఆకలి మొత్తం చచ్చిపోతుంది. దాని వాసన ఎంత ఘాటుగా, చెత్తగా ఉంటుందంటే.. దాన్ని అందరూ ఇంటి బయటనే తింటారు. దాన్ని ఇంట్లో గనక తింటే ఆ వాసన కొన్ని నెలలైనా పోదు. దాన్ని వేసవి కాలాల్లో మాత్రమే ఉత్తర గ్రీన్‌లాండ్‌లో తయారు చేస్తుంటారు. పుల వబెట్టిన సముద్ర పక్షుల మాంసంతో దాన్ని చేస్తారు. చలికాలంలో తింటారు. ఎందుకంటే చలికాలంలో వారికి మాంసం లభ్యమవడం కష్టం. దీన్ని ఛీజ్‌లాగా పచ్చిగానే తింటారు. ఓ సీల్ చేప చర్మాన్ని వలిచి ఆ చర్మంలో పక్షులని చుట్టి కుడతారు. ఆ చర్మపు సంచిని కనీసం మూడు నెలల నుంచి పద్దెనిమిది నెలలపాటు రాళ్ళకింద పాతి పులియ బెడ తారు. మాంసం లభ్యం కాని చలికాలంలో దాన్ని తవ్వితీసి ఆ పక్షులను తింటారు. ఒక్కో సంచిలో మూడు వందల నుంచి ఐదు వందల వరకూ చిన్న పక్షులను ఉంచుతారు. వాటిని ఎముకలతో సహా తింటారు. పెళ్ళిళ్ళు, క్రిస్ట్‌మస్ లాంటి ప్రత్యేక సందర్భాల్లో 'కిలియాక్'ను తప్పక వడ్డించాల్సిన వంటకంగా వారు భావిస్తారు. గ్రీన్‌లాండ్‌వాసులు తప్ప మరెవరూ ఈ దుర్వాసనతో కూడిన మాంసాన్ని తినలేరు. ప్రాచీన గ్రీన్‌లాండ్‌వాసులు మాంసాన్ని చెడకుండా నిల్వ ఉంచే ఈ పద్ధతిని వేల ఏళ్ళ క్రితమే కనుక్కున్నారట. ఈ పదార్థం లేకపోతే వారు చలికాలంలో ఆకలికి మరణించి ఉండేవారట. అయితే నేడు నాగరికులు మాత్రం వీటిని తినడం లేదు.



లాజవంతి బలిదానం కేవలం భారతీయ మహిళలనే గాక, శ్వేతజాతీయులతో పాటు విదేశీ మహిళల ఆత్మలను కూడా కుదిపేసింది.

భారతీయ స్త్రీజాతికి పవిత్రత ఎంత ముఖ్యమైనదో వాళ్ళు లాజవంతి చేసిన బలిదానం ద్వారా తెలుసుకోగలిగారు.

లాజవంతి మరణం నాకు దుఃఖం కలిగించిన మాట నిజమే.

కానీ.. ఆమె బలిదానం ద్వారా తెలివి తెచ్చుకుని, నుదుట కుంకుమనూ, పాపిట్లో సింధూరాన్ని ధరించి... కళకళలాడుతూ, తమ పవిత్రతను చాటుతూ, నిర్భయంగా బతుకుతున్న మహిళలను చూసి, ఆ శోకాన్ని మరిచిపోవటానికి ప్రయత్నిస్తున్నాను.

నా చిన్న కొడుకు ఇప్పుడు భారతదేశంలో పెద్ద చదువులు చదువుకుంటున్నాడు.

నిన్ననే వాడి దగ్గర్నుంచి నాకో ఉత్తరం వచ్చింది.

నీకు కూడా దాన్ని చదివి వినిపిస్తాను. అది చదివాక నా మనసు సంతోషంతో గంతులు వేస్తోంది.

లాజవంతి కల సాకారమైనట్లే అనిపిస్తోంది. ఇదే నా కథ.. ఆమె కథ.. అంటూ- 'ఏదో పిలుపు వినపడుతోంది చూడు బాబూ! నా లాజవంతి వచ్చినట్లుంది!' అన్నాడు వృద్ధుడు.

ఆ తరువాత ఆయన నోట ఏమాటా రాకపోవటంతో 'ఈ చుట్టుపక్కల ఎవరన్నా ఉన్నారా బాబూ! త్వరగా రండి! ఈ

బాబా పడిపోతున్నారు' అని గట్టిగా కేకలు వెయ్యసాగాడు ఆ కుర్రాడు.

"ఎవరు పడిపోతున్నారూ? ఎక్కడా? " అంటూ సాధ్యమైనంత వేగంగా మరో వృద్ధుడు వచ్చేసరికే అశోక్ నేలకొరిగాడు.

"అయ్యో.. అశోక్ శర్మా! నీకూ నూరేళ్ళు నిండిపోయాయా? " అంటూ చల్లగా ఉన్న ఆ చేతిని పట్టుకుని రోదించసాగాడు కొత్తగా వచ్చిన వృద్ధుడు.

"ఈ బాబా మీకు తెలుసా? " అడిగాడు కుర్రాడు.

"తెలుసు ఈయన నాకు మంచి మిత్రుడు"

"మీ పేరు? "

"మహావీర్" అని కుర్రాడితో అంటూ "అశోక్! నువ్వు కూడా వెళ్ళిపోయావా? " అని బిగ్గరగా ఏడవ సాగాడాయన.

"బాబా ఈ ఉత్తరం నాకు చదివి విని పించాలనుకున్నారు" తన చేత్తో పట్టుకున్న ఉత్తరాన్ని మహావీర్‌కు చూపిస్తూ మెల్లగా అన్నాడు కుర్రాడు.

"ఏదీ చూడనీ!" అంటూ ఆ ఉత్తరాన్ని కుర్రాడి చేతిలో నుంచి తీసుకుని పైకే చదివాడాయన.

"నాన్నా! నేను మూడేళ్ళ తరువాత మారిషస్‌కు బయల్దేరుతున్నాను.

అక్కడకు వచ్చిన తరవాత... మీకు ఇచ్చిన మాట తప్పక నిలబెడతాను.

అమ్మ కన్న కలలను నిజం చేస్తాను.

ఇదివరకు ఇక్కడ నుంచి అక్కడకు వలస వెళ్ళిన వాళ్ళందరూ చెమటోడ్చి కష్ట పడి, రెక్కలు ముక్కలు చేసుకుని పని చేసి, మారిషస్‌లోని భయంకరమైన అడ వులను చెరుకు తోటలుగానూ, పంట పొలాలుగానూ, బంగారు గనులుగానూ మార్చారనేది ఎవరూ కాదనలేని సత్యం.

అందుచేత వాటిమీద మనవాళ్ళకు కూడా సర్వహక్కులూ ఉంటాయి.

మనవాళ్లందరూ గట్టిగా కృషిచేసి.. ఆ హక్కులను సాధించుకోవాలి.

ఇకమీదట మన వాళ్ళెవరూ అక్కడ బానిసలుగానూ, కూలీలుగానూ కుళ్ళిపో కుండా చూస్తాను నేను.

ఈ విషయంలో మనపెద్దలకూ, వృద్ధు లకూ ఆసరాగా నిలబడటానికి... సమర్ధ వంతమైన యువతరాన్ని తయారు చేస్తాను.

మీ విజయ్"

చదవటం పూర్తిచేసిన మహావీర్ పెదవు లమీద విజయగర్వంతో కూడిన చిరు దర హాసం మెరిసింది.

"విజయ్ అంటే ఎవరో తెలుసా? ఈ బాబా రెండో కొడుకు" అని కుర్రాడితో చెప్పాడాయన.

ఆ మాటలలో కించిత్ గర్వం తొంగిచూ సింది.

"ఆయన తన జీవిత చరిత్రను చక్కటి కథగా మలచి.. నాకు చెప్పారు.

ఆ కథలోని మహావీర్ తమరేనా బాబా!" కుతూహలంతో అడిగాడు కుర్రాడు.

"అవును ఆ పాపిష్టి మహావీర్‌ను నేనే బాబూ" అని ఆయన అంటూ ఉండ గానే...

పెద్ద పెద్ద అలలు భయంకరంగా చప్పుడు చేస్తూ, ఉవ్వెత్తున ఎగసిపడుతూ అటుగా రావటం గమనించిన కుర్రాడు, ఆ పెద్దాయన చెయ్యి పట్టుకుని... ఆయన్ని ఈడుస్తూ మరోపక్కకి... దూరంగా... మరికాస్త దూరంగా పరుగులు తీశాడు.

ఆ అలలతోపాటు అశోక్ శర్మగారి శరీరం కొట్టుకుపోయింది.

దూరంగా నిలబడి రోదిస్తూ చూస్తున్న వారిద్దరి రోదనలూ భయంకరమైన ఆ సాగర ఘోషలో కలిసిపోయాయి. ©

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**చాట్ల విశ్వప్రమోద్**
ఇంటి.నెం. 5-8-469,
అశోక్‌నగర్ కాలనీ, కామారెడ్డి,
నిజామాబాద్ జిల్లా, పిన్: 503111

## చతురంగం - 19 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 కా | ర్తీ | 2 కం | | 3 ప్ర | గ | 4 తి | | 5 వి | 6 వా |
| మ | | 7 కం | ఠ | ము | | 8 న | ర | క | ము |
| 9 ము | 10 క్కం | టి | | 11 ఖు | 12 రా | ను | | ట | |
| | రొ | | 13 అ | డు | గు | | 14 నౌ | క | 15 ము |
| 16 శో | | 17 స | మ | | 18 లు | 19 జా | | 20 వి | ర |
| 21 క | 22 ల | క | ల | 23 ము | | 24 మా | త | | ఖ |
| 25 ము | స | లం | | 26 షా | మా | త | | 27 అ | |
| | వ | | 28 రా | యి | | | 29 జి | నా | 30 ప |
| 31 త | | 32 నా | గ | రా | 33 జు | | | 34 మి | థ్య |
| 35 సం | బ | ర | ము | | 36 పుం | డ | రీ | క | ము |

### సరైన సమాధానాలు రాసిన వారు

1. టి. నాగేందర్ శర్మ, సంగారెడ్డి 2. వి.ఆర్. అల్లమరాజు, కాట్రేనికోన, 3. పి.ఆర్. నాయుడు, తిరుపతి, 4. ఉడాలి భాస్కరయ్య, అడయార్, చెన్నై, 5. చుండూరు శకుంతల, బాచుపల్లి, హైదరాబాద్, 6. కె. కృష్ణమూర్తిరావు, హిందూపురం, 7. ఆర్. గోపాల్‌రావు, బండ్లగూడ, హైదరాబాద్, 8. అనంతుల సుబ్బారావు, గుంటూరు, 9. బోడపాటి కృష్ణవేణి, టి. నగర్, చెన్నై, 10. వై. శివశంకర్‌రెడ్డి, తిరుపతి, 11. డా. శివభూషణం, కర్నూలు, 12. డా. జనార్ధన సింగ్, కాచిగూడ, 13. యల్లాప్రగడ కృష్ణమూర్తి, అలకాపురి, హైదరాబాద్, 14. చామిరాజు గిరిజాశంకర రావు, హైదరాబాద్, 15. కొమ్మరాజు భానుమతీదేవి, వనస్థలిపురం, 16. పి. క్రిష్ణారావు, మౌలాలి, 17. కన్నేపల్లి నారాయణమూర్తి, శ్రీకాకుళం, 18. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 19. ఆలూరి పార్థసారథి, చెన్నై, 20. తల్లాప్రగడ భాస్కరరావు, న్యూ నల్లకుంట, 21. జి. సత్య, అలకాపురి, హైదరాబాద్, 22. మొహమ్మద్ ఖాసిం, కల్లూరు గూడెం, ఖమ్మం జిల్లా, 23. వెల్మల మణి చందన, మంకమ్మతోట, కరీంనగర్, 24. అత్తిలి కస్తూరిబాయి, తిరుపతి, 25. ఇ.ఎల్. నరసింహారావు, మధిర, ఖమ్మం జిల్లా, 26. పప్పు శ్రీదేవి, అమలాపురం, 27. నండూరి నాగేశ్వరరావు, బేగంపేట, 28. కె.వి.జె. దాస్, మైలార్‌గడ్డ, సికింద్రాబాద్, 29. తటవర్తి రామకృష్ణ, తాళ్లగూడ, హైదరాబాద్, 30. ఆదుర్తి విజయామూర్తి, విశాఖ, 31. పి.వి. లక్ష్మీసుజాత, జె.జె. నగర్, సికింద్రాబాద్, 32. సి. నిర్మల, తిరుపతి, 33. డి. ఇందుమతి, ఎ.ఎస్. రావు నగర్, 34. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో.జిల్లా, 35. వి. రామచంద్రయ్య, పొదుగుపాడు, గుంటూరు జిల్లా, 36. దారా హరితాశ్రీనివాస్, తిరుపతి, 37. కరణం సత్యనారాయణ, చెట్టుపల్లి, విశాఖ జిల్లా, 38. కె.ఇ. నిలమంగై, ఈస్ట్ ఆనంద్‌బాగ్, 39. ఎం.వి.జె. శర్మ, అరసవిల్లి, 40. ఎన్. రఘురామమూర్తి, మీర్‌పేట్, 41. బద్దేపూడి లక్ష్మీసుశీల, చీరాల, 42. జె. విజయలక్ష్మి, ట్రూప్‌బజార్, 43. ఎస్. విమలామూర్తి, జనగామ, 44. పి.ఆర్. తల్లాప్రగడ, బెంగళూరు, 45. యు.యు.యు. ఎమ్మిగనూరు, 46. ఆర్. భూలక్ష్మి, తిరుపతి, 47. పి. దేవసేనమ్మ, సిద్ధార్థనగర్, హైదరాబాద్, 48. మద్దూరి లక్ష్మీరాజ్యం, హైదరాబాద్, 49. వడ్లమూడి శ్రీవాణి సుష్మ, ముదినేపల్లి, కృష్ణాజిల్లా, 50. వి.ఎన్. మూర్తి, గుడిమల్కాపూర్, 51. గుండిమెడ శ్రీదేవి, పటమట, విజయవాడ, 52. ఎం. రాచంద్రరావు, హిల్‌కాలనీ, నల్గొండ జిల్లా, 53. జి. నాగేశ్వరి, మెహిదీపట్నం, 54. వి.ఎన్. రుక్మిణి, గుడిమల్కాపూర్, 55. తల్లాప్రగడ మధుసూదనరావు, బెంగళూరు, 56. డా. ఇమ్మిడిశెట్టి చక్రపాణి, అనకాపల్లి, 57. కరణం శివానందరావు, బెంగళూరు, 58. పి.సి. సుజాతశాస్త్రి, గుంటూరు, 59. వారణాసి జానకీదేవి, అమలాపురం, 60. ఎస్.ఎస్.ఆర్. ఆచార్యులు, గర్భాం 61. టి. కమల, ఖమ్మం, 62. ఎ. విఘ్నేశ్వరరావు, పర్లాకిమిడి, 63. మేడేపల్లి శేషు, న్యూఢిల్లీ, 64. పి.వి. రవికుమార్, తిరుపతి, 65. ఎన్.వి. రమణి, బంజారాహిల్స్, 66. కొమ్మాజోస్యుల రాజేశ్వరి, విశాఖ, 67. కె. సుధాదేవి, చీరాల, 68. కె.స్వరలయ, చీరాల, 69. బిక్కునూరి రాజేశ్వర్, నిర్మల్, 70. తోకల నరేంద్రకుమార్, ఇంకొల్లు, ప్రకాశం జిల్లా, 71. రాయిడి భవానీదేవి, గుంటూరు, 72. గరికిపాటి ఇందిర, కాకినాడ, 73. ఆంధ్ర అచ్యుతరామయ్య, తణుకు, 74. కె.వి. లక్ష్మణరావు, మానేపల్లి, తూ.గో.జిల్లా, 75. కె. చంద్రశేఖరశర్మ, నంద్యాల, 76. ఇందన మల్లికార్జున్ రావు, ఏలూరు, 77. ఎస్. మణిమేగల, తిరుపతి, 78. రామకూరు లక్ష్మి, శ్రీకాకుళం, 79. ఆర్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 80. ఆర్.వి.సి.హెచ్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 81. గుర్రపు పురుషోత్తం, హన్మకొండ, 82. మల్యాల ప్రసన్న శుభలక్ష్మి, హైదరాబాద్, 83. ఎస్. రామకృష్ణ, సఫిల్‌గూడ, సికింద్రాబాద్, 84. సి. అల్వాల్‌రెడ్డి, సరూర్‌నగర్, 85. బమ్మిడిసుబ్బారావు, రిట్టపాడు, శ్రీకాకుళం జిల్లా, 86. తోటపల్లి శశికళాధర్, గుంతకల్లు, 87. పి.వి. రంగాచార్యులు, వనస్థలిపురం, 88. టి. విద్యాసాగర్, రామకృష్ణాపురం, విజయవాడ, 89. దేవులపల్లి లలిత, ఉయ్యూరు, 90. కైలా భవ్యకుమారి, రేపల్లె, 91. టి.ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి, 92. జి. అమరేశ్వరి, ప్రొద్దుటూరు, 93. పాలగుమ్మి విశ్వనాథం, సికింద్రాబాద్, 94. కె. కృష్ణయ్య, కల్వకుర్తి, 95. పి. ప్రమీల, కొత్తపేట, హైదరాబాద్, 96. వంగపల్లి శ్రీనివాస్, నల్లకుంట, 97. దుప్పల రవికుమార్, టెక్కలి.

